# ఈ సంచికలో



ముఖచిత్రం : ఉష-చిత్రలేఖలు

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు : చక్రపాణి

సంపుటి 9 ఫిబ్రవరి 1964 సంచిక 2


నాగార్జున సాగర్ నిర్మాణాన్ని కేంద్ర ప్రభుత్వ ప్రాజెక్టుగా పరిగణించి దానిని త్వరలో పూర్తి చేయడానికి అవకాశం కలిగించమని ఆంధ్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వాన్ని అర్థిస్తూ వుంది. కేంద్ర ప్రభుత్వం ఇంతవరకూ, ఈ అభ్యర్థనకు ఆమోదాన్ని తెలుపకపోవడమే కాక, ఈ ప్రాజెక్టు నిర్మాణానికి కావలసిన డబ్బును అప్పుగా మంజూర్ చెయ్యడంలోకూడా చెప్పరానంత లోభత్వం చూపుతున్నది.

డబ్బు చాలకపోవడం వల్ల, నాగార్జున సాగర్ నిర్మాణం జరుగవలసినంత చురుకుగా జరగడంలేదు. పైగా, ఈ ప్రాజెక్టు నిర్మాణానికి విస్తారంగా డబ్బు పెడుతూ వున్నందున, ప్రతి సంవత్సరమూ రాష్ట్ర ప్రభుత్వము మిగతా కార్యక్రమాలకు కావలసిన డబ్బును పెట్టలేక పోతున్నది. ఆంధ్ర ప్రజలపట్ల సానుభూతి గల వారు కేంద్ర ప్రభుత్వంలో వున్నట్లయితే, పరిస్థితులు ఇలా వుండేవిగావు.

ఇటీవలివరకు కేంద్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రిగా వున్న శ్రీ మురార్జిదేశాయ్‌కి, ఆంధ్ర రాష్ట్రంలోని నిర్మాణ కార్యక్రమాలపట్ల ఏమాత్రం సానుభూతి లేదన్న మాట స్పష్టంగా అందరికీ తెలిసినదే.

మంత్రి పదవినుంచి ఉద్వాసన చెప్పబడిన తరువాత, గత డిసెంబర్ నెలలో మురార్జిగారు ఆంధ్ర దేశానికి వేంచేశారు. డిసెంబర్ 24 వ తేదీన వీరికి విజయవాడ మునిసిపల్ కౌన్సిలు స్వాగతాన్ని చెప్పింది. ఆ సభలోనే రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు ప్రసంగిస్తూ నాగార్జున సాగర్ లాంటి పెద ప్రాజెక్టును కేంద్ర

ప్రభుత్వం తన అధ్వర్యంలోకి తీసుకొని, నిర్మాణం పూర్తి చేయాలని చెప్పారు దానికి జవాబుగా, అప్పటికప్పుడే, తాను కేంద్ర ప్రభుత్వంలో ఏ పదవినీ నిర్వహిస్తూ వుండకపోయినప్పటికీ, తగుదునమ్మా అంటూ, మురార్జిగారు, తాము సంజీవరెడ్డిగారి భావాలతో ఏకీభవించ జాలమనీ, తక్కిన రాష్ట్రాలన్నీ కూడా యిలాగే కోరినట్లయితే కేంద్ర ప్రభుత్వం మాత్రం డబ్బును ఎక్కడనుంచి తెస్తుందనీ తమ భావాలను వ్యక్తంచేశారు.

మురార్జిగారి భావాలను ఎరుగనివారు దేశంలో ఎవరూలేరు. తమ భావాలతో మాత్రంతప్ప ఇతరుల భావాలతో ఏ మాత్రం మురార్జిగారు ఏకీభవించ రనికూడ అందరికీ తెలుసు. 1958 నుంచి 1963 సగంవరకు అయిదేళ్ళు ఆర్థిక మంత్రిగా వున్నారు, మురార్జిదేశాయ్. ఈ అయిదేళ్ళలోను, వారి స్వరాష్ట్రమైన గుజరాత్ ఎంతగా అభివృద్ధి పొందిందో ప్రపంచానికి తెలియని విషయంకాదు. అసలు గుజారాత్‌రాష్ట్రం, ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినది, 1960 మే 1 తేదీన. కాని, అలా ప్రత్యేక రాష్ట్రం కాబోతున్న దనేసంగతి, రెండేళ్ళ ముందుగానే అందరికీ తెలుసు; మురార్జిగారికీ తెలుసు. అంచేతనే, గుజరాత్‌రాష్ట్రం ఏర్పడే టప్పటికి, మహారాష్ట్రంలోని బొంబాయితో సమానంగా వుండగల రేవుపట్టణాన్ని ఏర్పాటు చెయ్యడంకోసం, గుజరాత్‌లోని కాండ్లాను బాగా అభివృద్ధి పరచి పెద్దరేవుగా తయారు చెయ్యడానికి కేంద్ర ప్రభుత్వం చాలా డబ్బును ఖర్చు పెట్టింది. గుజరాత్ రాష్ట్రం ఏర్పడిన తరువాతకూడా, యీ రేవు అభివృద్ధికి విస్తారంగా ధనం ఇవ్వబడింది. ఇదంతా ఎవరి డబ్బు? దేశంలోని ప్రజలందరిదీ కాదా?

1953 లో ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రానికి, పదేళ్ళు గడచిపోయినా ఇప్పటివరకూ మంచిరేవును నిర్మించే ఆలోచనే లేని కేంద్ర ప్రభుత్వం, 1960 లో ఏర్పడిన గుజరాత్‌కు చక్కని రేవును ఏర్పాటు చేసిపెడుతూవుంటే, ఆంధ్రు లెవరైనా వద్దన్నారా! ఎన్నో రేవులు, ఎన్నో పరిశ్రమలు వున్న గుజరాత్ రాష్ట్రం ఇంకా, ఇంకా అభివృద్ధిలోకి వస్తూవుంటే, బాధ పడిన ఆంధ్రుడు ఒక్కడైనా వున్నాడా!

అలాటప్పుడు, పరిశ్రమ లనేవి ఏ మాత్రమూ లేక, రైల్వే సౌకర్యాలు తగినంతగా లేక, విదేశ వ్యాపారానికి వసతులు గలిగిన రేవుపట్టణం ఒకటీ లేక, గొప్ప నదులు రాష్ట్రంలో ప్రవహిస్తూవున్నా, లక్షల ఎకరాలకు నీటివసతి లేక, తక్కిన రాష్ట్రాలకు ఎంతో వెనుకబడివున్న ఆంధ్ర రాష్ట్రం, ఒక్కగానొక్క పెద్ద ప్రాజెక్టు నిర్మాణాన్ని ప్రారంభిస్తే, ఇరుగు పొరుగు రాష్ట్రాలేకాక, రెండు రాష్ట్రాల వెనుక వున్న రాష్ట్రాలుకూడా కళ్ళెర్ర చేసుకొని, ఆంధ్ర రాష్ట్రపు పురోగతికి అవరోధాలను

కలిగించడానికి ప్రయత్నించడం శోచనీయం. తక్కిన రాష్ట్రాలుకూడా ఇలాగే సహాయాన్ని అర్థిస్తే కేంద్రప్రభుత్వం డబ్బు ఎక్కడనుంచి తెస్తుంది, అని విజయవాడ పౌరులను ప్రశ్నించిన మురార్జిగారు, యీ సుద్దులను గుజరాత్ ప్రజలకు చెప్పలేక పోయాడేమి? ఇతర రాష్ట్రాలవారు ఆర్థిక సహాయాన్ని అర్థించకుండా వుంటే కేంద్రప్రభుత్వం చెయ్యగల సహాయాన్నంతా తన రాష్ట్రానికీ, తన నాయకత్వాన్ని బలపరచే రాష్ట్రాలకూ కట్టపెట్టడమేనా ఈయన చెప్పిన మాటలలో అంతరార్థం

కేంద్ర ప్రభుత్వం డబ్బును ఎక్కడనుంచి తెస్తున్నది? దేశంలోని అన్ని ప్రాంతాలలోని ప్రజలు ఇచ్చే పన్నులే కదా - కేంద్ర ప్రభుత్వానికి వచ్చే ఆదాయం దేశంలోని అన్ని ప్రాంతాలూ సమానంగా అభివృద్ధిలోకి రావడానికి వీలైన పద్ధతిలోనే గదా, యీ ఆదాయాన్ని వినియోగించవలసినది।

పన్నులను విధించడానికి ఉన్న అవకాశాలు, రాష్ట్ర ప్రభుత్వాలకు చాలా తక్కువ ఉన్న అవకాశాలలో అత్యధికభాగం కేంద్రప్రభుత్వమే తనచేతిలో పెట్టుకున్నది ఆ అవకాశాలను పూర్తిగా వినియోగిస్తూ, కేంద్ర ప్రభుత్వం ఏటేటా పన్నులను ఎక్కువ చేస్తూవుంది. రాష్ట్ర ప్రభుత్వాలుకూడా, అభివృద్ధి కార్యక్రమాల పేరు చెప్పి, తమకు వున్న కాస్త అవకాశంలోనూ పన్నులను ఎక్కువ చేసుకుపోతున్నాయి. అయినా, డబ్బు చాలక రాష్ట్రాలు అవస్తపడుతున్నాయి. పన్నులు ఇవ్వలేక ప్రజలు అల్లాడుతున్నారు. సంపాదన మార్గాలు ఎక్కువైతేగాని, జీవయాత్ర సాగించడానికికూడా ఉపాధి లేక ఎన్నో మధ్యతరగతి కుటుంబాలుకూడా అడుక్కు తినవలసిన పరిస్థితి ఏర్పడబోతున్నది. సంపాదన మార్గం లేకపోతే, మధ్యతరగతి కుటుంబాలవారు, పూర్వం అప్పులమీద బ్రతికేవారు. ఇప్పుడు అప్పులు పుట్టే అవకాశాలు పూర్తిగా హరించిపోయాయి.

ఇలాంటి పరిస్థితులలో, ప్రజలు బ్రతకాలంటే, వారికి సంపాదన మార్గాలు ఎక్కువకావాలి. ఉద్యోగ వసతులుగాని, వృత్తి వసతులుగాని ఎక్కువగా ఏర్పడాలి. అలా జరగాలంటే, గుజరాత్, మహారాష్ట్ర, మదరాసు, మైసూర్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోనే గాక, తక్కిన అన్నిరాష్ట్రాలలోకూడా, వ్యవసాయ ప్రాజెక్టులు, పరిశ్రమల ప్రాజెక్టులు విస్తారంగా ప్రారంభించాలి. వెనకబడిన రాష్ట్రాలకు తక్కిన రాష్ట్రాలకంటె ఎక్కువగా కేంద్ర ప్రభుత్వం సహాయం చెయ్యాలి.

నిన్న మొన్నటిదాకా కేంద్ర ప్రభుత్వంలో పెద్ద పదవులలో వుండి, మళ్ళీ ఆ పదవులకోసం తాపత్రయ పడే పెద్దలు, దేశమంతా సమానంగా అభివృద్ధిలోకి రావాలనే గొప్ప బుద్ధితో ఆలోచించాలి.




"అదృష్టవంతుణ్ణి, అయ్యగారిదగ్గర లేను."



"ఏమిటీ : ప్రాణభయం లేదూ ? అయితే భీమా సొమ్ము 30 వెలకూ తిలోదకాలేనా ?"



అంతర్జాతీయ ప్రాచ్యభాషాశాస్త్ర కాంగ్రెస్ ఆశియా విభాగమునకు అధ్యక్షులైన జెకె వి. తోగన్, ఇటీవల హైదరాబాదు విచ్చేసినప్పుడు, సాలార్ జంగ్ మ్యూజియం తిలకిస్తున్న దృశ్యం.

---

హిమాలయాలపైనుండి పడున్న నీరు మంచుగా గడకటుకుని వ్రేలాడుతున్న దృశ్యం.



హైద్రాబాద్ ఎగ్జిబిషన్‌లో సమాచార పౌర సంబంధముల శాఖ
ప్రదర్శనశాల ముఖద్వారము.

కేంద్ర విద్యాశాఖా మంత్రి శ్రీ ఎమ్. సి. చాగ్లా జనవరి 21, 1964న మధురలో
అఖిల భారత విద్యార్థి విన్యాసమున ఉపన్యసిసున్న దృశ్యం.




అబ్బ చాల
బరువుగా ఉంది.




ఏయ్
కూలి






పాపం మీరు మోయలేరు
నే తెస్తా ఇవ్వండి

# ఊహాకందని కథ

రాజ్యలక్ష్మికి ఒళ్లు మండింది. లేచి నుంచుంది.

'ఇదిగో కాముడూ, లోకంలో నీకొక్క దానికే కాలంవిలువ తెలుసుననీ తక్కిన వాళ్లందరూ పనీపాటా లేకుండా వీధిలో తిరుగుతున్న వాళ్లనీ నీ ఉద్దేశం కాబోలు-ఇది మూడోసారి నేను రావడం-నీ కంతగా మాట్లాడ్డానికి తీరుబడి లేకపోతే ఇక నిన్ను ఇబ్బంది పెట్టనులే'

కామేశ్వరి పకపక నవ్వింది.

'మనం సెకండ్ఫారం చదువుతున్నప్పుడు జరిగిన సంగతి జ్ఞాపకమొస్తూం దోరాజూ, నిన్నూ నీ కోపం చూస్తూంటే.... ఓసారి మనిద్దరం పుస్తకాలు పట్టుకు నడుస్తూంటే ఓ కుర్రాడు 'ఇదిగో రాజ్యలక్ష్మి' అని పిలిచాడు, జ్ఞాపకముందా? 'ఎవర్రా ఆ పిలిచింది?' అని చేత్తో పట్టుకున్న స్కేలుతో వాడి కళ్ళు తిరిగేలా ఒక్క టంటించావు.... ఆ కుర్రాడు మొహం ఇంతచేసుకుని 'ఇదేమి టమ్మాయ్, జేబురుమాలు పారేసుకున్నావని తీసి, యిద్దామని పిలిచాను. బలే బహుమతి యిచ్చావే.... 'ఫైర్ యింజను'లా యిక ముందూ వెనకా చూసుకోడం లేదు కాబోలు' అని బుర్ర తడుముకుంటూ పోయాడు. ఆ పేరే తరవాత నీకు సార్థక నామధేయం అయింది గుర్తొచ్చిందా?'

'అయితే ఏమిటీ నువ్వనేది?'

'నిజానికి పేరయితే అలా ఉందిగాని 'ఫైర్ యింజన్' చేసే పనేమిటి? మంటలని ఆర్పడానికే కదూ అది వెళ్లేది!'

'నువ్వు సెకండ్ఫారానికి సైన్సు చెబుతావని అందరికీ తెలుసుగాని నన్నెందుకు 'బోర్' చేస్తావ్?'

'అదుగో ఆ తొందరపాటే తగదు... ముక్కుమీద కోపం ఉంటే ఉండుగాక....మా రాజు చల్లనిరాజు. నాకు తెలియదూ? మరొక్క అరగంట ఆగుతేగాని వెన్నెలరాదు మరి' కామేశ్వరి నవ్వుతున్నది నవ్వుతున్నట్టు వెళ్లిపోయింది. హైస్కూలికి క్యాజువల్ లీవు పెట్టకపోతే మానిపోయిరి ప్రైవేటు పిల్లల్ని రెండ్రోజులు రావద్దని చెబితే వచ్చిన నష్టమేమిటో! ఏమయినా రాజ్యలక్ష్మి కోపం చప్పగా చల్లారిపోయింది. ఏమీ తోచక కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరగజొచ్చింది.

ఇవతలి గదిలో కామేశ్వరి వాళ్ల



అవసరాల రామకృష్ణారావు

నాన్నగారు ఎవరో పెద్ద మనుషులతో మాటాడుతున్న మాటలు స్పష్టంగా వినబడుతున్నాయి.

'అయితే అబ్బాయి ఏం చదువు తున్నాడంటారు?'

'ఏమోబాబూ .... కంపెనీవాళ్ళు స్కాలర్ షిప్ యిచ్చి పంపేరా, వెళ్ళింది దూరాభారమా, చదివేది బ్రహ్మాండమయిన చదువా, మనవాడికి చూడబోతే అఖండమయిన తెలివి తేటలా, వాళ్ళు పర్మిషన్ యివ్వాలా, వీడికి శలవు దొరకాలా, బయలు దేరాలా రావాలా....'

ఇవతలి వాళ్ళలో ఒకతను నవ్వుతూ అన్నాడు కాస్త నెమ్మదిగా....

'పంతులుగారికి వినికిడిశక్తి తగు మాత్రం తగ్గిందని తమకు మనవిచేసి నట్టు జ్ఞాపకం....కాస్త గట్టిగా శల విస్తే ...'

'తమరే శలవియ్యండి .... నా కొంచెం గొంతుక వెలుగురాసింది.

'అబ్బాయిగారు ఎంతవరకూ చదువుకున్నారని అడుగుతున్నారు' అని అరచాడాయన ఇంట్లో దొంగలు పడితే అరచే స్వరంతో.

'ఏమో బాబూ....విద్యకు అం తేమిటి? విజ్ఞానానికి దరేమిటి? తీసిన కొద్దీ గొయ్యి పెద్దదైనట్టు చూసినకొద్దీ ప్రపంచం విశాలమౌతూంటుందిట. వెనకటికి గోపాలకృష్ణగారని అఖండ మైన జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడుంటే ఆయనకిచూపించాం వీడిజాతకం.అందు లోనిఅంతూ దరీ కనిపించని విద్యారేఖ చూసి ఆయన అంతటి పొడుగుపాటి ముక్కు మీదా వేలేసుకున్నాడు! అబ్బాయి చదివిన చదువు మన పల్లె టూరిలో లేక, పట్నం పంపించాం. అక్కడా లేక రాజధానికి తరలించాం. వీడికి సరిపడ్డ చదువు అక్కడా లేదం డోయ్....అప్పుడు కేంద్రానికే ఫిరా యించాం. అక్కడైతే మాత్రం వీడి పాండిత్యానికి తగ్గ విశ్వవిద్యాలయాలు ఏవీ? ఆ సరస్వతమ్మ కరుణించాలిగాని మనం ఆటంకపరుస్తే మాత్రం ఆగు తారుటండీ? ప్రస్తుతం అమెరికాలో రీసెర్చి చేస్తున్నాడు-నామటుకు నేను చెప్పుకోకూడదు ... తల్లి దండ్రులకి ఖ్యాతి తెచ్చేవాళ్ళు పిల్లలుగాని కన్నవా రందరూ పిల్లలుటండీ కంద పిలకలు గాని!'

'వయ సెంతుంటుంది?'

'ఏమోబాబూ ... ఇంటికి అడపా తడపా పంపుతూనే ఉంటాడు సొమ్ము. ఇంకా బుద్ధిమంతుడు కాబట్టి ఇంటి నుంచి సొమ్ము పంపమని రాయడు. అయినా మన దేశమూ, మన ఖర్చులా? అయిదు రూపాయలు అక్కడ పెడితే గాని ఈవర మేనా చెయ్యరుట. అయి నింటిబిడ్డ కాబట్టి, వ్యసనా లేవీ ఒంట బట్టలేదు కాబట్టి....మా వాడు కాబట్టి



"ఇదో మిమ్మల్నే !...ఇలా వచ్చి టైము చూసి నాకు ఆకలి వేస్తుందేమో చెప్పా లని తెలీదూ ?!......"

పంకంలో ఉన్నా పద్మంలా గడుపు కొస్తున్నాడు. మరొక డయితేనా ?'

'ఏమండోయ్ శాస్త్రిల్లుగారు, మిగిలిన భోగట్టాలు ఎవర్నైనా అడిగి తెలుసుకుందాం గాని కట్నం ఎంతో కనుక్కోండి. మన దరిదాపుల్లో ఉంటే మాటాడుకోవచ్చు-లేకపోతే యిక్కణ్ణుంచే జారుకోవచ్చు. పెళ్ళికొడుకు మాట దేముడెరుగు గాని ఈయనతో మాట్లాడేసరికి దవడలు సలుపుతున్నాయ్'

'చిత్తం కదుపుదాం ఉండండి—కిందటిసారి అరిచేసరికే నాకు కంఠనాళం కాస్త వాచినట్లయిందా' అని శాస్త్రులుగారు పంతులుగార్ని యిలా చూడండి అన్నట్లు సంజ్ఞ చేసి నేలమీద వ్రేలితో 'కట్నం ఎంత ?' అని రాశారు. ఆయన కళ్ళజోడు చివర్నించి కోపంగా చూసి 'అలా రాయవలసిన అవసరం లేదు. మొన్న ఈ మధ్య జబ్బు చేసి నప్పట్నుంచీ యిదిగో యీ చెవికి వచ్చింది. అదైనా బ్రహ్మచెవు డేం కాదు. మరి కాస్త బిగ్గరగా కెలవిస్తే స్పష్టంగా నాటుతుంది. ఇంతకీ మనవాడుండే పట్నం ఎంత దూరమునా తమ సందేహం ? సహస్ర యోజనా లుండొచ్చేమో !' అన్నాడు.

'బావగారూ ! శల విప్పించండి-

మళ్ళీ తీరికగా కలుసుకొందాం. పద వయ్యా శాస్త్రుల్లూ-ఇలాంటిసంబంధం మాత్రం ఎప్పుడూ తీసుకురాకు. వియ్యంకుడికి వినపడదు, కనపడదు-పెళ్ళికొడుకు ఊడిపడడు, కనపడడు-చాలు!' వాళ్ళు వెళ్ళిపోతుంటే రాజ్యలక్ష్మి పకపక నవ్వుకుంది. ఇంతలో పొరుగింటికి పురాణ కాలక్షేపానికి వెళ్ళిన తులసమ్మ చేతికర్ర ఆనించుకుంటూ లోపలికి వచ్చింది. నుదుటికి అడ్డంగా అరచెయ్యి ఆనించి-

'ఎవరమ్మా, నువ్వాటే సుందరమ్మా' ఎవరో అనుకున్నాను, ఎంత సేపయిందీ వచ్చి ?' అంది. రాజ్యలక్ష్మి ముసిముసి నవ్వులు నవ్వుతూ,

'నేనండీ రాజ్యలక్ష్మిని .... ప్లీడరు గారి అమ్మాయిని .... కులాసాగా ఉన్నారా దొడ్డమ్మగారూ' అంది.

'నువ్వా రాజూ .... మునపట్లా చూపు ఆనడంలేదు తల్లీ, మరోలా అనుకోకు.... నీ మొగుడు బాగున్నాడా అమ్మాయీ....పిల్లలా ?' అనడిగింది.

'ఇద్దరు మొగపిల్లలండి....ఆయన దగ్గిర వదిలేసి వచ్చాను....'

'ఏం చోద్యమే అమ్మాయీ...., వేలెడంత వెర్రివెధవలు వెక్కసమై అత గాడికి అంటగట్టి వచ్చేశావా ? .... బాగుంది వరస .... కాము దేదీ, కనిపించిందా ?'

'ఆఁ, పిల్లలికి ట్యూషన్లు చెబుతున్నట్టుంది-ఇప్పుడే వస్తానని చెప్పి ఇక్కడ కూచోబెట్టి వెళ్ళింది.'

'ఏం ట్యూషన్లో ఏం లోకమో.... ఒక్కొక్క_ర్తి అడుగు పెట్టిన చోట అంతా నాశనమే....'

'ఎవరి గురించి దొడ్డమ్మగారూ మీరు చెబుతూంట ?'

'ఏమేప్ రాజూ-అది నీ స్నేహితురాలై తే అయిందిగాని దాన్ని మాత్రం నాముందు వెనకేసుకురాకు, నా ఒళ్ళు మండిపోతుంది. అయినా ఇంత వయసు వచ్చాక యింక నా నోటికి అడ్డేమిటి? ఇంతకీ భగవంతుడు మా మొహాన ఇలా రాసిపెట్టేడు. ఈ ఆఖరికాలంలో కొడుకూ కోడలూ చేస్తూండగా వాళ్ల చేత చేయించుకునే అదృష్టం మాకూ లేదు-మా ఆస్తి తినే అదృష్టం వాళ్లకీ లేదు—సరేలే పడిన గోడలు పడినట్టే ఉంటాయా ? మా రాము శేషు రాకనూ పోడు, మమ్మల్ని ఉద్ధరించకనూ పోడు !'

రాజేశ్వరి అర్థం కానట్టు వింటూ కూచుంది. ఇంతలో కామేశ్వరి రానే వచ్చింది.

'క్షమించు రాజూ..కొంచెం ఆలస్యమైంది.....ఈ రాత్రికి నువ్వింక రావని మీ యింటికి మా ప్రైవేటు కుర్రాడి చేత కబురంపించేశానులే....అలాగేనని మీ అమ్మగారి దగ్గిర్నుంచి పర్మిషన్

కూడా వచ్చింది .... ఇంత సేపూ వేచి ఉన్నావ్ .... ఈ పత్రికలు చదువు కుంటూ యింకొక అరగంట ఓపిక పట్టేవంటే ఇక ఈ రాత్రంతా మనదే.'

నిజంగా ఇంకొక అయిదు నిమషా లేనా ఉండడానికి రాజ్యలక్ష్మికి యిష్టం లేదు. కాని ఆ యింటి సంగతి పూర్తిగా బోధపరచుకోవాలనే తహతహ ఆమెను చెయ్యిపట్టుకు కూచో పెట్టింది.

చీకటి పడినకొద్దీ ముసలాయన చిరాకు ఎక్కువైపోయింది. చిన్న చిన్న విషయాలకే చిందులు త్రొక్కడము ప్రారంభించాడు.

'ఈ బిందె దగ్గర చెంబు కనపడిచావ దేం? దార్లో ఈ బాల్చీ ఏమిటి? ముసిలాడు త్వరలో 'బాల్చీతన్నెయ్యా లని' యీ యింటివాళ్ళ కోరికా? ఇంట్లోవాళ్ళందరూ ఏమయ్యారు? ఒకమారే చచ్చారా ఏమిటి?'

కామేశ్వరి ఏమీ జవాబుచెప్పలేదు. ఆమె కళ్ళలో మెరుపు తగ్గలేదు, మొహంలో విసుపు హెచ్చలేదు. లోప ట్నుంచి గోరువెచ్చటి నీళ్ళు తెచ్చి తండ్రి పాదాలు కడిగింది — గావంచా పెట్టి తుడిచింది. చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళి పీటమీద కూచో పెట్టింది. ఆ సరికే తులసమ్మగారు అక్కడ చేరింది.

'ఎన్ని చేసినా చచ్చిననాడు నా నెత్తిన యింత నిప్పుపెట్టేది వాడు గాని ఇది కాదు కదా! ఇంతకీ నా కన్న తండ్రి రావాలి, నా దినం తీరాలి. ఊఁ, ఆ వండిందేదో ఇలా తగలెయ్యి' అంటున్నాడు ఆయన.

'అయినా కాముడూ, అంటే ఏడు స్తావుగాని ఆ వచ్చిన అమ్మాణ్ణి అలా కూచోపెట్టి ఆ బరిచెప్పడం ఏమి టంటా? నువ్వేదో గణించి మాకు పోస్తున్నావని లోకమంతా అనుకోవా లనా? ఇంత బతుకూ బతికీ ఇంటి వెనక చచ్చినట్టు ఆఖరికి నీ చేత చేయించుకోడ ముందే మహా ప్రారబ్ధ కర్మం తల్లీ!' అని తులసమ్మ అందు కుంది. కామేశ్వరి మాటాడకుండా వడ్డిస్తున్నది, ఒకసారి తలెత్తి తండ్రి చెవిదగ్గర నోరుపెట్టి గట్టిగా 'నాన్నా అన్నయ్య ఉత్తరం రాశాడు. ఈ ఏడాదితో వాడి చదువు అయిపో తుందిట...వచ్చే ఏడు తప్పకుండా వచ్చేస్తాడుట. మీకు మరీమరీ నమ స్కారాలనీ, మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమనీ రాశాడు' అంది. అప్ప టికి పంతులుగారు కంచంలో చెయ్యి కడిగేసుకున్నాడు. ఈ మాట వినగానే ఆనందోద్రేకముతో మరి లేవలేక పోయాడు. కనీ కనిపించని ఆయన రెండు కళ్ళలోంచీ ఊటలూటలుగా దుఃఖం పెల్లుబికి వచ్చి రెండు చెంపల మీదా ధారలు కట్టింది.

'నా తండ్రి నా బాబు ఎంత అభిమానమో వాడికి...ఈ కాస్త చూపైనా నిలుస్తుందో లేదో, ఈ కొన ఊపిరైనా ఉంటుందో లేదో... త్వరగా వచ్చెయ్యి బాబూ...ఇంకేమి రాశాడే అమ్మాయ్...ఏదీ ఆ ఉత్తరం, అదీ నా కళ్ళజోడూ ఎక్కడుందో పట్రా.'

కామేశ్వరి ఎడంచేత్తో కళ్ళనీళ్ళు తుడుచుకొని గదిలోకి వెళ్ళి అక్కడున్న శ్రీరామ పట్టాభిషేకం పటం ముందు అయిదు నిమిషాలు నిలబడి. అలాగే తండ్రి దగ్గరకు వెళ్ళడం రాజ్యలక్ష్మి గమనించింది. 'పుస్తకాలమధ్య పెట్టేను నాన్నా ... ఎక్కడ జారిపోయిందో ఎంత వెతికినా కనిపించడములేదు...సంగతులు చెప్పేనుగా!' అంది చెవిలో చెవిపెట్టి మళ్ళీ గట్టిగా.

'ఏడవలేకపోయావ్! అసలు వాడి మాటంటేనే నీకు గిట్టదు. చూస్తున్నానుగా...లేకపోతే అలాంటి ఉత్తరం అంత అశ్రద్ధగాపారేస్తావా...' తులసమ్మగారు కూడా శ్రుతి కలిపింది. వాళ్ళు అక్కడుండగానే కామేశ్వరి తండ్రిగదిలోకి వెళ్ళింది. రెండు మంచాలూ వాల్చింది. దుప్పట్లు దులిపి పక్కలు వేసింది. తండ్రి మంచంక్రింద బేసిన్ పెట్టింది. తల్లి మంచం కింద మరచెంబుతో నీళ్ళు పెట్టి అందులో రెండు వలుదోము పుల్లలు పడేసింది. ఒకప్రక్క అందుబాటులో ఉండేటట్లు ఇత్తడి చెంబుతో నీళ్ళు, తువ్వాలూ పెట్టింది. తండ్రిని నెమ్మదిగా లేవదీసి మంచంమీద కూచోపెట్టింది. గ్లాసులో మందు పోసి బలవంతాన త్రాగించింది. చేతికర్ర తీసుకెళ్ళి తల్లికిచ్చింది. నెమ్మదిగా గదిలోకి నడిపించుకు వెళ్ళింది. ఇంతలో ముసలావిడికి ఏమో విమానించింది.

"ఏమిటీ అమ్మాయ్ అదీ? విమానము చప్పుడు కాదూ?'

'అవు' నన్నది కామేశ్వరి.

'ఏమండోయ్ విమానం, విమానం' అని తులసమ్మగారు గట్టిగా అరచింది.

'ఒసే అమ్మాయ్, ఎక్కడ చచ్చేవే ... ముందు నా కళ్లజోడు ఇలా అందుకో'.

ఆతృతగా కళ్లజోడు పెట్టుకుని పడుతూ లేస్తూ ముసలాయనా, కర్ర పట్టుకుని కంగారుగా ముసలావిడా పెరట్లోకి పరిగెత్తేరు. మెడ యిరుకు పట్టేలా తల ఎత్తి కళ్ళు చించుకు చూశారు. ఆ కటిక చీకట్లో వాళ్లకేం కనిపించిందో తెలీదు. ఏం వినిపించిందో తెలీదు.

'ఇలాంటి విమానంమీదే మన బాబు వస్తాడు....' అంది తులసమ్మ

'ఏ రేమనుకున్నావు? మన వాడు ఉత్తరం రాసినా విమానం మీదే వస్తుంది, నీకు తెలుసునా? రైల్లో




"నన్ను రాణీని చేస్తానని తీసుకొచ్చావు గుర్తుందా ?"
"అవును, ఇప్పుడు రాజాలే పోయారుగా ; ఇంక రాణీ లెక్కడ ఉంటారు ?"

ఉన్నట్టే విమానంలో కూడా పోస్టు డొక్కుంటుందే వెర్రి మొహమా!'

'మరి, అందులో ఉత్తరాలు పడేస్తే, దార్లో పడిపోవుటండీ?'

పంతులుగారు 'ఒహ్హో హ్హో హ్హో' అని ఇల్లెగిరిపోయేలా నవ్వేడు.

'తెలియక అడిగాను'.... దానికి పేద్ధ అంత నవ్వెందుకో! ముదిమిని మూడు గుణాలు ఎక్కువౌతా యంటారు ఇందుకే కాబోలు' అని ఉన్న రెండు పళ్లూ కొరికింది తులశమ్మగారు.

'అమ్మగారూ'అని ఎవరో కుర్రాడు నెమ్మదిగా పిలుస్తే కామేశ్వరి వీథిలో కెళ్లింది.

'ఇదిగో నండీ, ఈ ఎయిర్ కండిషన్ జాకట్టు గుడ్డేమో నాలుగున్నర అయింది. కొబ్బరి బోండమేమో ఆరణాలు. మిగిలిన బేడా ఇదిగో అని' వస్తువులూ డబ్బూ అప్పజెప్పేడు. రాజ్యలక్ష్మి అంది;

'నీకేం మతిపోయిందా ఏమిటే, ఎందు కిప్పు డివన్నీ ?'

'బాగుంది. రాకరాక ఆడకూతురు యింటికొస్తే యింత పసుపూ కుంకుమా యివ్వక ఉత్తి చేతుల్తో పంపమంటావా !' అంటూ.

'అయిన ఆలశ్యం చాలు. భోం చేద్దాం లోపలికి రా' అని స్నేహితు

* * *

భోజనాలైనతరువాత వాళ్ళిద్దరికీ డాబామీద పక్కలు వేసింది. రాజ్యలక్ష్మి అటూ ఇటూ దొర్లుతూండగా కామేశ్వరి యిన్ని ఆకులూ చెక్కలూ తెచ్చి 'మా తుని తమలపాకులు జగద్విఖ్యాతి చెందినవి. నవులు' అని ముందు పడేసింది. తరువాత ఒక అయిదు నిమిషాలు కళ్ళు మూసుకుని పడుకుని చటుక్కున ఇటు తిరిగి —

'ఏమే రాజూ, మీ ఊరి విశేషాలేం చెప్పావ్ కావు? మీ రిద్దరూ అన్యోన్యంగా ఉంటారా? మీ ఆడపడుచు సంబంధం కుదిరినట్టేనా?' అని అడిగింది. రాజ్యలక్ష్మి జవాబు చెప్పలేదు.

'ముంగిలా మాటాడవేమే?'

'అబ్బే, ఇంత గడుసుదనం ఎప్పుడు నేర్చుకున్నావా అని ఆలోచిస్తున్నాను. ఇంతలా ఎప్పుడు మారిపోయావా అని ఆలోచిస్తున్నాను. నీగురించి అన్నీ తెలుసు నని అనుకునేదాన్ని. ఒక్క పూట నీతో గడిపితే నీగురించి నాకేం తెలియదని స్పష్టమైపోయింది - ఇప్పటికి, నే నొచ్చిన ఇన్ని గంటలకు తీరికైంది నీకు. ఇంకా నువ్వేదైనా చెప్తావేమో విందామని నేను సిద్ధంగా ఉండి నిన్ను ప్రశ్నిస్తున్నావే ని చమత్కారం నీకే చెల్లు'

కామేశ్వరమ్మ మృదువుగా నవ్వింది.

'నా గురించి అంత తెలియని గూడార్థ మేముందే?'

'నీకిష్టమైతే చెప్పు. లేకపోతే మానెయ్. నాకు సంబంధం నిశ్చయమైందనీ, పెళ్ళి నాకిష్టమే ననీ నీతో వచ్చి చెప్పిననాడు నువ్వేమన్నావో నాకు గుర్తులేకపోలేదు. 'సరే నీ కర్మ దానికి నే నేం చెయ్యగలను? నేను మాత్రం క్లాసు లన్నీ చకచక మేడ మెట్లెక్కినట్టు ఎక్కేయ్యకమానను చదువు అంతు నేనేనా చూడాలి, నా అంతు అదైనా చూడాలి. అంతే' అనే దానివి. స్కూలుఫైనలు అయిపోగానే సెకండరీ గ్రేడు ట్రైనింగ్ అయ్యే కర్మం నీ కేం వచ్చింది? పెళ్ళి పెడాకులూ లేకుండా ముసలితల్లిదండ్రులకు సేవచేస్తూ వాళ్ళ తిట్లూ ఛీవాట్లే ప్రతిఫలంగా స్వీకరించేయోగం నీ కేం పట్టింది? అన్నిటినీ మించి అయిదు నిమిషాలేనా ఖాళీ లేకుండా యంత్రంలా పనులు చేసుకుంటూ అతి సంతుష్టిగా కనబడే భాగ్యం నీ కేం అబ్బింది? తెలిసి చెప్పకపోయావో...

'నా కేం అవదు గాని అర్థం కాక నీ తలే వెయ్యి చెక్కలౌతుంది. విక్ర

మార్కుడంత వెర్రి దాన్ని కాదు నేను, బేతాళీ!'

'ఇద్దరూ నవ్వుకున్నారు. నెమ్మది నెమ్మదిగా కామేశ్వరి ఆరంభించింది.

'నీదగ్గర నా రహస్యాలు దాగవు. నేనే దాచుకోలేను.... తెలుసుకున్నది ఎంతటి రహస్యమైనా బడబానలంలా కడుపులో పెట్టుకుని కడలిలా గడప గలవని నాకు తెలుసు. అందుకే నిన్ను ఇవాళకి ఉంచేశాను.

రాజ్యలక్ష్మి నిశ్శబ్దంగా వింటోంది. కామేశ్వరి క్రిందికెళ్ళి ఒక కవరు తెచ్చి ఇది చదువు, అంతా నీకే తెలుస్తుంది' అని ఆమె కిచ్చింది.

'ప్రియసోదరి కామేశ్వరికి-మీఅన్న రామశేషారావు అనేక ఆశీర్వచనలు. అమ్మా నాన్నా కులాసాగా ఉన్నారని తలుస్తాను .... వారికి నా హృదయ పూర్వక నమస్కారములు అందజెయ్యి. అదెంతటి నిప్పులాటిదయినా నిజం అనేది ఎప్పటికయినా బయట పెట్టక తప్పదు. నాకు రెండేళ్ల క్రితమే పెళ్ళయింది. అమెరికన్ యువతిని పెళ్ళి చేసుకున్నాను. ప్రస్తుతం ఒక మగబిడ్డ కూడా. ఇంక మూడేళ్ళలో యిక్కడ పద్ధతుల ప్రకారం అమెరికా పౌరుడిగా నేను పరిగణింపబడతాను.



నేను ఇక్కడ స్థిరపడిపోయాను నేను వస్తానని ఇక ఎటువంటి ఆశా పెట్టుకో వద్దు. ఇంతకీ ఇంత గా చదువుకుని నే నా పల్లెటూరు వచ్చి బావుకునే దేముంది? ఇదే నా ఆఖరి ఉత్తరం. జవాబు వ్రాయొద్దు.'

రాజ్యలక్ష్మి తన కళ్ళను తనే నమ్మ లేకపోయింది. అది నిజమా కలా అని ఆ ఉత్తరం పరీక్షించడంలో ఆమెకు దారుణమైన మరొక సత్యం తెలుసు కొచ్చింది. ఆ లేఖ రెండేళ్ళ క్రిందటిది!

'ఈ లేఖ చేరేసరికి నేను పియ్యూసీ చదువుతున్నాను. నాన్నగారి దృష్టి సరిగా ఉండ దని అన్నయ్య ఎప్పుడూ నా పేరనే ఉత్తరాలు వ్రాసేవాడు. అంతకుముందు ఒక నెలక్రిందట నాన్న గారికి 'హార్టు ఎటాక్' వచ్చింది.డాక్టరు గారు నన్ను పిలిచి'

'అమ్మాయ్, మీ నాన్నగారి స్థితేం బాగులేదు. బ్లడ్ ప్రెషర్ బాగా ఎక్కు వగా ఉంది. ఆయనకి పూర్తిగా విశ్రాంతి ఇయ్యాలి. ముఖ్యంగా మనస్సు వ్యాకులపడే విషయా లేమీ చెప్పకూడదు .... పూర్తిగా. 'సాల్ట్ లెస్ డయిట్' యివ్వాలి. నువ్వు చూస్తే చిన్నపిల్లలా వున్నావు...మీఅన్నయ్య ఎక్కడో ఫారెన్‌లో ఉన్నాడని విన్నాను. ఆయన్ని పిలిపించు ..మళ్ళీ మళ్ళీ యిలా ఎటాక్సు వస్తే ఈయన బ్రతకడం కష్టం ఏమయినా నా నమ్మకాన్నిబట్టి ఒక ఏడాది దాటదు అని చెప్పేరు. అన్నయ్యకు అన్ని విష యాలూ రాద్దామనుకొంటూండగా వాడి దగ్గిర్నుంచే యిప్పుడు నీకు చూపించిన ఉత్తరం వచ్చింది. ఆ పరి స్థితుల్లో నాకు దిక్కూ దరీ తోచలేదు. మొట్టమొదట స్వార్థపరు డని అన్న య్యని నోటి కొచ్చినట్లు తిట్టు కున్నాను. అంతట్లో నాకే అనిపిం చింది 'వాడు వచ్చి మాత్రం ఏం చెయ్యాలి గనుక? ఇలాంటి చిన్న ఊళ్ళో వాడి చదువుకు సరిపడే ఉద్యోగం ఏం దొరుకుతుంది గనుక? వాడినైనా సుఖపడనీ' అని నేనే సర్ది చెప్పుకున్నాను. మా అమ్మ బొత్తిగా లోకజ్ఞానం లేనిది. ఏ పురాణానికో హరికథకో వెళ్ళి ఎలాగో కాలక్షేపం చేసుకుని రాగలదు. మరి నాన్నమాట? ఆయన బాధ్యత? ఆయనకి యింతటి రోగంలో భయంకరమైన ఈ సత్యం ఎలా చెప్పను?' కామేశ్వరి ఆ ఉత్త రాన్ని ముక్క ముక్కలుగా చింపే సింది.

'అది ఆనాడు నేను చూశాను ఇప్పుడు మళ్ళీ నువ్వు చూశావు అంతే....ఇక ఈ సత్యం నాతో పోవల సిందే'

కామేశ్వరి కొంచెం మంచినీళ్ళు త్రాగింది చన్నీళ్ళతో మొహం కడు



"ఎవరి దా నీడ, అలా భయపడిపోతున్నా దేమండీ ?"
"వాడి భార్యా నీడ అయ్యుంటుంది !"

కుక్కుంది. మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

'నాన్నగారి జబ్బులకి మందుల కని డబ్బు చాలక – మాకొక పదెకరాల పొలం రాజవరంలో ఉండేదిలే – మూడేళ్ళనుండీ శిస్తులు బకాయి. శిస్తులు వసూలు చేసుకువద్దామని ఒకసారి నేనే బయలుదేరి వెళ్ళేను. కరణం గారు చెప్పిన మాట విని ఆశ్చర్య పోయాను. నాన్నగార్ని గుడ్డివారిని చేసి అన్నయ్య' అప్పుడే ఆ భూమి తన పేర రాయించుకున్నాడట. ఒక మధ్య వర్తిద్వారా అన్నయ్య ఆ భూమి అమ్మించి రెండేళ్ళు దాటిందిట! నేను ఇంటికి వచ్చేసరికి నాన్నగారికి మళ్ళీ ఎటాక్ వచ్చి అప్పుడప్పుడే కొంచెం తగ్గుతోంది. ఈ కబురుమాత్రం ఆయనతో ఎలా చెప్పేది? అన్నయ్య అక్కడ స్థిరపడిపోయాడన్న విషయం చెబితే ఆయనగుండె బ్రద్దలవుతుంది, సందేహం లేదు. నా చేత్తో నేను ప్రాణం తీసినదాన్నవుతానని ఆ సంగతి కప్పెట్టేను. దానితోపాటే ఇదీ దాచాను. కన్నవారి కన్నుగప్పిన నా నేరానికి ఆ పట్టాభిరాముడే సాక్షి. ఆ పరిస్థితుల్లో అంతకన్న చేసేదేముంది? ఇంక చెప్పడానికేముంది? చదువుతున్న చదువు చాలించి ట్రెయినింగ్ అయిపోయాను. అదృష్టవశాత్తూ ఇక్కడ హైస్కూల్లోనే ఉద్యోగం అయింది. నాన్న మందులకి, పళ్ళకి, టానిక్కులకి చాలదని ఓ అరడజనుమందికి ప్రైవేట్లుకూడా చెబుతున్నాను. నేను పోషించకపోతే ఈ రోజుల్లో ఈ అద్దెకొంపలో వెర్రిబాగుల మా అమ్మ, పిచ్చివాడైన మా నాన్న బ్రతికేది ఎలా? కాని వాళ్ళకి మొట్ట

మొదట్నుంచీ మొగపిల్ల లంటేనే పిల్ల లని అభిప్రాయం. ఎందుకూ పనికిరాని ఆడముండచేత పోషించబడడం వాళ్లకి ఎంతమాత్రం యిష్టంలేదు. కానియ్యి. వాళ్ళ అభిప్రాయాల్ని కాదనడ మెందుకు? అమాయకుల్ని మోసం చెయ్యడం ఎంతసేపు? నా జీతం నూరు రూపాయలైతే ఏభై అనే చెప్పేను. పైవేట్లు ఊరికే చెబుతున్నానని చెప్పేను. అన్నయ్య నెలకి కనీసం యాభై రూపాయిలు అక్కణ్ణుంచి పంపుతున్నాడనీ, ఆడబ్బే ఖర్చుపెడు తున్నాననీ చెబుతూ వస్తున్నాను. అప్పుడప్పుడు అన్నయ్యదగ్గిర్నుంచి వచ్చే ఉత్తుత్తి ఉత్తరాలు చదువుతూ వుంటాను. ఈ వంచన ఎందుకో తెలుసా రాజూ?'

రాజ్యలక్ష్మి జవాబుచెప్పే స్థితిలో లేదు. ఇరవైఏళ్ళు వచ్చినా ఆ వయ సుకి సరిపడ పొడవుగాని వెడల్పుగాని లేక సన్నగా పీలగా వున్న మనిషి, వెనక్కి వంకర తిరిగిన జానడే జానడు జడగల మనిషి, ఒక చాయ నలుపే గాక స్ఫోటకం మచ్చలు మొహం నిండా వున్న మనిషి-కురుస్తున్న మాన వత్వంతో మెరుస్తున్న నేత్ర ద్వయంతో ఇంతటి సర్వాంగ సౌందర్య శోభా విలాసిని ఎలా అయినట్టు!

'నువ్వే విన్నావుగదూ రాజూ, నడవలేరు, కదలలేరు .... అయినా నాన్న ఆకాశంవైపు కటిక చీకట్లో అయినా కన్ను చించుకు చూస్తారు, వాడి సంగతి తెలిక పిల్ల నిస్తామని ఎవ రైనా వస్తే చాలు గంటల తరబడి వాణ్ణి పొగుడుతారు. అన్నయ్య గురించి ఆలోచించడంలో, ఎన్నా ళ్ళయినా ఎదురుచూడ్డంలో ఆయనకు విసువులేదు. అదే ఆయన ఆశ. అదే ఆయన ఆకర్షణ. అదే ఆయన ఆయు ర్దాయం!' చూస్తూండగా కామేశ్వరి కళ్ళు భాష్పపూరితాలయాయి.

'ఏమే రాజూ! దాచక నాతో చెప్పు. క్రిందటిసారి వచ్చినప్పుడు నాన్నని చూశావ్, ఇప్పుడు చూశావ్ ఆయన స్థితిలో మార్పేమేనా కని పించిందా? ఆయన యింకా బతుకుతా రంటావా? ఎల్లకాలం నేనీ విధంగా మోసం చెయ్యగలనంటావా?' రాజ్య లక్ష్మి కామేశ్వరి రెండు చేతులూ కళ్ళ కద్దుకుంది; వణుకుతున్న కంఠంతో ఇలా అంది:

'మీ నాన్నను కన్న తల్లిదండ్రు లెవరో వాళ్ళెక్కడున్నా నిన్ను తప్పక దీవిస్తారు. నీ పట్టాభిరాము డెవడో ఆ దేము డెక్కడున్నా నిన్ను ఆశీర్వదిస్తాడు. ఆత్మార్పణ చేసుకుని మీ నాన్నగారికి ఆశ చూపించి ఆయుస్సు పోశావు. నిజానికి నీకన్న పై చదువులు చదువుకున్న దెవరు?'

# శాంతించిన సముద్రము

ఆఫీసునుంచి కాస్త ఆలస్యంగా బయలు దేరాల్సివచ్చింది వెంకటరమణ. వస్తూనే గదిలో ఓమూలన బూట్లువిడుస్తూ ఓరగంటితో నాలుగుమూలలా కలయ జూశాడు. కనుచూపు మేరవరకూ ఇంట్లో ఎవరూ కనబడలేదు. మనిషి అలికిడి కూడా లేనట్లే అనిపించింది. తలవంచు కుని గదిలో బట్టలు మార్చుకుని వంట యింట్లోకి తొంగిచూశాడు.

"మీకు గదిలోకి తీసుకురానా టిఫిన్?" సావిత్రి గ్లాసులో మంచినీళ్ళు పోస్తూ తల ఎత్తి చూసింది.

"ఎందుకు? నేనే వస్తాగా అక్కడికి ఎప్పుడూ వచ్చినట్టు" ఆశ్చర్యాన్ని తమా యించుకుని తువాలుతో ముఖం తుడుచు కున్నాడు.

"గదిలోనే బాగుంటుందిలెండి, ఇక్క డంతా చికాకుగా ఉంది" సావిత్రి అప్పటి కప్పుడే కుర్చీదగ్గరగా ఒకస్టూలు వేసి టిఫిన్ ప్లేటూ, మంచినీళ్ళగ్లాసూ పెట్టింది. కాఫీకప్పు చేతిలో పట్టుకు నిల్చుంది.

దిక్కులు చూస్తూ అరటికాయబోండా నములుతున్న వెంకట్రమణ "నీవుకూడా తీసుకో" అనా లనుకున్నాడు. కొంత సేపటివరకూ ప్రాణముకొట్టుకుపోయింది. కాని మాట్లాడకుండా పెట్టింది తిని బయట పడ్డాడు

అంతలో స్నేహితులు పిలిచారు. అటునుంచి అటే సినిమాకు తీసుకెళ్లారు. కబుర్లు చెప్పుకుంటూ బయలుదేరి ఇళ్ళకు చేరుకునేసరికి పదకొండు కావచ్చింది. ఆలస్యమయినా తలుపుతట్టీ తట్టడముతోనే తెరుచుకుంది.

వెంకటరమణను చూడగానే సావిత్రి భోజనం పెట్టి ఎదురులు చూడటము మొదలుపెట్టింది.

"నాకోసం ఎందుకు కూర్చున్నావు? భోజనం చెయ్యకపోయ్యావా?" అన్నట్టు ముఖంపెట్టి భోజనం చేశాడు.

సావిత్రి అతడికి కావలసిన మంచి నీళ్ళు మంచంక్రింద పెట్టింది. పలకరిస్తే కిలకిల్లాడుతూ కబుర్లు చెప్పేటట్టు ఉన్నది. వెంకటరమణ యధాప్రకారం పేపర్లు చదువుకుని ఫైల్సు చూసు కున్నాడు ఏమీ గమనించనట్టుగా.

వెంకటరమణ ఉంటున్న ఇంటిప్రక్క వాటాలోకి క్రొత్తగా ఎవరో వచ్చారు. ఆయన పదిగంటలకే ఆఫీసుకు వెళ్ళి పోతాడు, ఆవిడకు పిల్ల నెత్తుకోవట మయినా చేతకానట్టుంది. ఇంట్లో పని ముట్టుకుంటున్నట్లు కూడా కనబడదు. ఆయనతల్లి మోకాళ్ళ నొప్పులతో సణు క్కుంటూ పనిచేసుకుంటూ ఉంటుంది. భోజనాలు కాగానే పిల్లను ఎత్తుకుని

---

*ఇల్లిందల సరస్వతీదేవి*

---

వాకిట్లో నిలబడేది. సంకోచం లేకుండా వంటయింట్లోకి వచ్చి సావిత్రిని పలకరిస్తూ ఉండేది.

కొత్తలో సావిత్రి బెట్టుగా ఉన్నా ఆవిడ చనువు తీసుకుని పలకరిస్తుంటే కలుపుకు మాట్లాడక తప్పలేదు. మాటల సందర్భంలో తనకొడుకు రంగధామరావు విశాఖపట్నంలో ఆనర్సు చదువుకున్నాడని చెప్పింది.

ఆంధ్రా యూనివర్సిటీలో ఆనర్సు చదివిన రంగధామంపేరు వింటూనే సావిత్రి త్రుళ్ళిపడ్డది. ఆనాడంతా పని చెయ్యటంలో తడబడ్డ ట్టయింది. ఎన్నడూ లేనిది చేతిలోనుంచి వస్తువులు జారిపోతున్నాయి. ఫ్లాస్కులో కాఫీపోసి బల్లమీద పెట్టబోయింది. ధన్‌మంటూ కింద బడి ఫ్లాస్కు ముక్కలయింది. కాఫీ నేలపాలయింది. ఆనాడు వెంకటరమణకు మధ్యాహ్నం కాఫీ లేకుండాపోయింది.

సాయంత్రము వంటచేసి పెట్టుకుని వాకిటి తలుపు తెరుచుకుని సావిత్రి పత్రిక చదువుతున్నది. పక్కింటి ముసలమ్మగారు కూరగాయల బేరం చేస్తున్నది. ఆమె గలగల్లాడుతూ మాట్లాడు తుంటే చదవలేక పేపరక్కడ పడేసి తనూ కూరగాయలు బేరానికి లేచింది. వంకాయలు మెత్తటివి ఏరుతుండగా బూట్లశబ్దము వినవచ్చింది తలఎత్తి చూస్తే ఫుల్‌సూట్‌లో ఠీవిగా నడుస్తూ పక్కవాటాలోకి పోతున్నాడు రంగ ధామం.

గమనించినట్టు పైకి కనబడకుండా తలవంచుకుంది. కూరలు పట్టిచూస్తున్నట్టు చూసి చప్పున లోపలికి వెళ్ళింది. వంటయింట్లో ఏదో పని చెయ్యబోయింది. ధ్యాస నిలువలేదు. గదిలోకి వెళ్ళి వేసిన పక్క దులిపి మళ్ళీవేసింది. వెంకటరమణ బల్ల అంతా దులిపి కాగితాలూ పుస్తకాలూ సర్దిపెట్టింది. అతడి బట్టలు తాడుమీద వేళ్ళాడుతున్న వన్నీ తీసి మడత లేసింది. మనసు శాంతపడా లనీ, తొట్రుపాటు సర్దుమణగా లనీ ఆమె చేసిన ప్రయత్నాలు అన్నీ వ్యర్థ మయ్యాయి.

పక్కవాటా తలుపు సందుల్లోనుంచి దీపపు వెలుతురు నిలువుగీతల్లా కనిపిస్తున్నవి. మనుష్యుల రాకపోకల నీడలు ఇటూ అటూ ఆడుతున్నాయి.

'పిల్ల బుజంమీద నిద్రపోతున్నది. వాడికి వడ్డించకూడదూ తాయారూ!' ముసలమ్మ అటూ ఇటూ పచారు చేస్తున్నట్టు అడుగుల చప్పుడవుతున్నది.

'ఊఁ' అని మూలిగిన శబ్దము.

'పిల్లను పడుకోబెట్టి నీవు వడ్డించవమ్మా'.

'నాయనా! దాన్ని ఒక్కసారయినా బయటికి తీసుకువెళ్ళారా పాపం.'

'అన్నం తినటానికి తీరిక లేదుకాని సినెమాలట. నా కాగితాల కట్టలు చూస్తూ కూడా అట్లా అంటావేం?'





ఈ మాటలన్నీ ఎవరెవరి మధ్య జరుగుతున్నాయో కంఠధ్వనులను బట్టి సావిత్రి గ్రహించింది. కూడదనుకుంటున్నా మనసు అటే నిలిచింది. తలుపులు నెట్టుకుని వెంకటరమణ లోపలికి వచ్చాడు. అతడిని చూడగానే లేచి వంటయింట్లోకి వెళ్ళి ఇద్దరికీ భోజనము తయారుచేసింది. అతడు పీటమీదకూర్చోగానే తనుకూడా భోజనము చేయటము మొదలు పెట్టింది. అతడు కావలసిన పదార్థాలు వడ్డించుకోబొయ్యాడు. అతడి చేతిలో గరిట సావిత్రి అందుకుని తానే వడ్డించింది.

భోజనము అయిన తరువాత అతడు ఫైల్సులో తల దూర్చాడు. సావిత్రి తలలో పూలు సర్దుకుంటూ అతడు విడిచిన చెప్పులకు మట్టి దులిపి గోడవారగా పెట్టింది. ఎదురుగుండా కుర్చీ వేసుకుని నవల చేతబట్టుకుని పేజీలు తిప్పటము మొదలుపెట్టింది.

ఉదయము తొమ్మిదిగంటల కిల్లా ఇటీవల లభ్యమవుతున్న తన కమ్మటి ఖౌజ నాన్ని గురించి ఏవేవో ఊహలు ఊహించుకుంటూ చిరునవ్వలతో వెంకటరమణ ఆఫీసుకు వెళ్లాడు సావిత్రి తడితువ్వాల ఎండవేయడానికి పెరట్లోకి వెళ్ళింది. రంగథామం విసురుగా అడుగులు వేసుకుంటూ లోపలికి వెళ్ళాడు. తరువాత కొంచెము సేపటికి ఖణేలుమన్న శబ్దము వినవచ్చింది

"ఎందుకురా అంతపని చేశావు? అన్నంపళ్ళెం తన్నుకుంటారా ఎవరయినా? ఇదేం కోపంరా?"

సావిత్రి తలవంచుకుని లోపలికి వెళ్ళింది.

మధ్యాహ్నం పిల్లవాడిని పడుకోబెట్టి

రంగథామంభార్య సావిత్రి గదిలోకి వచ్చింది. సావిత్రి కిటికీలో కూర్చుని వెంకటరమణ ప్యాంటుకు పగిలిన గుండీలు తీసి కొత్తవి కుట్టుతున్నది. ఆమెను చూడగానే సావిత్రి చాప వేసి కూర్చోమన్నది.

రంగథామంభార్య తాయారు చూడటానికి బాగానే ఉంటుంది. కాని దిద్దుబాటు తక్కువ. తల దువ్వుకుని బొట్టు పెట్టుకుంటేనే ఆకర్షణీయంగా ఉంటుంది. కాని ఆ పని శ్రద్ధగా ఉదయమూ చెయ్యదు; సాయంత్రమూ చెయ్యదు. ఎగుడు దిగుడుగా చీరె కట్టుకుని కొంగు జార్చుకుని నేల ఊడుస్తూ తిరుగుతుంది.

"అబ్బాయి పడుకున్నాడేమిటి. ఎప్పుడు లేదు ?" అని అడిగిందిసావిత్రి; కూరలు ఏం వండుతున్నారని అడగలేక.

"వాడు నా ప్రాణాని కో యముడనుకోండి. రాత్రీ పగలూ కూడా నిద్ర పోనీయడు."

"అయితే మీ కొక్కడేనా యముడు!" అన్నది సావిత్రి నవ్వుతూ.

"నా జన్మకు నిద్రపోయినంత సేపే సుఖ మనుకోండి. ఈ భాగ్యానికి మానాన్న ఎనిమిది వేలు పోశాడు."

"మనం క్రొన్నవన్నీ బాగా ఉంటాయా చెప్పండి. సరేకాని మీరు ఈ ఊళ్ళో నాలుగు మూలలా వెళ్ళి చూశారా ? పార్కు, మ్యూజియమ్, కోట వెళ్ళారా?"

"ఎక్కడండీ ! ఇంట్లో ప్రశాంతంగా అన్నం తింటే చాలు" తనను గురించిన ప్రశ్నలే సావిత్రి వెయ్యటము తాయారుకు విసుగనిపించింది. తన సంగతి మర్చి పోవాలనీ ఒక నిమిష మయినా మనసు ప్రశాంతంగా ఉంటుందేమోననీ వచ్చింది మళ్ళీ యిక్కడా అదే ప్రసక్తి.

"మీరు కాని మీ వారు కాని ఇంట్లో ఉన్నట్లే కనబడదు. మీ యిద్దరి మాటా మేము ఇక్కడికి వచ్చిన తరువాత విన లేదు. అబ్బ ! ఎంతచక్కగా సర్ది పెట్టు కున్నారు ఇల్లు ? ఇంటిమీద మీ కెంత శ్రద్ధో !"

సావిత్రి నవ్వింది.

"మీ కెంత ఓపికమ్మా ఎప్పుడూ ఇల్లు సర్దుతూనేఉంటారు?" అన్నది తాయారు

మళ్ళీ నవ్వింది సావిత్రి.

వెంకటరమణ ఆనాడు ఆలస్యంగా యింటికి వచ్చాడు. ఆఫీసులో పని ఎక్కువయింది. ఉసూరుమంటూ గుండె చేత బట్టుకొని యింట్లో అడుగు బెట్టాడు బెరుకు బెరుకుగా.

"రాత్రిళ్ళు ఆలస్యంగా వస్తున్నారు పని ఎక్కువయినట్టుంది. ఇలా ఉంటే ఆరోగ్యం చెడిపోతుంది. ముందు భోజనం చేద్దురుగాని రండి" సావిత్రి అతడిని భోజనాల యింట్లోకి తీసుకు వెళ్ళింది అన్నం వడ్డించింది. ఇద్దరూ భోజనాలకు కూర్చున్నారు.

"పోనీ అక్కడ ఒక కప్పుపాలు తెప్పించుకోకూడదూ ? ఇంత రాత్రివేళ



"అలా పంటితో గోళ్ళు కొరికితే పళ్లు నొస్తాయి, ఇదో ఈ బ్లేడు తీసుకోమ్మా...య్!"

వస్తూ కూడా మల్లెపూలూ మరువమూ ఎట్లా జ్ఞాపకం పెట్టుకున్నా రండీ ?''

ఆ మాట కతడు తుల్లిపడ్డాడు. కొత్త వాతావరణము అతడిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. తనెక్కడ? మల్లెపూ లెక్కడ? అవి తనను చాలా దూరంలో ఉంచాయి. అతడు తల వంచుకుని అన్నం తింటు న్నాడు. పక్కవాటాలో దీపపు కాంతి తళుక్కు మంటున్నది. పేపరు తిప్పు తున్న చప్పుడు కాబోలు రెపరెపలాడు తున్నది.

సావిత్రి ముఖం ఉండి ఉండి ప్రకా శిస్తోంది. ఏదో చెప్పబోతున్నట్లుగా పెదవులు విప్పుకుంటున్నాయి. అతడి కేమీ అర్థము కావటము లేదు. కాక పోయినా మనసు విప్పుకోబోయింది. తనకు కూడా మనిషి కున్న గౌరవము వస్తోంది. కొందరి జీవితాలలో ఈ గౌరవము ఎప్పుడు కలుగుతుందో ఎవరూ చెప్పలేరు. ఇన్నాళ్ళనుంచీ రాయిగా ఉన్న మనసు ఇప్పు డంత మొండిగా లేదు.

సావిత్రి ఈ నాలుగు నెలలనుంచీ అతడిలో మార్పు తీసుకురావా లని ప్రయత్నిస్తోంది. కాని అది మార్పుగా కాక అతిసహజంగా చిరకాలంగా ఉంటు న్నట్లుగా ఉండా లని శ్రమపడుతున్నది. అతడు వేళకు యింటికి రావాలి. ఇద్దరూ కలిసి సినెమాలకు వెళ్లాలి. పార్కులలో తనను వెంటబెట్టుకుని తిరగాలి. ఇంట్లో కిలకిల్లాడుతూ ఉండాలి. తనను అన్నింటికీ అతడు మెచ్చుకోవాలి. అన్నిటికంటె

ముఖ్యంగా సాయంత్రము ఆరూ ఏడు గంటలవేళ సావిత్రీ అని ప్రేమ ఉట్టిపడే టట్లు పిలవాలి. తమ యిద్దరి కలయిక ఎంతో ఆదర్శంగా ఉండాలి. వాగర్థాల వలె-క్షీరనీరాలవలె ఒకరిలో ఒకరు ఐక్య మయిపోవాలి. అట్లానడుచుకోవాలిద్దరూ.

సాయంకాలము ఆరూ ఏడు గంటల వేళ పక్క వాటాలో ఉన్న రంగధామం ఆఫీసునుండి ఇంటికి వచ్చేవేళ, పిల్లవాడు ఆకలికి ఏడ్చేవేళ ఆతల్లి వాడిని నాలుగు తిట్టి నేలకు వేసికొట్టేవేళ, అతడువచ్చిన గంటకు తల్లిగాని, భార్యగాని సణుగుతూ కాఫీగాసు అందిస్తారు. అందుకో ఎందుకో చిటపటలాడుతూ ఒక్కోరోజు కాఫీ గ్లాసులు విసురుతూ కేకలు పెట్టూ ఉంటాడు. అటువంటి వేళ ఆ యింటి వాళ్ళంతా వింటూ ఉండగా ముఖ్యంగా రంగధామం చెవిన బడేటట్టుగా ఆప్యా యంగా సావిత్రీఅని వెంకటరమణపిలిస్తే వినేవాళ్ళు అసూయపడేటట్టుగా ఎంత మధురంగా ఉంటుంది?

వెంకటరమణకు ఇన్నేళ్ళకు తన పుట్టిన రోజున్న మాట చెవినబడ్డది. బాల్యంలో తల్లి ఏం చేసిందో అతడికి తెలియదు. గులాబ్‌జాము, వెంటబుల్ కట్‌లెట్సూ, అతడికి యిష్టమనుకుని చేసిన సేమ్యాపాయసమూ జరీఅంచుల ధోవతీ, ఇంట్లో సరససంభాషణా...

సావిత్రి యీ వంటకా లన్నీ పక్క వాటాలో యిచ్చి 'మా వారి పుట్టినరో జని' చెప్పింది. ఆ సాయంత్రము తానే బలవంతముచేసి వెంకటరమణను సినెమాకు బయలుదేరతీసింది. రాత్రి యింటికి వచ్చిన తరువాత కిలకిల నవ్వుతూ ఎన్నో కబుర్లు చెప్పింది. అతడు అప్పుడప్పుడు ఊఁ ఆఁ అంటూ ఆశ్చర్యాన్ని అణుచుకుంటున్నాడు. అప్పటి కింకా పక్కవాటాలో దీపము వెలుగుతున్నది. పడకకుర్చీలో పడుకుని రంగధామం పేపరు చదువుతున్నట్టు కనబడుతున్నది. పక్కవాటా తలుపు సందుల్లోంచి వస్తున్న వెలుగు వైపు చూస్తూ ఉంటే ఉత్సాహము పొంగులు వారి ఆమె కిచకిచలాడిపోతున్నది.

పొద్దున్నే పాలవాడి కోసం సావిత్రి కిటికీలోనుంచి తొంగిచూస్తున్నది ఏడు న్నరకు అమితి చికాకుతో కాఫీ గ్లాసందు కునే రంగధామం చూస్తూఉండగా తాను ఆరింటికి నవ్వుతూ వెంకటరమణకు కాఫీగ్లాసు అందించాలి. గబగబా పాల చెంబు అందుకుని డికాక్షను దింపి పాలు పొయ్యిమీద పెట్టింది.

* * *

ఆంధ్ర యూనివర్సిటీలో సావిత్రి యింటరు చదివేటప్పుడు రంగధామం ఆనర్సు చదువుతున్నాడు. కాలేజీ విద్యార్థు లలో కల్లా అతడు బ్రైటుస్టూడెంటని పేరు చదువులోనేకాక ఇతర ఆటల పోటీ ల్లోనూ వక్తృత్వ పోటీలలోనూ నాటకా లలో వేషాలు వెయ్యటములోను అతడి





పేరు ప్రథమశ్రేణికి చెందింది విద్యార్థులకు అన్నిటిలో అతడు నాయకుడు. అతడు ఎవరితో నయినా మాట్లాడా డంటేనే ఎంతో అదృష్ట మనుకునేవాళ్ళు. ఉపాధ్యాయులకు కూడా అత డంటే ఎంతో మన్నన

ఆడపిల్లలకు మగపిల్లలో కలిసి నాటకాలలో వేషాలు వెయ్యటమంటే ఎంతో భయముగా ఉండేది. ఎవరూ తూగి వచ్చేవారుకారు. అందుకని ఉపాధ్యాయులు అభ్యుదయ ఉత్సవాలలో నాటకాలు వద్దన్నారు. రంగధామానికి నాటకా లంటే ఎంతో అభిమానము; నటించట మంటే ఎంతో యిష్టము. కాని స్త్రీ పాత్ర లేని నాటకము ఏం బాగుంటుంది? ఎవరు స్త్రీ పాత్ర అభినయించటానికి అంగీకరిస్తారు? ఉపాధ్యాయు లెంత చెప్పినా వినక తాను ఒప్పించి తీసుకు వస్తానని ఉపాధ్యాయులకు మాట యిచ్చాడు.

ఆ రోజు క్లాసు లయిపోవటంతోటే ఆడపిల్లల రూము దగ్గర నిలబడ్డాడు, ఎవరయినా బయటకి వస్తే పలకరిద్దా మని. అందరూ లోపల చేరి కిచకిచలాడుతున్నారు; కాని ఒక్కరూ బయటకి రాలేదు. అతడు లోపలికి పోవటానికి వీలులేదు. పావుగంటసేపు తలుపు మీద దృష్టి వుంచి నిలబడ్డాడు. అదృష్టం కొద్దీ ఆయా అటు పోతూ కనబడ్డది. ఎవరి నయినా బయటికి రమ్మని ఆయాచేత చెప్పిపంపాడు. వెంటనే సావిత్రీ సుబ్బలక్ష్మీ బయటికి వచ్చారు.

వాళ్ళిద్దరితోటి అతడు ' అభ్యుదయ ఉత్సవాలను గురించి మాట్లాడాడు. కార్య

క్రమమంతా చెప్పాడు. నాటకాల సంగతి చెప్పి స్త్రీ పాత్రల సంగతి వివరించాడు.

"మీలో ఎవరయినా యువరాణి పాత్ర వెయ్యాలి."

"బాబో! యువరాణి పాత్రే! స్టేజీమీదికి వచ్చేసరికి కాళ్ళు వణుకుతాయి" అన్నది సుబ్బలక్ష్మి కళ్ళు గుండ్రంగా తిప్పుతూ.

"మరి స్త్రీ పాత్రలేని నాటకమే లేదు. స్త్రీ పాత్ర మీరు నటించకపోతే ఇంకెవరు నటిస్తారు? మగవాళ్ళు నటిస్తే ఏం బాగుంటుంది?"

"ఆ వేషం ఎవరు వేస్తారండీ! వేసి మర్నాడు కాలేజికి రావటమే? గోడ సాహిత్యంలోకి ఆ పిల్ల పేరు ఎక్కిపోదూ? మాకు కాలేజిలో చదవటమూ నాటకాలు వేయటమూ కాక జీవితంలో ప్రధానమయిన ప్రయోజనాలు ఉన్నాయిగా మరి. వాటిని ఇవి కించపరచకూడదు" సావిత్రి ధైర్యము తెచ్చుకుని గట్టిగా మాట్లాడింది.

"మీరు చెప్పిన దంతా నేనూ ఒప్పుకుంటాను. మన కందరికీ ప్రధానమయింది మీరు చెప్పిందే. కాలేజీల్లో చదవటమూ అభ్యుదయ ఉత్సవాలలో పాల్గొనటమూ మన సాంఘిక జీవితాన్ని ఉన్నతస్థితికి తీసుకుపోతాయి గాని కించపరచవు. నా ఉద్దేశ్యంలో ఎవరికీ ఎటువంటి దురభిప్రాయము ఉండదని" రంగథామం వేడుకుంటున్నట్టుగా ముఖం దీనంగా పెట్టాడు.

"మీరు అనుకో రనుకోండి. లోకం మాట ఏమిటి?"

"ఇతరుల సంగతి మనకెందుకు? వ్యక్తియొక్క ఔన్నత్యాన్ని విలువ కట్టడము అందరికీ సాధ్యంకాదు. సావిత్రి గారూ! నా కోరికమీద మీరు యువరాణి పాత్ర ధరించాలి. మీ ముఖంలో మాటలో నడకలో ఆ హుందాతనము ఉన్నది. ప్లీజ్, ప్లీజ్, నా అభ్యర్థనను తోసిపుచ్చవద్దు."

సావిత్రి క్రీగంట రంగథామాన్ని చూసింది. కాలేజీ విద్యార్థుల కందరికీ అతడు నాయకుడు. వీరోచితగాంభీర్యము ముఖముమీద తాండవిస్తున్నది. మాట్లాడితే రాజులు కత్తిమీద చెయ్యివేసినట్టుగా ప్యాంటుజేబులోకి చెయ్యిపోనిస్తున్నాడు. మధ్యమధ్య ఉత్తమాశయాలను గురించి ఉపన్యాసాలు దంచుతున్నాడు. కొంతసేపటికి సావిత్రిమనసు మెత్తపడ్డది. సరే నని ఒప్పుకున్నది. అతడు కృతజ్ఞత తెలుపుతూ ఉంటే పున్నమినాడు చంద్రుడితో కరచాలనము చెయ్యాలని ఉవ్వెత్తుగా ఎగిసెగిసిపడే సముద్రముమాదిరిగా ఆమె హృదయం పొంగులువారింది.

నాటక ప్రదర్శనము అయిన తరువాత గ్రీన్ రూములోకి వచ్చాడు రంగథామ్. సావిత్రి యింకా యువరాణి వేషములోనే ఉన్నది.

"మీరు కాలేజీ విద్యార్థిసంఘానికిపేరు తెచ్చారు. ఇంతబాగా నటించగలరని నేను ఊహించలేక పోయాను. ఇవాళ అధ్య ర్యము వహించిన ప్రభుత్వ ప్రధానకార్య దర్శి ప్రత్యేకంగా మిమ్మల్ని ప్రశంసిం చారు. నూరురూపాయల విలువగల రవీంద్ర కవీంద్రుల సాహిత్యము కొని మీకు బహూకరిస్తా నన్నాడు. నా కోరిక మీద యువరాణిపాత్ర ధరించటానికి ఒప్పుకున్నందుకూ అత్యుత్తమంగా నటించినందుకూ నా శుభాభివందనాలు." అత డట్లా ఆమెవైపు సూటిగా చూస్తూ ప్యాంటుజేబులో ఉన్న చేతిగుడ్డతీసుకుని ముఖమంతా అద్దుకున్నాడు.

సావిత్రి కళ్ళు కృతజ్ఞతతో మెరిసి పోయాయి. రెండుచేతులూ జోడించి తల వొంచింది

అంతవరకూ సావిత్రికీ రంగధామా నికీ మధ్యఉన్న తెరలు ఈనాటకంతో తొలగిపోయాయి. ఉత్సాహంతో గౌర వంతో ఒకరినొకరు కలుసుకుంటూఉండే వారు ఆమెలో ఉన్న ధైర్యస్థయిర్యాలను మెచ్చుకోకుండా ఉండలేక పోయేవాడు రంగధాముం. అతడు యిస్తున్న ఉత్సా హము వల్లనే తనలో ఉన్న శక్తులు ఇనుమడిస్తున్నా యని ఆమె నమ్మకము. అతడు ఆమెను ప్రశంసిస్తునప్పుడల్లా ఆమె ఈ మాట అనక మానదు ఈ పరిచయాలతో రెండురోజుల కొకసారి అతడిని ఎక్కడైనా కలుసుకోలేకపోతే మనసంతా చీకటి చీకటిగా ఉన్న ట్టుండేది సావిత్రికి. సావిత్రి ఆనర్సు ప్యాసుకాగానే కాలేజి మానేసింది. రంగధామం లా కాలేజిలో చేరాడు. కాలేజిలైబ్రరీకి వెళ్ళి నప్పుడల్లా సావిత్రి రంగధామాన్ని కలుసుకునేది. ఇద్దరూ ఒకచోటకూర్చుని ఆప్యాయంగా కబుర్లు చెప్పుకునేవారు. సావిత్రి హృదయము అతడి మాటలలో ఉన్న తీపినంతా పోగుచేసుకునేది. మధుర మధుర మయిన భావాలు మనసులో అల్లి బిల్లిగా అల్లుకునేవి వాటిని తలుచుకుని సిగ్గిలిపోయేది

ఉత్సవాల తరువాత మిగతా విద్యార్థినీ గణమంతా ఆమెవైపు అదొక మాదిరిగా చూసేవారు రంగధామంసంగతి అందరికీ తెలుసు అంతంతమాత్రమే — వాళ్లను అతడు కన్నెత్తి చూడడు. ఆడపిల్లలంద రూ అతడికి 'గర్వము— అహంభావము అనుకుని దూరదూరంగా తిరిగేవారు

సావిత్రి తనలో ఏదో ప్రత్యేకత ఉన్న దనుకునేది. ఆప్రత్యేకతను అతడు గుర్తించినందువల్లనే తనతో చనవుగా ఉన్నా డనుకుంటూఉండేది. ఈ సంగతి కనిపెట్టకలిగింది ఒక్క సుబ్బలక్ష్మి.

"సావిత్రీ నీవు నిజంగా అదృష్ట వంతురాలవు. అతడు ఫస్టుమార్కులు తెచ్చుకున్నవాళ్ళ నయినా కన్నెత్తి చూశాడా చెప్పు" జడ వీపుమీద కొట్టూ. సావిత్రి చెవులు సాగదీస్తూ ఉండేవి సుబ్బలక్ష్మి. అటువంటి సమయాలలో

సుబ్బలక్ష్మి పైటకొంగు సావిత్రి చేతిలో మెలికలు తిరుగుతూఉండేది.

సావిత్రి జేగురు మబ్బుల వింత వెలుగులో సముద్రపు ఒడ్డున కూచుని ఇసికలో వేలితో ఏదో రాస్తున్నది. జీడి పలుకుల సంచులు ఎగరవేసుకుంటూ రంగధామం ఆమెకు ఎదురుగా కూర్చు న్నాడు. రంగధామం తన భవిష్యత్తు అంతా ఊహించి ఆమెకు చెప్పుతున్నాడు. లా చదివిన తరువాత ప్రాక్టీసుకొరకు తొందరపడకుండా పై చదువులు చదువుతా నన్నాడు. ఇంగ్లండు వెళ్ళి బారట్లా అవా లని ఉన్న దన్నాడు. కళ్ళు తిప్పుతూ, కుతూహలంతో ఉత్సాహంతో జడలు విప్పుతూ అల్లుతూ అతడినే చూస్తున్నది సావిత్రి. ఇసికలో తలక్రింద చెయ్యి పెట్టుకుని నెలవంక కేసి చూస్తూ కూని రాగాలు తీస్తున్నాడు రంగధామం. సావిత్రి ముసిముసి నవ్వులతో రంగధామాన్ని ఎన్నెన్నో ప్రశ్నలు వేయా లనుకున్నది. కాని ఆమె సిగ్గే ఆమెకు అవరోధ మయింది. ఇటువంటి అవకాశాలు చేజిక్కికూడా జారిపోయ్యాయి చాలా సార్లు.

సావిత్రి ఆనర్సు పూర్తి చేసింది. "ఇంకా పైన చదువుతావా అమ్మా" అని తండ్రి అడుగుతా డనుకుంది. కాని ఆయన సంబంధాలు చూడటము మొదలుపెట్టాడు. ఆయనకు అన్నివిధాలా నచ్చిన రెండిటిని సావిత్రి తిరగ్గొట్టింది.

"నీ విలా చేస్తావనుకోలే దమ్మా" చెమట పట్టిన ఫాలభాగాన్ని గోడవైపుకు తిరిగి తుడుచుకుంటూ అన్నాడు.

"నీకు నచ్చాడా అని అడిగావు కనుక చెప్పాను నాన్నా!" అన్నది సావిత్రి తలవంచుకుని.

"అవునమ్మా! నీకు చూపించకుండా నీ సమ్మతి లేకుండా చేస్తానా! ఆనర్సు ప్యాసయిన పిల్లతో ఎలా వ్యవహరించాలో నాకు తెలీ దనుకున్నావా?" అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

"అందు కనే మనసులో ఉన్నమాట చెప్పాను!"

"చూడు సావిత్రీ!" అంటూ ఆయన దగ్గరగా కూర్చుని ఆమె వీపుమీద రాస్తూ "డాక్టరు నాకు రక్తపుపోటు హెచ్చిం దన్నాడు. అందు కనే నీకు త్వరలో పెళ్ళి చేయా లనుకుంటున్నాను. సెలవు పెట్టి అలహాబాదునుంచి రమ్మని అన్నయ్యకు వ్రాశాను. అన్నయ్య రెండు నెలలపాటు ఉంటాడు. ఆ రెండు నెలల్లో నీ పెళ్ళి అయిపోవాలి. ఆస్తి వివరా లన్నీ వాడికి చెప్పేస్తాను. పెళ్ళి చేసి నిన్ను అత్తవారింటికి పంపిస్తే ఒంటరిగాడిని నేనెక్కడైనా ఉండొచ్చు. నీ మనసులో ఉన్నది చెప్పు తల్లీ? పోనీ నీ దృష్టిలో ఎవరయినా ఉన్నారా చెప్పు?"

సావిత్రి నేలచూపులు చూడటము మొదలు పెట్టింది. ముఖంమీద చిరునవ్వు




"చిన్నమామయ్య కూతుర్ని నువ్వు మొయ్యలేవు, పెద్దమామయ్య కూతుర్ని చేసుకోమంటివే! చూడు, చిట్టిని అమాంతం ఎత్తుకొచ్చా!"

చిందులాడింది. అప్పటి కప్పుడు నిండుగా ఉన్న బుగ్గలు గులాబీ లయ్యాయి.

"నాకు చెప్పలేక పోతున్నావు పోనీలే అమ్మా! అన్నయ్య రాగానే మళ్ళీ మాట్లాడుకుందాము."

ఆ విషయము అప్పటికి వాయిదా పడినందుకు సావిత్రి మనసు తేలిక పడ్డట్టయింది.

నిరంజను సంబంధాలను గురించి తండ్రి చెప్పగా విన్నాడు. తన పాత స్నేహితులను కూడా విచారించాడు. నాలుగు రోజుల తరువాత సావిత్రిని సంభాషణల్లో ఇరికించాడు. కాని సావిత్రి బయటపడలేదు.

నిరంజను వచ్చినప్పటినుండీ భారమంతా అతడిమీద పెట్టి తండ్రి నిశ్చింతగా ఉన్నాడు. సాయంత్రము కాగానే తండ్రీ కూతుళ్ళు తోటలో కుర్చీలు వేసుకుని కూర్చునేవారు. తిరిగి తిరిగి వచ్చిన నిరంజను ఉస్సురంటూ వాళ్ళతో కబుర్లందుకునేవాడు

ఆదివారంనాడు తీరికగా సుబ్బలక్ష్మి వచ్చింది సావిత్రిని చూడటానికి. వారం రోజులనుండీ రావాలనుకుంటే ఒళ్ళు బడలిక చేసింది.

"ఏం పని చేశావు ఒళ్ళు బడలిక చెయ్యటానికి?"

"బస్సులో నూటయాభై మైళ్ళ దూరము వెళ్ళాము పెళ్ళికి. అది ఒక

పల్లెటూరు. నడుస్తూఉంటే కాళ్ళ దిగబడేటంత బురద; ఇంతకూ పెళ్ళికొడుకు ఎవరో తెలుసా? రంగధామం. పెళ్ళికూతురు వట్టి అమాయిక. పెద్ద చదువు చదువుకుని బస్తీలో ఉన్న నాగరీకుడు ఆ పిల్లను చేసుకున్నాడు."

సావిత్రి తల గిరగిర తిరిగినట్లయింది. కుర్చీకి దేహాన్ని అణచుకుని కూర్చుంది. సుబ్బలక్ష్మి ఐస్క్రీము తిని కాస్త సావిత్రి బుగ్గకు రాచి కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం వేళ తండ్రీ అన్నా గదిలో కాఫీ తాగుతున్నారు. పేపరు చేత బట్టుకుని గదిముందర నిలబడ్డది. ఏ పదిహేను రోజుల క్రిందటో చెప్పాలనుకున్న మాటను అన్న బయట పెట్టలేక దాచినట్లున్నాడు. మాటలు స్పష్టంగానే వినబడుతున్నాయి.

"కాలేజీలలో చదువుతూ నాటకాలలో వేషాలు వేస్తూ తిరిగే పిల్లలు తనకు వద్దన్నాడు నాన్నా! ఈ సావిత్రికి అతడిమీద మనసున్నట్లుగా చూచాయగా కనిపెట్టాను. అతడన్న మాట దానితో ఎలాచెప్పను?"

తండ్రి బరువుగా నిట్టూర్పటము సావిత్రికి స్పష్టంగా వినబడ్డది. సావిత్రి వెనక్కు నడుస్తూ వెళ్ళి డ్రాయింగు రూములో సోఫామీద కూలబడ్డది. కాలేజీలలో చదువుకునే పిల్లలు పెళ్ళికి పనికి రారా? చదువులమీద లెక్చెర్లు యిచ్చిన రంగధామం! నాటకంలో పాత్ర వెయ్యమని తనను బలవంతం చేసిన పెద్దమనిషి! తన స్వంతానికొకమాటా, ఇతరుల కొకమాటా? పెళ్ళిచేసుకోకపోతే పోయాడు కాని కాలేజి విద్యార్థులమీద ఎంతవిసురు విసిరాడు? తండ్రిగాని అన్నగాని ఆ గదిలోకి వచ్చి తన పరిస్థితి చూస్తారేమో నని సావిత్రి భయపడ్డది. తన త్రొట్రుపాటును అణగద్రొక్కటానికి ఎంతో ప్రయత్నించింది. ముఖానికి అడ్డంగా పత్రిక పెట్టుకుని గంటకుపైగా బాధ పడుతూ కూర్చుంది.

తండ్రి తనతో ఏదో చెప్పాలనుకుని చెప్పలేక పోవటము సావిత్రి కనిపెట్టింది. ఆ నాలుగురోజులలో తండ్రి మరీ బలహీనుడయినట్టు కనబడ్డాడు. నిరంజను ముఖావంగా తప్పుకుని తిరుగుతున్నట్టుగా తిరిగాడు.

నాలుగురోజులు నిద్రపట్టలేదు సావిత్రికి. ఆకలి లేనట్టే అనిపించింది, శరీరం గాలిలో తేలిపోతున్నట్టనిపించింది.

అయిదవనాడు ఆమె మనసులో ఏ వేదనా లేదు. మనస్సు నిర్వికారంగా ఉన్నది. అయిపోయినపెళ్ళికి బాజాలెందుకని మనస్సును అదిమిపెట్టడములో నిమగ్నురాలయింది.

"ఏం నాన్నా! అన్నయ్యకు సెలవులు అయిపోలా?"

"అవునమ్మా వెళ్ళాలంటున్నాడు."

"నాన్నా ! మనంకూడా అన్నయ్య దగ్గరికి వెళ్ళి ఉంటే బాగుండదా ?"

"బాగుంటుందమ్మా — కాని ఇం కా ఆవేళరాలేదు." తండ్రిఅన్న ఆవేళఏంటో సావిత్రి గ్రహించింది. ఆయన మనసులో పడుతున్న బాధ ఏమిటో ఆమెకు తెలుసు. పైకి చెప్పలేక మధనపడిపోతున్నాడు.

వారంరోజుల వ్యవధిలో అన్న కుదిర్చిన సంబంధము సావిత్రి చూడకుండా ఒప్పుకుంది. ముహూర్తంకూడా వెంటనే కుదిరింది. పెళ్ళి సత్రంలో జరిగిపోయింది. నిరంజను తీసుకువచ్చిన పెళ్ళికొడుకుచేత సావిత్రి తాళి కట్టించుకుంది. తండ్రి కాళ్ళకు దణ్ణంపెట్టుతూ ఆయన పాదాలు కన్నీటితో తడిపివేసింది. "నాన్నా ! నీ మనసు యిప్పుడు సంతోషంగా ఉందా ?" అంటూ తలెత్తి చూసింది. ఒకపక్క కన్నీళ్ళు కారుస్తున్నా తండ్రిముఖం ఆనందంతో వెలిగిపోవటము సావిత్రి గమనించింది.

వెంకటరమణ కష్టపడి బీకామ్ యల్ యల్ బి ప్యాసయిన విద్యార్థి. అతడు సిద్దంపెట్టి అరుగులమీద నివాసమేర్పరచుకున్నాడు. వీధి దీపాల వెలుగులో చదువుకుని పరీక్షలు ప్యాసయ్యాడు. లేమిడి పెనవేసుకుపోయిన జీవితము. చదువు కాగానే ఉద్యోగములో చేరేడు. అతడిలో అందము ఉన్నది. తెలివీ చురుకుదనమూ ఉన్నాయి. చూడగానే నిరంజన్ను ఆకర్షించాడు. ఇంటి అల్లుడిని చూసుకుని తండ్రీ కొడుకు లెంతగా మురుస్తున్నారో సావిత్రి గ్రహించింది. పెళ్ళి అయిన ఈ అయిదారు సంవత్సరాలలో ఒక్క స్నేహితురాలినయినా చూడటము సావిత్రికి తటస్థించలేదు. వాస్తవానికి తను ఎవరి కంటా పడకుండా మరుగుపడిపోదామనుకుంది. ఒకనాటి మధ్యాహ్నం సుబ్బలక్ష్మి ఎక్కడినుంచో ఊడిపడ్డది. ఆమెను చూడగానే సావిత్రి గుండె గతుక్కుమన్నది.

"నన్ను చూసి భయపల్లేదు కద సావిత్రి భుజంమీద చెయ్యేస్తూ అడిగింది. సుబ్బలక్ష్మి అంటే సావిత్రికి మొదటినుంచీ భయమే. పైకి మాట్లాడుతూనే ఎదటి మనిషి మనసంతా శోధిస్తూ ఉంటుంది. ఎవరి మనసులో నయినా మాయామర్మం కనబడితే బయటికి లాగే వరకూ నిద్రపోదు.

సుబ్బలక్ష్మిని వసారాలో కూర్చోబెట్టి కాఫీ యిచ్చింది సావిత్రి.

సుబ్బలక్ష్మి భర్త డాక్టరు. ఆయనకు ఆ ఊరు బదిలీ అయిందట. ఒక స్నేహితుడి యింట్లో దిగి మూడు నెలల నుంచీ ఆ ఊళ్ళోనే ఉంటున్నాడట. తాను ఆ ఉదయమే వచ్చిందిట. సావిత్రి ఇక్కడున్నట్టు విశాఖపట్నములోనే తనకు తెలిసిందట. ఈ సంగతు లన్నీ గలగల్లాడుతూ చెప్పింది సుబ్బలక్ష్మి.

సుబ్బలక్ష్మి ఇల్లంతా ఒకసారి కలయ

తిరిగింది. సావిత్రి గుండె పీచు పీచు మంటున్నది.

"నువెప్పుడూ పుస్తకాలమధ్య కీటకంలా ఉండేదానివి. నీ పుస్తకాలూ నీ షెల్ఫులూ ఎక్కడా కనబడవేం" గూట్లో నిర్లక్ష్యంగా పడేసిన న్యూస్‌పేపర్లన్నీ తిరగేస్తూ అడిగింది సుబ్బలక్ష్మి.

"ఈ చిన్నయింట్లో ఆ పుస్తకాలన్నీ తెచ్చి ఎక్కడ పెట్టను ? విశాఖపట్నంలో నాన్న పుస్తకాలకే ఒక గది ఏర్పాటు చేశారు."

"అబ్బా ! పుస్తకాలు ఎక్కడ పెట్టుకుంటావనికాదు నే నడిగింది. ఇక్కడ కూడా ఆ అలవాటు సాగించుకుంటున్నావా అని."

"యధాప్రకారంగా."

సుబ్బలక్ష్మి ఊఁ అంటూ తలాడించింది. "నిన్నుచూసి ఆరేళ్ళయింది. బాగా చిక్కావు సావిత్రీ !"

"అందుకే అట్లా అంటున్నావు. చిక్కాననీ, అలవాట్లు మారాయనీ వూహిస్తున్నావు."

"అమ్మాయీ ! నీవు సుబ్బలక్ష్మితో మాట్లాడుతున్నావు తెలుసా ? నీవు చిక్కకపోతే ఆ జాకెటు అలా వేలాడిపోతుందా ? నీ కుట్టుపని అంతా ఏమయింది ? ఒక్క బల్లమీదయినా బట్టలేదు. ఇంత సోమరితనం ఎట్లావచ్చిందంటా?"

"అబ్బబ్బ ! సుబ్బలక్ష్మీ ! ఇన్ని ప్రశ్నలు ఒక్కసారి అడిగితే ఎట్లా జవా బియ్యను చెప్పు ? ఇది సంసారం. పెళ్ళికానప్పుడు సూదీదారము పట్టుకునో పుస్తకం పట్టుకునో కూర్చున్నట్టుగా యిప్పుడు జరుగుతుందా చెప్పు !"

"పోనీ అదంతా వద్దులే. మా బావగారి సంగతి చెప్పు. నీవు అడక్కపోయినా నేను చెప్పాను చూడు."

సుబ్బలక్ష్మికి ఇల్లు కుదిరిందా అని అడిగింది సావిత్రి. ఇల్లు కుదిరింది; ముగ్గురు పిల్లలని సావిత్రి అడక్కుండా నే చెప్పింది. రెండు గంటల సేపు ఈమాటా ఆమాట అడుగుతూ వేధించి వేధించి వెళ్ళిపోయింది సుబ్బలక్ష్మి. సావిత్రినీ వెంకటరమణనూ తమయింటికి రమ్మని ఆహ్వానించింది.

సావిత్రి తల ఊపింది. సుబ్బలక్ష్మి వెళ్ళిపోయిన తరువాత 'అమ్మయ్య' అనుకుంది. ఆమె ఉన్నంత సేపూ మనసులో భయమే; మాటల్లో చూపుల్లో ఏ సంగతి బయటికి లాగుతుందోనని. ఎవరికీ కనబడకుండా మారుమూల పడున్నామనుకుంటే ఈ సుబ్బలక్ష్మి ఎక్కడినుంచో ఊడిపడ్డది.

వారం రోజుల కొకసారయినా సావిత్రీ వెంకటరమణా తమ యింటికి రాకపోతే సుబ్బలక్ష్మి ఊరుకునేది కాదు. వెంకటరమణ ఎవరితో మాట్లాడినా సావిత్రి ముఖము చూస్తూ మాట్లాడేవాడు. అతడు పడుతున్న బాధేమిటో సుబ్బలక్ష్మి కనిపెట్టటానికి ఎక్కువ సేపు పట్టలేదు.

ఆ మాటల్లో ఏదో వెటకరి కనబడుతున్న ట్లుండేది. అతడి బెరుకుచూపులు చూసి సుబ్బలక్ష్మి నవ్వుకుంది.

సుబ్బలక్ష్మి యింటికి వెళ్ళినన్నిసార్లు తమ యింటికి వాళ్ళను పిలువలేక పోయింది సావిత్రి. సందర్భము కూడా కలిసిరాలేదు. అనుకోకుండానే సుబ్బలక్ష్మి భర్తకు అక్కడినుండి బదిలీ అయింది సుబ్బలక్ష్మి కుటుంబాన్ని సావిత్రి భోజనానికి పిలిచింది. వెళ్ళుతూ "నీవు చదువుకున్న మొద్దువైపోయావు" అంటూ వీపు మీద కొట్టి సుబ్బలక్ష్మి బండెక్కింది

ఆ దెబ్బకు సావిత్రి త్రుళ్ళిపడ్డది. ముఖం పాలిపోయింది. ఎవరయినా చూశారేమో నని దిక్కులు చూసింది. దూరంగా మగవాళ్ళు మాట్లాడుకుంటు న్నారు. అమ్మయ్య అనుకుంది.

ఒక్క ఏడాదిపాటు తెలిసినవాళ్ళు ఎవరూ కనబడలేదు. సావిత్రి మనసు హాయిగా ఉన్నది. బయటి ప్రపంచంతో ఏ ప్రసక్తి లేకుండా ఉంది. పుస్తకాలు చదివే అలవాటు సంసారంలో పడగానే దానంతట అదే నశించిపోయింది. మిగతా అభిరుచులూ అభిలాషలూ ఆలనా పాలనా లేక అణగారి పోయాయి ఆయన ఆఫీసుకు వెళ్ళగానే వాకిటి తలుపు గొళ్ళెము పెట్టుకుని, ఏకాంతంగా కూర్చుని గాత్రసంగీతం సాధన చేస్తూ ఉండేది. రెండు మూడు గంటలు భజన కీర్తనలూ అవీ పాడుకున్న తరువాత ఆమెలో గూడుకట్టుకున్న ఆవేద నంతా చల్లారిన ట్లుండేది. వర్షించిన మేఘంలా మనసు తేలికపడేది.

మందకొడిగా యాంత్రికంగా సావిత్రి రోజులను దొర్లిస్తున్నది. షెల్ఫుమీద చనిపోయిన తండ్రి ఫొటో కెదురుగా నిల బడి "నీ ఆత్మశాంతికోసమే నేను బతుకు తున్నా నాన్నా!" అనుకునేది ఎప్పుడు చూసినా ఆ ఫొటోలో తండ్రి ముఖము నవ్వుతున్న ట్లుండేది.

* * *

పక్కవాటాలో వున్న తాయారు పురిటికి వెళ్ళింది. ముసలమ్మ చిన్నపిల్లలా ఉరుకు పరుగులతో కాఫీచేసి యిస్తున్నది. వేళకు వంట ఐనా చిందులూ గంతులూ వినబడుతూనే ఉన్నాయి. కటికి ఉప వాసాలు చేస్తున్నట్టుగా నిట్టూర్పులూ మూలుగులూ ప్రక్కయింట్లో తాండవ మాడుతున్నాయి.

మధ్యాహ్నం వేళ ముసలమ్మ తీరికగా వచ్చి సావిత్రిదగ్గర కూర్చున్నది. సావిత్రి వెంకటరమణకోసం కుట్టుతున్న ఊలు స్వెటరు పూర్తిచేస్తోంది. సూదులూ ఊలూ గబగబా కదిలిపోతున్నాయి.

"నీవు ఒక్క నిముషమయినా వృధా పోనీయవమ్మా. మీ ఆయన ఎంతో అదృష్టవంతుడు, పెట్టిపుట్టాడు."

ఆ మాటకు సావిత్రి గలగలా నవ్వింది. కాని ఆ నవ్వు బలవంతంగా

నవ్వినట్లుంది. ఇతరులను అసూయపరచా లనే చెణుకు లేకపోలేదు దానిలో.

ప్రొద్దున్నే వచ్చినవాన సన్నగా మొద లయి చూస్తూ ఉండగానే కుండపోత వర్ష మయింది. సావిత్రి మసాలాదోసె వేసి వేడిగా ఉండా లని పెన మీద నే ఉంచింది. ముసలమ్మగారు ఇస్త్రీచేసిన గుంటూరుచీరె కట్టుకుని కొంగు దోపు కుంటూ "అమ్మాయీ! మా కోడలికి పురు డొచ్చింది. మగపిల్లవాడు పుట్టాడు. నేనూ అబ్బాయీ చూడటానికి వెళ్ళు తున్నాము ఈ నాలుగుగంటల బండిలో."

"ఎన్నాళ్ళమకాం చెప్పరూ?"

"ఇక మళ్ళీ యిక్కడికి రామమ్మా. అబ్బాయికి అనకాపల్లి బదిలీ అయింది. అటునుంచే వెళ్ళుతాడు."

"రెండు శుభవార్తలు ఒక్కసారే చెప్పారు." సావిత్రి ఆమెకు బొట్టుపెట్టి కొబ్బరికాయ చేతికి యిచ్చింది.

"చిన్నపిల్లవయినా ఎంతో తెలివిగా కాపురం చేస్తున్నావమ్మా. నిన్ను చూస్తూంటే నాకెంతో ఆనందంగా ఉంటుంది."

సావిత్రి పొడినవ్వు నవ్వుతూ ఆమెను సాగనంపింది. లోపలికి వచ్చి మెడా, చేతులూ పూర్తి కాని స్వెట్టరు ఒక మూలకు విసిరేసింది.

సావిత్రి చేసిన మసాలా దోసెలు వెంకటరమణ వచ్చేసరికి చప్పగా చల్లారి పోయాయి. ఆ రాత్రికి బద్ధకంగా ఉండి చారూ అన్నమే చేసింది. సావిత్రి అంత ఉత్సాహంగా లేకపోయినా మామూలు ఇంటిపను లన్నీ చేసుకుంది. వెంకట రమణ ఫైల్సు చూసుకుంటూ ఉంటే తాను పక్కలూ దిండ్లూ సర్దింది. కిటికీ తలుపు తీస్తూ ఉంటే మల్లెలూ మరు వమూ కలిపికట్టిన మూరెడుమాల కన బడ్డది.

వెంకటరమణ వైపు తలెత్తిచూసింది. అమాయకంగా ఫైల్సు చూసుకుంటు న్నాడు. ఆనాడు అతడు మల్లెపూలూ మరువమూ తెచ్చినట్లూ తను సంతో షంతో పొంగిపోయినట్లూ ఏవోమాటలు ఆ రంగధామం వినేటట్లుగా అన్నది. అసూయతో దహించుకునిపోయి ఉండాలి అతడు. కాని యిప్పుడు నిజంగా మల్లెల దండ తెచ్చాడు వెంటకరమణ. పక్క వాటాలో ఉడుక్కునే రంగధామం లేడు. చీకటి చీకటిగా ఉంది పక్కవాటా. సావిత్రిలో ఉత్సాహపు పొంగు రాలేదు. నీరసంతో దేహము వేలాడిపోతున్నది.

వారపత్రికలూ దినపత్రికలూ చేతి కందినవన్నీ పుటలు త్రిప్పి పడేసింది సావిత్రి. తనకు యిష్టమనుకున్న కవిత తీసి చదవబోయింది. ఇన్నాళ్ళనుంచీ మనసులో గూడుకట్టుకున్న అవమానము ఆవేదన పొంగుతున్నాయి కాని చల్లారటం లేదు. పెరట్లోకి వెళ్ళే గదితలుపులు తెరచి గడపలో కూర్చుంది. తెలిమబ్బుల పరుగులలో నెలవంక తొంగిచూస్తు



"దొంగవెధవా! ఇవి అసలుఆవుపాలు అన్నావుకదూ, ఈ నీళ్ళని?"
"అవును సామీ! 'అసలు ఆవుపాలు అన్నానుగాని' పాలు అనలేదుగా."

న్నాడు. సావిత్రి కూనిరాగం తీస్తూ కళ్ళు మూసుకుని మీరాబాయి భజనలు పాడు కుంది సన్నగా.

అలవాటు ప్రకారం వెంకటరమణ ఫైల్సు తిరగవేసుకుంటున్నాడు.

సావిత్రి చివాలున లేచింది. స్నానాల గదిలోకి వెళ్ళి ఆ చన్నీళ్ళే నాలుగుచెంబులు పోసుకుని చందనం సబ్బు ఘుమఘుమతో పాముకుబుసంలాంటి సన్నటి చీరె ధరించి బయటికి వచ్చింది. దోసగింజ బొట్టుపెట్టుకుని మల్లెచెండ తలలో పెట్టుకుని ఒయ్యారంగా వెంకటరమణ కుర్చీ దగ్గరగా నిలబడి "ఇలా కూర్చుని రాత్రీ పగలూ పనిచేస్తే ఆరోగ్యం పాడవదూ? గంట చూశారా పన్నెండు కావచ్చింది?

వెంకటరమణ తలెత్తి చూశాడు సావిత్రిని. ఆమె ముఖములో ఒకవింత వెలుగు వెలుగుతున్నది. ఆమె కళ్ళు చిలిపిగా నవ్వుతున్నాయి.

వెంకటరమణకు క్రమంగా ధైర్యము వచ్చింది. ఆ చీకట్లోకూడా సావిత్రి కళ్ళు పక్కవాటావైపు తిరిగాయిమామూలుగా.

కిటికీ తలుపు సందుల్లోనుంచి నెలవంక కనబడీ కనబడకుండా దోబూచు లాడుతున్నాడు. చెంపల మీదుగా జాలు వారిన కన్నీటిని సావిత్రి వెంకటరమణ చూడకుండా కొంగుతో తుడుచుకుని ఫ్లాస్కులో పోసిఉంచిన వేడి వేడి పాలు కప్పులో పోసి ఒయ్యారంగా అతడి చేతి కందించింది.



చందమామకు మచ్చల్లా, గులాబీకి ముళ్ళలా అందమైన బొంబాయి మహానగరానికి మురికి పేటలూ పులిబోనులూ దాపరించాయ్. ముఖ్యంగా ఫోరస్ రోడు గుండా పోతే బోనులోనుంచి సింగారించుకుని అర్ధనగ్నంగా ఉన్న అతివలు తియ్యని పిలుపుపిలుపులతో మగవాణ్ణి పలుకరిస్తారు. కడుపు కోసం హాయిగా నటించక పోతే విధిలేదని గుర్తుకు తెచ్చే దృశ్యాలవి. మనిషికీ బోనుకున్న తుప్పు పట్టిన యినప గజాలకీ భేదం లేదనిపించే ఆలోచన కలుగుతుంది. నరకం మనిషి నిర్మించుకున్న స్వర్గానికి ఎంతో దూరంలో లేదని అప్పుడప్పుడూ అక్కడికు వచ్చే సాంఘిక సేవకురాళ్ళు జ్ఞప్తికి తెస్తుంటారు.

శాంతి చక్కవసంతోపాటు చదువుకుంది. సొంత కారు. సంఘంలో పలుకుబడి. దాదర్ హిందూ కాలనీలో అందమైన బంగళా — ఆప్తం చేసుకున్న పతి. స్త్రీ ఏం కాంక్షిస్తుందో అన్నీ ఆమె పొందింది. ఇన్ని ఉన్నా ఒక్క ప్రేకోసం తహతహ

లాడిన ఆమె వెలుగుగా వున్న యింట్లో దీపం వెలిగించుటవలన ప్రయోజనం లేదని_కడుపునిండా వున్నవాళ్ళకి పంచ భక్షపరమాన్నాలతో పెట్టినా లాభంలేదని తెలుసుకొావి స్వచ్ఛంద సాంఘిక సేవ చెయ్యటానికి పూనుకుంది. త్యాగం వలన వచ్చిన తృప్తి ఒక వెలుగులా మనసులో ప్రవేశించి హృదయాన్ని నిర్మలం చేయ సాగింది. ఉన్నత కుటుంబాలలో పాతుక పోయిన అసూయలూ, అట్టహాసాలూ, నటనాలూ అన్నీ ఆమెలోనించి రానురాను తుడుచుకపోతున్నయ్. వినియోగించని చదువూ, డబ్బూ మనిషికి అరగని తిండిలా బాధ పెట్తాయని తెల్సుకుంది.

ఎర్ర అంచు తెల్లని గ్లాస్కో చీరతో ఫోరస్ రోడ్డులో తిరిగే శాంతిని చూసి చాలమంది సరసులు యేవో శృంగార వాక్యాలు విసిరారు. వాళ్ళ ఆనందానికి ఆర్జనకు అడ్డువస్తోందని యెందరో సువాసినులు విసుక్కుని ఆమెపై విరుచుక పడ్డారు. ఆమెను అంత దూరంలో చూసి వెటకారంగా మాటలు వినపించేటట్లు వ్రాల్చారు. తెలిసి యే మనిషీ తప్పు చెయ్యడనే నమ్మిక శాంతికి వుంది. మానవత్వం మీద విశ్వాసం ఆమె క్షమా గుణాన్ని అధికం చేసింది. అందుకే యెన్నిసార్లు ఆమెను తూలనాడినా మళ్ళీ యీ రోజున శోభదగ్గరకు వెళ్ళింది.

"మళ్ళీ వచ్చావూ?" అని కటువుగా శోభ ఆహ్వానించింది.

"నువ్వే మళ్ళీ నన్ను రప్పించావమ్మా."

"ఒకసారి కాదు_పదిసార్లు చెప్పాను_నా దగ్గరకు రావద్దని."

"నా చెల్లెలు రావద్దన్న మాత్రాన నా అభిమానాన్ని కాల్చుకోమంటావా?"

శోభ వెకిలిగా "అభిమానం_ఆ మాట ఒకటి వుందని నాకు తెలీదు."

"ఉందని నీ చేత ఒప్పించే అవకాశం నా కీ, చెల్లీ!"

"ఎందుకమ్మా మమ్మల్ని యిలా బాధ పెట్తావు? జీవితంలో కష్టం అంటే తెలియని దానివి మా విషయాల్లో యెందుకు జోక్యం చేసుకుంటావు?"

"మీ కష్టాలు నా కష్టాలు చేసుకుందామని _ మీ బాధలు నేనూ పంచుకుందామని."

"అంతస్తులు వేరైనప్పుడు అనురాగాలెలా మొలక లెత్తుతాయ్. మమ్మల్ని సంసారులను చేసే ప్రయత్నం మాను" అంటూ శోభ ఆమె అందమైన అంగాలను నిర్లక్ష్యంగా విడిచి పెట్టింది. బయట యెవడో సరసుడు ఆతృతగా గమనిస్తున్నట్లున్నాడు. శాంతి శోభ చీరకొంగును సవరించి.

"చెయ్యలేననే అపనమ్మకం వుంటే యేనాడో నీ దగ్గరకు రావటం మానేసే దాన్ని. ఈ చుట్టుపట్ల నున్నవాళ్ళల్లో చాల మంది దగ్గరకు నేనెందుకు వెళ్ళలేదు? తిన్నని బాట వదలి నువ్వెంత దూరమో

రాలేదు. తిరిగి ఆశ్రోవలో పడితే ఆడదానివై పుట్టినందుకు నీ గమ్యం చేరుకుంటావు."

"ఆ నమ్మకాలన్నీ నాకేనాడో పోయాయి. జరగబోయే దానిమీద నాకు నమ్మకం లేదు. జరుగుతున్నదే నాకు కావాలి."

"చూశావా ? ఎంత తెలివిగా మాటాడుతున్నావో ? నీ మాటలూ రూపూ చూస్తే నాకే ముచ్చటవుతోంది. నాకు స్వలాభం లేదని కాదు. నీ బ్రతుకు సవ్యం చేస్తే నా కెక్కడలేని తృప్తి వస్తుంది."

"నీ తృప్తికోసం ఒక జీవితానికి అలవాటుపడిన నన్ను యింకోరకం బ్రతుక్కు యెలా అలవాటు చేస్తావ్ ! నీటినించి తీసిన చేపలా అయిపోతాను. అక్కడ బ్రతకలేను. ఇక్కడే నన్ను వుండనీ."

శాంతి కాస్త అధికారంగా "అదిగో చూడు — వాళ్ళంతా ఒకప్పుడు నీ కంటే అందంగా వుండేవారు. ఆడది సంసారం చక్కబెట్టుకుంటే చెట్టు కున్న పువ్వులా వుంటుంది. నలుగురు చేతులూపడి నలిగిన పువ్వు అంద విహీనమై వేగం రాలిపోతుంది. నా వుత్సాహాన్ని చంపకు చెల్లీ!"

"ఇంతకీ నన్ను తీసుకవెళ్ళి యెక్కడ వుంచుతావు - యేం చేస్తావ్ ?"

"నీ తోబుట్టువనుకొని నీ వృత్తాంతమంతా నాతో చెప్పు. నీ భర్తవుంటే అతని దగ్గరకు చేరవేసి, ఒప్పించే బాధ్యత తీసుకుంటాను. నీ తల్లి దండ్రులుంటే వాళ్ళకు అప్పచెప్తాను. వీ శ్లైవరూ లేకపోతే నీవు స్వయంగా నీ తెలివితేటలు, కాయకష్టంతో బ్రతికే యేర్పాటు చేస్తాను."

"గతం యేమీ జ్ఞాపకం లేదు. మగవాళ్ళని గౌరవించటం యేనాడో మరచిపోయాను."

"తప్పమ్మా,తప్పు. మగవాడు తండ్రిగా, భర్తగా, కుమారునిగా స్త్రీని ప్రేమిస్తాడు. అతని అభిమానాన్ని పొందిన మనం అతని చిన్న లోటుపాట్లను సవరించుకుపోవాలి. మగాడు లేకపోతే ఆడది చుక్కాని లేని నావయైపోతుంది. అందుకే నా మాట విను — నాతో రా... అన్ని యేర్పాట్లూ చేస్తాను."

"చూద్దాం — ఎవడో నా కోసం కాచుకొని వున్నాడు. ఆ ప్రేమగోల విననీ.."

ఆమె యింకేదో అనబోతుంటే వినకుండా బోను తలుపులు తెరచి.

"రండి...రండి..." అని సరసుణ్ణి ఆహ్వానించింది. వాడు లోనికి పోతూ శాంతివేపు యెగాదిగా చూసాడు.

"వెళ్ళమ్మా...వెళ్ళు — నీతో మాటాడుతూ కూర్చుంటే యెలా,నాకు పనుంది" అంటూ నిర్లక్ష్యంగా శోభ సరసునితో లోనికి వెళ్ళిపోయింది. నిశ్చేష్టురాలై నిల్చున్న శాంతికి కొద్ది క్షణాల్లో కిలకిల నవ్వులు వినిపించాయ్. ఎవరో తన పరిస్థితిని అవహేళన చేస్తున్నట్లయి అక్కడ

వించి తల వంచుకొని కదలి రోడ్డుమీద నడవసాగింది.

నడుస్తూనే నిస్పృహతో నిల్చుండి పోయింది. ఉగ్రుడైన వుదయభానుడు ఆమెకు చెంపపెట్టు తగిలించాడు. కంది పోయిన కపోలములను తడుముకుంది. ఇంట్లో కాన్వెంటుకు పోయేముందు పిల్లకు ఒక ముద్దూ పెట్టకుండా, ఆఫీసుకుపోయే భర్తను కారు వరకు దిగబెట్టకుండా - ఈ ఎండలో, యీ రణగొణ ధ్వనిలో — పాపం పండిన యీ నరకంలో తనెందుకు యీ యమయాతన పడాలి? దిగజారిన శిలాప్రతిమను మళ్ళీ కొండమీదకెక్కించా లన్నప్రయత్నం తనకు సఫలమౌతుందా? మెడవరకూ వూబిలో కోరి దిగినవాళ్ళను బైటకు లాగాలన్న ప్రయత్నంలో తనే అందులో బలవంతంగా జారిపోతే? ఈ ప్రదేశంలో తాగుడూ, జూదం, వ్యభి చారం అన్నీ పుష్కలం...ఈ సారా సముద్రాలు, జూదంకొంపలూ, వ్యభి చారపు గట్టులు లేని నూతులూ యివన్నీ దాటాలని తన తాపత్రయమే గానీ పొర పాటున యెక్కడ అడుగు వేసినా మళ్ళీ తన ప్రియాతి ప్రియమైన భర్తకు దూరం కావలసిందే! అలాంటిది తన కెందుకీ సాహసం? ఎవరి ఖర్మకి వారిని విడిచి పెడ్తే...!

కాస్సేపయ్యాక మళ్ళీ ఆమెకు నవ్వు వినిపించింది. ఈ నవ్వు మరెవరిదో కాదు — తనదే. గాలికి 'విడిచిపెట్టినట్లు చాతకానివాళ్ళు సృష్టించిన సమస్యలను ఖర్మలకు విడిచిపెట్టేస్తారు. నాకు చదువు సంస్కారం వుందనుకుంటే అది సము ద్రంలో పోసిన చక్కెర కాకూడదు. నా విశ్వాసానికి చావు యెప్పుడువచ్చిందో ఆనాడే నేను చచ్చిపోయాను. శోభను ఆ నరకకూపంనుంచి తప్పక రక్షించ గలను — పోతే అయ్యేది ఆలస్యం — కానీ!' శాంతి మళ్ళీ తిరిగి యింటికి వచ్చే సరికి బీటలువారిన విశ్వాసం అతుక్కు పోయింది.

## 2

శయ్యపై పవళించి యేదో ఆలో చిస్తున్న శోభకు యింటిముందు కారు ఆగిన శబ్దం వినిపించింది. శాంతి పిలవ గానే విసుక్కుంటూ వచ్చి తలుపు తీసి,

"నన్నిలా బ్రతక నియ్యవా తల్లీ" అని అపహాస్యం చేసింది.

"నీతి వాక్యాలు ఘోషించటానికి రాలేదుచెల్లీ నిన్నీ చెరువునుంచి వలవేసి లాగాలనీ లేదు—

మా అమ్మాయి పుట్టినరోజు యీ వేళ. నీకో పిన్నివుందమ్మా అని చెప్పాను. తీసుక వస్తావా లేదా అని మారాం చేస్తోంది. ఒకసారి కారుమీద దయచేసి రాకూడదూ? మళ్ళీ వెంటనే దిగబెట్టే పూచీ నాది."

"నేనా? మీ యింటికా? ఎందుకమ్మా— గౌరవంగా బ్రతుకుతున్నవాళ్ళింటికి నాలాంటిదాన్ని."




"ఏమిటి మా వాణ్ణి పనిలోనుంచి తీసేశావట ?"
"అయ్యబాబోయ్, అట్లా అని ఎవరన్నారు ? మీరు కొంచెం భయం చెపుతారని అట్లా చేశా నంతే."

"నువ్వు వచ్చినంత మాత్రాన మాకున్న గౌరవం మంటకలిసిపోదులే. మా అమ్మాయి భ్రాంతి తీరుతుం దని ఆశతో పిలిచాను. నువ్వు రాకపోతే యిలాంటి రోజున యేడుస్తూ కూర్చుంటుంది —"

"రాక తప్పదా ?"

"తప్పదు."

"అయితే నా వేషం, నేను...ఎందరు వస్తా రేమిటో ?"

"స్వయంగా నా చెల్లెలులా అగపడాలని...అదిగో ఒక మంచి చీర తెచ్చాను. అభ్యంతరం లేకపోతే అది కట్టుకో చెల్లీ— నేనే నిన్ను అలంకరిస్తాను."

శాంతి కారులోనుంచి క్రొత్త టెర్రిలిన్ చీర తీసుకొని వెళ్ళింది. శోభను అలంకరిస్తూ;

"మా అమ్మాయి నీ యింటికి వస్తానని బయలు దేరింది. తెచ్చే దాననే. మళ్ళీ ఆలోచించాను. ఒకప్పుడు నన్ను చూసి రానని నువ్వు తూలనాడి వుంటే ఆ చిన్న మనసుకు కష్టమౌతుంది. దాని అభిమానికి తగ్గట్లు నిన్ను అలంకరించి మరీ తీసుకపోదా మని వచ్చాను."

ఎన్ని మాటలు చెప్పినా శోభ తిరిగి

జవాబు చెప్పలేదు. కారులో పోతుండగా ఒకచోట "కొద్దిగా ఆపండి" అంది.

కారు ఆగగానే దిగి ఒక రబ్బరు బొమ్మ కొన్నది. ఆ బొమ్మకు చీరకట్టి వుంది. తిరిగి కారులోనికి వచ్చి కూర్చుంది. శాంతి కారు నడుపుతూనే "మంచి బొమ్మే సెలక్టుచేశావు. నీలానే చక్కగా వుంది."

"మన మంతా బొమ్మలం కాక మరేం?" అంది శోభ.

"ప్రాణం వుండగా బొమ్మ లెలా అవుతాం...?"

"మనుషు లంతా బొమ్మలు – మట్టి బొమ్మలు–పోతే కదులుతారు–మాటాడు తారు...చివరికి మట్టేగా మిగిలింది!" శోభ కాస్త వెటకారంగానే అంది.

మంచులా కరుడుగట్టిన హృదయాన్ని చల్లని వెన్నెలలాంటి మాటలు కరగించలే వని శాంతి మళ్ళీ మాటాడక ఆలోచనలో పడింది–ఇల్లు కూడా దగ్గరపడింది.

కారు యింటిముందు ఆగగానే కూతురు పరుగెత్తుకొని వచ్చి "మమ్మీ.."అంటూ కాళ్ళు పట్టుకుంది.

"ఇదిగో ఆంటీ – గుడ్ యీవినింగ్ చెప్పావా?"

"గుడ్ యీవినింగ్ ఆంటీ."

"గుడ్ యీవినింగ్..."

"మమ్మీ...మమ్మీ ... అంకుల్ రాలేదేం;"

"దా అమ్మా...దా..." అంటూ శోభ దగ్గరకు పిల్చింది.

"అంకుల్ యెందుకు రాలేదు? ముందు చెప్పు?"

"పని వుందమ్మా..." అని శాంతి అందుకోగానే...

"ఆఫీసు నించి యింకా రాలేదా?"

"హాఁ!... ఆంటీ దగ్గరకు వెళ్ళు."

"మరి... ఆంటీకి...పాపాయిలు లేరా?"

"ఇంకా...ఆంటీ చిన్నదిగా...ఈ కొంటె ప్రశ్నలు వెయ్యకండా ముందు ఆంటీ దగ్గరకు వెళ్ళు" అంటూ ముందుకు పాపాయిని తోసింది.

శోభ బొమ్మలానే బొమ్మ పట్టుకు నిల్చుంది. దగ్గరకు వచ్చిన పిల్లకు మౌనంగా అందివ్వగానే పుచ్చుకోలేదు.

"ఆంటీ యిచ్చింది తీసుకో అమ్మా" అంది శాంతి...

"ఆంటీ హేపీ బర్త్‌డే అనలేదు – యెందుకు తీసుకుంటాను."

"హేపీ బర్త్‌డే..." శోభ నోటి వెంబడి మెల్లగా మాటలు వచ్చాయి. పాప బొమ్మను తీసుకుని గెంతుతూ "హేపీ బర్త్‌డే...యు..యూ..యూ... హేపీ బర్త్‌డే...యూ..యూ..యూ.."

"ఆంటీ పుట్టిన రోజు యీ వేళే కదమ్మా...?"

"అవును...యీ వేళే..." అంది శోభ.

"అమ్మ దొంగా..ముందుగా చెప్పావు కాదే?"

"మాకు ప్రతిరోజూ పుట్టినరోజే.." శోభ వెకిలిగా నవ్వింది. అంతవరకూ గదిలో కాస్త దూరంగా విల్చొని కిటికీ గుండా శోభను శాంతిభర్త నవీన్ గమనిస్తూనే వున్నాడు. శాంతి శోభను ఇంట్లోనికి తెస్తూ "ఇదిగోండి...మా చెల్లెలని చెప్పానే — ఈమె."

"ముందుగానే పోల్చుకున్నాను."

"ఈయన మావారు."

"నమస్కారమండీ."

"నమస్కారం."

"కాస్త తలెత్తు చెల్లీ! ఫరవా లేదు. మా వారు ఆడవాళ్ళవేపు మ్రింగివేసినట్లు చూడరులే! నువ్వు చాలా ఫ్రీగా మాటాడాలి..."

శోభ తలెత్తి ఒకసారి అతనివేపు చూసి శాంతివేపు తలత్రిప్పి చిరునవ్వు నవ్వింది.

"మా ఆయన నలుగురులాంటి మగవారుకారు. మా అమ్మ అంటుంది నేనో పువ్వు హెచ్చు పూజ చేశానని."

"నిజమే.." కాస్త మందస్వరంతో శోభ ఒప్పుకుంది.

వచ్చిన వారందరితో మా "కజిన్ సిస్టర్" అని శోభను పరిచయంచేసింది. ఈ వేళ ఆమె సింగారింపుతో శాంతికి మించిపోయినట్లుంది. శాంతిది కాస్త పలుచని కోలముఖం—సన్నని పెదాలు — సంస్కారంతో వెలుగుతున్న కళ్లు — మధ్యగా తీర్చిదిద్దిన ముక్కు — సొగసు వుట్టిపడుతున్న శరీరచ్ఛాయతో తేలికైన శరీరం. శోభది కోమలమైన మేలిమి బంగారుచాయ శరీరం—గుండ్రని ముఖంలో కాస్త పెదాలు బొద్దుగావున్నా మిగతా అవయవాలు పుష్టిగా పెరిగి వున్నాయ్. చూపుల్లో కళ్ళెంవేసి లాగుకొనే తత్వం కనిపిస్తుంది. టీ పార్టీలో శాంతి శోభను తన ప్రక్కనే కూర్చోబెట్టుకుంది. చాలామంది యేకపత్నీ-వ్రతుల కళ్ళు శోభ సొగసుమీద పడ్డాయి గానీ ఆమె కళ్ళు యెవరిమీదా పడలేదు. కళ్ళాలు తెగిన గుర్రంలా ఆమె కదలసాగింది. శాంతి ఆమె ప్రవర్తనను చూసీ చూడనట్లు పరిశీలిస్తూనే వుంది. ఇదివరకు తీరని కోరికలతో యింకొకటి చేర్చుకుని కొందరు' పెరిగిన అసూయపై యింకోముద్ద చేర్చి మరికొందరూ, లోని అసంతృప్తిని బయటకు తృప్తిగా నటిస్తూ వేరొక్కరూ...యిలా రకరకాల అనుభూతులూ, అనుమానాలూ, ఆవేశాలూ, అసంతృప్తీ...నటనలతో వచ్చినవారు వెళ్ళిపోయారు; మిగిలింది శోభ!

"ఈ రాత్రి యిక్కడ వుండకూడదూ?" నవీన్ చొరవచేసుకు శోభను అడిగాడు.

"అబ్బే...యెందుకండీ...వచ్చినపని అయ్యిందిగా...వెళ్తాను."

"మాట్లో యిం వారంరోజు లుంటే మీ బావగారి సొత్తు తరిగిపోదులే."

"తరిగిపోతుం దని కాదు. ఇక్కడ నే నుండటం మీకు మంచిది కాదు."

"మా మంచి చెడ్డలు మాకు తెలీవా? ఆయన యెవర్నీ వుండమని అడగరు_ నోరు విప్పి ఆయన అడిగినందుకు — యీ రాత్రికి వుండరాదూ ?''

''నా పని యింకేం వుంది చెప్పండి? దయచేసి నన్ను వెళ్ళనివ్వండి.''

"ఒక్క రాత్రికి వుండమంటే యింత ఊరిపిస్తున్నా వప్పుడే_యిప్పుడే నువ్వు పారిపోకుండా తలుపులు బిడాయిస్తున్నా" అంటూ శాంతి ముంగిటి తలుపులు వేసింది.

మాటాడకుండా శోభ చిన్న నవ్వుతో అంగీకారాన్ని తెలియపర్చింది.

పాపకూ శోభకూ సన్నిహితం యేర్ప డింది. ఆంటీదగ్గర ఆ రాత్రి పడుకోడానికి ఒప్పుకుంది. పాపకు వచ్చిన ఇంగ్లీషు పాట లన్నీ పాడింది. నాలుగు చినుకులు రాలితే...

''రైన్ రైన్ గో ఎవే
కమ్ ఎగైన్ అనదర్ డే

లిటిల్ సుజాత వాంట్స్ టు ప్లే" అని ఆంటీతో ఆడుకోడం మొదలెట్టింది. వర్షం కూడా వెలిసింది. కొద్దిగంటల పరిచయంతో ఆ ముద్దు లొలికే పాపను వదలటానికి మనస్కరించలేదు.

అన్యోన్యంగా మేడమీద పోర్టికోలో మసక వెన్నెల్లో మాటాడుకుంటున్న భార్యాభర్తలను చూసింది. కమ్మగా మెల్లని వీణా వాయిద్యం రేడియోనుంచి వినిపిస్తోంది. ఇవన్నీ మాస్తూ గాలికి మెల్లగా కదులుతున్న ఆకులా శోభ హృదయం అల్లల్లాడసాగింది.

భోజనాలదగ్గర యెంతో వుత్సాహంగా వుండా లని యిద్దరూ శోభను ప్రత్యేక అతిథిలా చూసి గౌరవించారు. పాపకు అప్పుడే నిద్దర తూలిపోతోంది. జోకొట్ట డానికి మేడమీదకు వెళ్ళిపోతూ శాంతి భర్తకు యేదో సైగ చేసింది.

భోజనా లయ్యాక అక్కడ సోఫాలో నవీన్ చారబడి "రండి కూర్చోం" దని యెదురుసోఫా చూపించి టేబిలు మీద పళ్ళెరంలోని ద్రాక్షపళ్ళను చూపించాడు. ఆమె సంశయిస్తుంటే "మీరు కూర్చో పోతే...నేనూ నిల్చుంటాను" అనగానే ఆమె మాటాడకుండా కూర్చుంది. "అలా సంశయిస్తే యెలా? మేం మిమ్మల్ని మా యింట్లో మనిషిగా చూసుకు నే టప్పుడు మీరుకూడా అలా మెదలాలా వద్దా చెప్పండి — మీరు తింటేగానీ నేనూ తినను."

ఆమె ఒకసారి తలెత్తి అతని వేపు చూసింది. నవీన్ చిన్న నవ్వుతో ''మా ఆవిడకు మీరంటే గొప్ప పిచ్చి. బహుశః మీయింటికి వచ్చేటప్పుడు బాగా మర్యాద చేసివుంటారు."

''తూలనాడాను."

"నేను నమ్మను — ఆమె మాటను వినలేదేమో ? మరి నా మాటనూ తృణీక రిస్తారా ?'' నవీన్ వేసిన యీ సూటి



''అదేంవిటండీ !? అలా చెమటలుపోస్తూ వస్తూంటిరి ఏమొచ్చె ?...''
''ఇంత సేపూ రెండు గంటలుగా క్రికెట్ మేచ్ రన్నింగ్ కామెంటరీ వింటూంట నేప్...అబ్భ...బ్భ...''

ప్రశ్నతో ఆమె అతనివేపు అమాయకంగా చూసింది. ఆమెకు తొలిసారిగా మగవాని యెదుట సిగ్గు కప్పుకొని వచ్చింది.

"ముందు ఆ మాట యేదో విననీయండి."

"ఆవిడ చెప్పిందే నేనూ చెప్తాను."

శోభ మౌనం దాల్చగానే నవీన్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు - ''ఊం అంటే రేపే...చెంబూరులో ప్రొటెక్టివ్ హోమ్ వుంది. అందులో చేర్పిస్తాను. మీ బాగోగులబాధ్యతమాకుఅప్పజెప్పండి.

''సరే...రేప్రొద్దున్న చెప్తాలెండి'' అంటూ మెల్లగా మేడ యెక్కుతూ మెట్లమీద ఆగింది. శాంతి పాడుతున్న జోలపాట వినిపిస్తోంది. నవీన్ ఆగిన ఆమె పేపు నిదానంగా చూస్తున్నాడు. ఆడది కాంక్షిచే పి రెండూ రెండుప్రక్కల చేరువలో వున్నవనిపించిం దామెకు,

మరుక్షణంలో అంతా కల గని లేచినట్లయింది. అటు పాపమీద, యిటు నవీన్ మీద హక్కు తనకు లేదు. హక్కు గలది శాంతి. ఎంత రాత్రివరకో నిద్దరరాలేదు. ఆ గదిలోవున్న ఫారిన్ మేగజీన్లు తిరగవేసింది.

చక్కని పుష్టిగానున్న పిల్లలబొమ్మలు, భార్యభర్తలు అన్యోన్యంగా అందంగా అన్నీ అమర్చిన యిళ్ళల్లో తిరగాడుతున్న

పౌటోలు—ఆడది చక్కగా తయారవడానికీ, గృహం తీర్చి దిద్దడానికీ, రుచికరమైన వంటకాలు తయారు చేసి యింటంతా ఒకచోకూడి తృప్తిగా ఆరగించటానికీ—ఇలా ఆడాళ్ళు కాంక్షించే వన్నీ ఆ మేగజీన్లలో అగుపించాయి. కోరికలు, కళ్లాలు లాగిన గుర్రాల్లా పరుగెత్తుతున్నట్లు; దీపం ఆర్పి పరుపుమీద చేరబడగానే అనిపించింది తన నిజ పరిస్థితి వూహించగానే కళ్లెం తెగిపోయింది. సుఖానికీ ఐశ్వర్యానికీ అంతంలేదు. కష్టాలకీ దరిద్రానికీ అవమానం తెలియదు. అంతం తెలుసుకోలేని సుఖాలకై అవమానం తెలియని తను యెందుకు ప్రాకులాడటం?

మళ్ళీ తన పాతచోటుకే పోతే బాగు అనిపించింది ఆలస్యంగా నిద్రపోవటం వలన వేగం తెలివి రాలేదు. తను లేచే సరికి పాప స్నానం చేసి బట్టలు వేసుకొని కాన్వెంటుకు పోవడానికి సిద్ధంగావుంది. శోభ లేవగానే పాపదగ్గరి కొచ్చింది.

''ఆంటీ ... ఆంటీ ... నీ కోసమే చూస్తున్నా.''

"ఏ మమ్మా..."

''చిన్న ముద్దుపెట్టూ–" అంటూ బుగ్గ చూపించింది

పాచి నోటితో ముద్దు పెట్టటానికి మనస్కరించలేదు. ''ఓ నిమిషం తల్లీ" అంటూ గబగబ పళ్ళు తోముకొని ముఖం కడుక్కొని జుత్తు సవరించుకొని వచ్చి ముద్దుపెట్టింది. ఆ ముద్దువలన కలిగిన స్పర్శవలన అదేదో అనిర్వచనీయమైన అనుభూతి కలిగింది. పాప వెంటనే కారు దగ్గరకు వెళ్ళగానే.

"ఆంటీ! అమ్మకంటే నువ్వే నయం."

"ఏం అమ్మా.''

"కాన్వెంటుకు పోయే టప్పుడు— టా టా...అనటానికి అమ్మ వుంటేనా... ఆంటీ టా...టా...''

''టా...టా...!'' కారు కదలగానే అక్కడే నిల్చుండిపోయింది. కళ్ళల్లో కన్నీళ్ళు తిరిగిపోయాయి. ఎన్నాళ్ళకి కళ్ళల్లో కన్నీళ్ళు స్వతహాగా కార్చ గలిగింది? చల్లని స్వచ్ఛమైన కన్నీరు?

తనూ అలా చిన్నపిల్లలా కాన్వెంటుకు పోవాలనీ, చదువుకాగానే పెళ్లి చేసుకొని సంసారాన్నీ, పిల్లలనీ, యింటినీ చక్కబెట్టుకోవా లనీ...ఏవేవో క్షణికమైన వెర్రివూహాలు కలిగాయ్. తన జీవితం యింతవరకూ తలా తోక లేని కథ – యిహనైనా కథ రక్తికట్టిస్తే...?

* * *

"ఒక వారంరోజులు వున్నాక వెళ్తే బాగుంటుందేమో?'' అన్నాడు నవీన్.

"ఒద్దు. మీరెవరూ రాకండి. నేనే వెళ్తాను" అంది శోభ.

ఐనా శాంతి మూడు రోజులుపోయాక కారులో చెంబూరు ప్రొటెక్టివ్‌హోమ్‌కు తీసుకవెళ్ళి దిగబెట్టింది.

## 3

శాంతి దిగబెట్టిన వారంనాడే శోభ

తిరిగొచ్చేసింది. "ఎంతపని చేశావ్? వాళ్ళతో కయ్యంకూడా తెచ్చుకున్నావా?''

"అవును మరీ - అంతా మిలటరీ డిసిప్లిన్. సినీమాకు తీసుక వెళ్ళారు; ఒక వరసగా నడచివెళ్ళాలి. మా మీద వెటకారంగా యెందరికళ్ళో! ఎక్కడికీ వెళ్ళటానికీ, పైవాళ్ళెవరితోనూ మాటాడటానికి వీల్లేదు. నానాచాకిరీ — మా బట్టలు మేమే వుతుక్కోవాలి — వంటవార్పులు చేసింది కొక చదువూ, సంధ్యా, అల్లికలూ, కుట్టుపనులు_ఒళ్ళు హూణం హూణం అయిపోతుంటే — మధ్యను యెగతాళి చెయ్యటానికి ఒక మగపురుగైనా వుండేనా?''

"మగవాళ్ళను యెగతాళెందుకు చెయ్యాలీ?''

"ఏమో...నాకు వాళ్ళని చూస్తే అలానే అనిపిస్తుంది."

"సరే...ఇప్పు డేం చెయ్యాలని?"

"మళ్ళీ నా మొదటిచోటుకే పోతాను."

"మళ్ళీ ఆ పులి బోనులోనికా___?"

"చెంబూరు హోమ్ బోనులా కనిపించక పోయినా అందులో బ్రతుకు బోనుల్లో నున్న ఆడపులుల బ్రతుకులే మా అందరివీను. నాలా యెందరో యిది వరకే తప్పించుకపోయారు."

"తొందరపడి యెంత పొరపాటు చేశావు చెల్లీ."

"పొరపాటు — నీ కలానే వుంటుంది? పాపను చూడాలని వెళ్ళిన దగ్గరనించీ మనసే! పర్మిషన్ అడిగితే వెటకారంగా విసుర్లు. మీ కెందుకమ్మా యింత శ్రమ? ఓ సారి పాపనుచూసి పోనివ్వండి."

"నిన్ను మళ్ళీ ఆ పాపం నిండిన బోను లోనికి వెళ్ళ నివ్వను.''

"పైకి బోనుల్లా కనిపించినా అక్కడున్న స్వతంత్రం యెక్కడాలే దక్కా! నా యిష్టం వచ్చినట్లు వుండేదాన్ని. ఒకరు మారాం చేస్తా రనిగానీ అనుమానిస్తా రనిగానీ, తిట్టా రనిగానీ, యేమనుకుంటా రనిగానీ. ఏంటో గాలిలో యెగిరే పిట్టలా మన స్సెప్పుడూ నువ్వన్న ఆ బోనులోనే వుల్లాసంగా వుండేది. ఈ వారం రోజులూ నేను నిజంగా జైలుశిక్ష అనవసరంగా అనుభవించాను అనిపిస్తోంది.''

"సరే_ముందు స్నానం చేసి, బట్టలు మార్చు'' అంటూ శాంతి తన చీర నొకటి యిచ్చింది.

భర్త రాగానే జరిగినసంగతి చెప్పింది

"అయితే యేం చేద్దాం?'' అన్నాడు

"మళ్ళీ అక్కడికి వెళ్ళే అవకాశం యిస్తే_ఈ కృషి అంతా వృధా_ఒక పని చేద్దామా? పాపకు యీమె అంటే ప్రాణం. పెరటియింట్లో వుంటుంది ఇల్లు చూసుకుంటుంది. అడగనా?''

"నీ యిష్టం.''

శాంతి అడగ్గానే "ఎందు కక్కా నీకీ శ్రమ?'' అంది శోభ.

"పాపను చూసుకొని వుంటావ్. దానికి

నువ్వంటే ప్రాణం—ఇంకో విధంగా నీకు అభ్యంతరం లేకపోతే....''

''అభ్యంతరం అంతా ఒక్క విషయం లోనే...''

''ఏంటది ?''

''నీకు తెలుసు — నాలాంటి వాళ్ళను మీ యింట్లో వుంచుకోవటం మీకు అప వాదులు తెస్తాయి.''

''నాకులేని అనుమానం నీ కెందుకు?''

''పాపమీద మమకారమే నన్ను మీ యింట్లో వుండనిస్తోంది. అయితే ఒక్క హామీ యిస్తావా ?''

''ఏంటి చెప్పు ?''

''అనుమానం మీద న న్నెప్పుడూ బయటకు పంపవా ?''

''పిచ్చిపిల్లా—నాకు యెవరిమీదా అను మానాలు లేవు.''

''మీ ఆయన మీదో ?''

''ఏం బావగారిమీద పట్టించావ్ ?''

''మగాళ్ళను నీలా నమ్మే ఆడదాన్ని యెక్కడా చూడలేదు.''

''ఇంట్లో వుంటావుగా — నా నమ్మ కలో నిజం నువ్వే తెలుసుకుంటావులే.''

శోభ నవ్వింది. శాంతి కాస్త హుందాతో,

''మనిషి ఒక అంతస్తు చేరుకున్నాక అవినీతికి పాల్పడలేడు. అలా వున్నత మైన అంతస్తుకు మీ బావగారు చేరుకున్నా రని యింకా పోల్చుకోలేదా ?''

''నేను కాదన్నానా ? ఆయన మహామ ళావుడు.''

''ఇప్పటికైనా పోల్చుకున్నందుకు సంతోషం.''

''ఆఖరికి జయించావక్కా.''

''నిన్ను మళ్ళీ ఆ పులిబోనుకి పంపి స్తానా ?''

''ఆ పట్టింపే వద్దు. నీకు కోపంరాదని యెలా అనుకోమంటావ్ ?''

''నీ విషయంలో యెప్పుడూ రాదు.''

''నీ కంటే నాది పైచెయ్యి అయితే.''

''సంతోషిస్తాను.''

''ఆడదానికి అసూయ లేదంటే నే నొప్పుకోనక్కా.''

''ఈ యింట్లోనుంచి యిలాంటి అసూ యలూ, అనుమానాలూ యేనాడో పంపించివేసాం.''

''నేను తిరిగి తెచ్చానేమో ?''

''తెచ్చినా అవి తిరిగి పోతాయ్. నిన్నో మనిషినిచేస్తాయ్.''

''నేను మనిషినికానా యిప్పుడు ?''

''దీపాల ప్రకాశంలో తేడా లున్నట్టే మనుషుల్లోనూ వుంటాయ్. పెద్దలంటారు చూడు — దేదీప్యమానంగా ప్రకాశించా డని.''

''అంత ప్రకాశం వద్దుబాబో — యెవరూ చూడలేరు.''

''ఒక్కసారి మెరుపులా ప్రకాశించ వద్దు — రానురాను...ప్రకాశిస్తే నే... అందం.''




''నిద్రపోతువాడిమీద కార్టూను వేశావా? ఏమిటి నీ ఉద్దేశం. నన్ను వెక్కిరించాలనేనా?''

"నీ దగ్గర చాలానేర్చుకున్నాఅక్కా! బావగారుకూడా నీలానే నేర్పిస్తారేమో?"

"నేర్చుకో _ నేర్చుకున్నది యేనాడో సహాయ పడ్తుంది.''

మాటలు యింకా పొడిగించేదే. పాప స్కూల్‌నించి వచ్చి రావటంతోనే,

"ఆంటీ" అంటూ మీదకు వచ్చింది.

శోభ పాపను తీసుకొని చిన్నముద్దు పెట్టగానే ''ఆంటీ...ఆంటీ...ఎక్కడికి వెళ్ళిపోయావ్? నేను నీకోసం యేడ్చాను."

శోభ కళ్ళుతుడుచుకొని "నీ యేడుపు విని వచ్చేశానుగా!"

"మళ్ళీ యెప్పుడూ వెళ్ళవుకదూ? నా దగ్గరే వుంటావుకదూ?''

''హాఁ...''

శాంతి "టా టా..." అంటూ వెళ్ళిపోయింది. అమ్మవేపు చూస్తూ "ఆంటీ.. ఆంటీ ... అమ్మ సరిగ్గా యింట్లోనే వుండదు!''

''ఎక్కడకు వెళ్తుంది?"

"అమ్మ నాలా స్కూలుకి వెళ్తుందట!"

"ఎవరన్నారు?"

"నాన్గారు."

"మరి నాన్నగారో?''

"ఆఫీసుకు."

"కాదు."

"మరెక్కడికి?"

"స్కూలుకి."

"నిజం?''

"నిజంగా—"

"నేను స్కూలుకి—నాన్నారు స్కూలుకి మరి అమ్మ స్కూలుకి ... అందరికీ చదువే...నువ్వూ వెళ్తావా ?"

"నే రాను. నాకు వచ్చిన చదువు చాలు. నిన్ను చూసుకొని వుంటా-పద" అంటూ లోనికి తీసుకవెళ్ళింది. బట్టలు మార్చి స్నానం చేయించి గౌను వేసి దగ్గరగాఉండి బిస్కట్లు, పాలు యిచ్చింది. ఇద్దరూ పెరటి చిన్నగార్డెన్‌లో రింగుతో ఆడుకుంటుండగా నవీన్ దిగబడ్డాడు. ఒక్కసారి కోరి ఓడిపోయిన శోభకు వినిపించేట్లు చప్పట్లు కొట్టాడు.

"వెల్‌డన్ పాపా...వెల్‌డన్."

"గుడ్ యీవినింగ్ డాడీ ?" అంటూ కాస్సేపయ్యాక పాప దగ్గరకు వచ్చింది. నవీన్ అంతవరకు శోభ విప్పారిన యౌవనపు బిగువుతో ఒళ్ళంతా త్రిప్పుతూ ఆడుతుంటే చూస్తున్నాడు. శోభకూడా దగ్గరకు వచ్చింది. చెమట పట్టిన శరీరాన్ని చీర చెంగుతో తుడుచుకుంటుంటే,

"చాలా బాగా ఆడుతున్నావే" అన్నాడు.

"అబ్బే – నాకు రాదండీ. పాప బలవంతం."

"మరి కాస్సేపు ఆడరాదూ ?"

"మీకు టీ..."

"తొందరలేదు"

"మీరు టీ త్రాగాక...కావలిస్తే."

"అయితే వేగం..."

పాప కబుర్లు చెప్తుండగా నవీన్‌కు టీ, బిస్కట్లు శోభ పెట్టింది. రెండే బిస్కట్లు నమిలి టీ త్రాగి తనే ఆటకు తయారయ్యాడు. పాప ఒకవేపు నవీన్ యింకోవేపు. ఆటపై దృష్టిలేని నవీన్ ఓడిపోగానే పాప "డాడీ...షేమ్...షేమ్" అంది.

"మీ యిద్దరూ ఆడండి. నేను అంపైర్‌గా వుంటాను."

వాళ్ళ ఆట వుధృతంగా సాగుతోంది. నవీన్ స్కోరు తడబడుతోంది. శోభ శృంగార మంతా ఒలకబోస్తోంది. గాలి వీచింది. చెట్టుకున్న కొమ్మలు కదలి చేతి కందేటట్లు వంగుతున్నాయి. పర్వత శిఖరాలు, మేఘాలను చీల్చుకుంటూ నింగి వేపు చొచ్చుకొని పోతున్నయ్. అనంతమైన ఆకాశంలో ఆవేశంతో మేఘాలు ఢీ కొంటున్నాయ్. నవీన్ నరాలు తోడుకుంటున్నాయ్.

గెలిచినపాప ఒక్కసారి పరుగెత్తి ఆంటీ మెడను చుట్టేసుకుంది.

"రా—అమ్మా—రా" అంటూ నవీన్ దగ్గరకు వెళ్ళి పిల్చాడు. పాపను అందుకుంటూ శోభ చేతిని తాకాడు. ఆమె చెయ్యి చప్పున లాక్కుంది. అతనోసారి ఆమె కళ్ళల్లోనికి చూడా లన్న ప్రయత్నం ఫలించలేదు. మేఘాలు వర్షించకుండా అరుస్తున్నాయ్.

వర్షం ముంచుకొని వచ్చేసరికి నవీన్ చెమట చల్లారింది. శాంతి దగ్గరగా కూర్చోగానే మనసు మరోవేపు త్రిప్ప టానికి ప్రయత్నించాడు. ఐనా కళ్ళల్లో హత్తుకున్న ప్రతిబింబాలు యింకా మనో వికారాన్ని పూర్తిగా మాపివేయ లేదు. అరుణోదమయ్యేసరికి మళ్ళీ ఆవేశం పెనవేసుకుంది.

శాంతి వుదయమే వెళ్ళగానే తను ఆఫీసుకు ఆలస్యంగా వెళ్ళాడు. ఎదురుగా నున్న కుసుమాన్ని గగనకుసుమంగా, అందమైన సౌధాన్ని ఆకాశహర్మ్యంగా వూహించలేకపోయాడు.

అందుబాటులోనున్న వస్తువును విడచి పెట్టే ఋషిపుంగవుడు కాడతడు. తన కోరిక బలీయమైనకొద్దీ శోభ దూర మౌతోంది. ఆమె గత చరిత్రను తెలుసు కున్న తను యిదంతా నటన అని నిర్ధా రించుకున్నాడు. ఆమె ఒక సుఖం తప్పించి తనకు కావలసిన అన్ని సుఖా లను యింట్లోవుండి అందజేస్తోంది. రాను రాను ఆమె యింట్లో యిల్లాలైనట్లు భ్రమించినట్లు చేస్తోంది. తన భార్యయైనా తనమీదా, పిల్లమీదా అంతశ్రద్ధ తీసుకో లేదు. ఈమె యీ యింటికి క్రొత్త అను రాగం అందం వెలుగు తీసుకవచ్చింది. పురుగులుపట్టి ఆకు లన్నీ రాల్చిన మొక్క కొన్నాళ్ళకు క్రొత్త చిగుళ్ళను తొడిగి నట్లుగావుంది. తొడిగిన మ్రొగ్గలను పూల గుత్తులుగా మార్చి సువాసనలను వెదజల్లే రాత్రులు ఆసన్న మయ్యాయ్.

తోటలో నైట్ క్వీన్ వాసనకు ఒకసారి పాము దరిచేరి యేదో శబ్దం కాగా తొంగి చూచి వెళ్ళిపోయింది. ఇంకోసారి రాలిన పూలపైనుంచి కదలిపోయింది. పసిడి వెన్నెలలో పూలగుత్తుల గుభాళింపులు అధికమై మత్తెక్కించి మనస్సును అదుపులో లేకుండా చేస్తున్నాయ్.

ఒకనాటి రాత్రి శాంతి అన్నది.

"శోభ యేమీ చెప్పదు—పెళ్ళి చేస్తా నంటే నా కెందు కని నవ్వుతుంది."

"నీ కెందు కా వూహ పుట్టింది? అయినా యిప్పుడు దానికి తక్కువేం వచ్చింది?" అన్నాడు నవీన్.

"తక్కువని కాదు ... మీ రొకసారి అడిగితే మంచిదేమో?"

"సరే—భోజనాల దగ్గ రడుగుతాను."

ఆ మరుసటి రోజు భోజనాల దగ్గర "చూడు శోభా...మీ అక్క నీకు పెళ్ళి చెయ్యా లని పట్టుబడ్తోంది!"

"ఎవరి నిచ్చి—"

"మంచి మగవాడ్నిచ్చి!"

"అయితే నా కష్టాలు యింకెవరికీ రావు."

"చెల్లీ — చాల మంచివాడు. నెలకు నూరుపైనేతెచ్చుకుంటున్నాడుకాదనకు"

"మీ చేతులతోనే నా పెళ్ళి చేస్తారు?"

"అవును –"

"నేను మీ కే మొాతానని చెప్తారు ? ఎక్కడ దొరకానని చెప్తారు ?"

"అవేవీ చెప్పం ?"

"అయితే పెళ్ళయాక నన్ను రోజా నా గత చరిత్ర తెలుసుకోవాలని చంపుక తింటాడు."

"అదంతా చెప్పకు."

"ఊరుకుంటాడా ? లేనిపోని అను మానాలు పెట్టుకుంటాడు. చెప్పకపోతే కోపగించుకుంటాడు. ఇంకా వూరుకుంటే కొట్టాడు. అనుమానం రాను రాను పెరిగి పోతుంది. నేనో కులట నని నా పీక తెగేసి తనూ బలవంతంగా పోలీసులను తప్పించుకోవాలని ఛస్తాడు."

"అంత మంచివాడు అలా చేస్తా డంటే నమ్మను."

"శ్రీరామచంద్రుడు చెడ్డవాడాక్కా ?"

జవాబు చెప్పని శాంతితో "పర పురుషుణ్ణి కలలోనైనా తలంచని సీతమ్మ తల్లిని అగ్నిపరీక్ష చేసింది కాకుండా అడవిపాలు చేసేసాడు. దేముడంతటివాడే ఆడదానికి దుస్థితి పట్టిస్తే...నాలాంటి దానికి పెళ్ళెందుకు?"

"అవన్నీ కథలు – ఎంతకాలం ఒంట రిగా వుంటావు !"

"పాప వుందిగా..."

"అదీ పెద్దదయి అత్తవారింటికి వెళ్ళి పోతే...?"

"ఆరోజు సంగతి చూసుకుందాం."

"అలాంటి పాప పుట్టాలని మనసు కలగలేదూ ?"

శోభ నవ్వేసింది.

"నా మాట వినుచెల్లీ. ఇంతకంటే మంచి అవకాశం దొరకదు – ఎంత శ్రమపడి యీ సంబంధం తెచ్చానో ఆలో చించావా ?"

"క్షమించు అక్కా ! ఏ విషయంలో నీకు పూర్తి విశ్వాసం వుందో ఆ విష యంలో నాకు విశ్వాసం లేనే లేదు."

"పిచ్చిదానిలా అవుతా వెందుకని" శాంతి విసుక్కోగానే.

"నీకా – నాకా – అక్కా ;" శోభ నవ్వింది.

"నీకు...నీకు...నీకు..." గట్టిగా అంటూ అక్కడినించి చిరాగ్గా కదలి పోయింది.

బయటికి పోయిన భార్యను చూసి నవీన్ శోభవేపు చొరవ చేసుకొని చూశాడు. ఆమె కళ్ళు తొలిసారి అతని కళ్ళల్లోకి నిదానించి చూశాయ్. కళ్ళద్వారా మనసులు మాటాడుకున్నాయ్. మనో భావాలు హృదయస్పందనలై వినిపించి రక్తం పొంగి ప్రవహించింది.

నవీన్ దగ్గరగా వచ్చాడు. అతని

చేయి ఆమె భుజమును తాకింది. ఆమె కూర్చునే తలెత్తి దరహాసం చేసింది. అతను నవ్వుతూ ముఖం వంచాడు. పెదాలలో పవ్వళించిన ప్రేమ మేల్కొంది.

"నా శోభా..." అన్నాడు.

ఆమె మనస్ఫూర్తిగా నవ్వింది. అతని చేతిని తన చేతుల్లోకి తీసుకొని నొక్కింది.

"ఎన్నాళ్ళకు నీ దయ కల్గింది..." నవీన్ ప్రేమ పగ్గాలను లాగాడు.

"ఇన్నాళ్ళు నటించాను...ఇంక నటించలేను. మీ సుఖాన్ని కాదనలేను."

అతని ఆవేశం మాటలను మ్రింగేసింది. కళ్ళను చిల్లులను చేసింది. ఆమెను కుర్చీమీదనుంచి చేతులతో లేపనెత్తాడు. దొరికిన పుష్పాన్ని నలపకుండా వదిలే అమాయకుడు కాడు. ఆమె కిలకిల నవ్వుతూ అంతవరకూ నిశ్చేష్టురాలై వాకిలి తలుపుదగ్గర నిల్చున్న శాంతి వేపు చూపిస్తూ "అదిగో...అక్క"

నవీన్ మొదట వినిపించుకోలేదు. శోభ అతనిముఖం పట్టుకు ఆమె వేపు త్రిప్పగానే శోభను క్రిందకు దించాడు.

"రా..అక్కా..రా..." అంది శోభ.

చల్లబడిన పాదాలు మెల్లగా వేసుకుంటూ శాంతి ఆమెదగ్గరకు వచ్చి ఒక్కసారి కఠినంగా,

"నా యింట్లో నాగుపాముని పాలిచ్చి పెంచానని అనుకోలేదు. ఫో..నాయింట్లోనించి — ఫో..."

శోభ నవ్వుతూ "పోడానికే వచ్చానక్కా! ఇప్పటికైనా నీ విశ్వాసం పోయిందా ?"

"వెళ్ళు...తిన్నగా వెళ్ళు."

"నాకోసం యింత శ్రమ తీసుకున్నావు కదా, నీకు అన్యాయం చేస్తానా ?"

"ఇంకేం చెయ్యాలి ?"

"బావగారి శీలాన్ని చెరప లేదులే అక్కా! ఇంకా ఆయన యేకపత్నీ వ్రతుడే. నాదంతా నటనే!"

"నటన!...ఫో"

"వెళ్ళిపోక వుండి పోతానా ? నీవు ఒక్కమగాడితో పడుతున్నావు—అందుకే నీకు అతని శీలంమీద అంత విశ్వాసం కానీ నేను వందలాదిమగాళ్ళని చూశాను. వాళ్ళ ప్రేమగోల వినలేక విసిగి పోయాను. బావగారిలాంటి కొమ్ములు తిరిగిన మగాళ్ళు కొంగు తగిలితే పోలేమంటారు. ఇల్లాలు అదుపులో పెట్టినన్నాళ్ళు మగాడు మృగం కాడు. ఇన్నాళ్ళూ యీ పులిబోనులో పెట్టి ఆదరించినందుకు కృతజ్ఞురాలను — వస్తాను— టా — టా."

శాంతి ఒక్కసారిగా వెక్కి వెక్కి ఏడవ నారంభించింది.




# నిజం దాగదు

కొడవటిగంటి కుటుంబరావు

ఆ మాట కనకానికి తెలియకపోలేదు — నిజం దాగదు. బయటపడితీరుతుంది. ఐతే మరి తను ఇప్పు డేం చెయ్యాలె ? ఆ ప్రశ్నకు సమాధానం ఆలోచించలేక బాధ పడసాగింది కనకం.

ఈ పరిస్థితుల్లో మరొకతె అయితే ఏం చేసి ఉండేదో కాని ఆమెకుమాత్రం ఏ ఉపాయమూ తోచ లేదు. వ్యవహారం ఇంతదాకా వచ్చిన తరువాత తనుఇప్పుడు ఏంచేసినా చిక్కే ; ఏం చెయ్యకపోయినా చిక్కే !

ఇది ఇంకొకరిని సలహా అడిగే విషయమైనా కాదు మరి. ఉన్న దంతా చెప్పేస్తే తనను ఎవ్వరూ క్షమించరు. కొంత మార్పుచేసి తనమీద ఏమీ నింద మోపటానికి వీలులేకుండా చెబితే నవ్వుతారు. ఏది దారి ?

మొదట్లోనే — మొట్టమొదట్లోనే — తను ఒకవిధంగా ప్రవర్తించిఉంటే తనకీ సమస్య తప్పిఉండేది అని అనటానికి కూడాలేదు ఖర్మం !

ఇదీ జరిగినసంగతి. పదిహేనురోజుల కిందట వేశవిశలవులకు ఇంటివారబ్బాయి ప్రకాశం పట్టణంనించి వచ్చాడు. అతను నాలుగురోజులకు వస్తా డనంగా అతని భార్యా సౌభాగ్యం పుట్టింటినుంచొచ్చింది.

విశాలమైన కళ్ళు, తళతళ మెరిసే చెక్కిళ్ళు, అందమైన కోలమొహమూ, మహా నాజూకైన నడకా — సౌభాగ్యం మంచి అందగత్తె. ఆ పిల్లకూ తనకూ మంచి స్నేహ మయింది, ఒకరి నొకరు చూసుకున్న క్షణంనించీ.

సౌభాగ్యం భర్తకోసం ఆదుర్దాగా ఎదురుచూస్తున్నట్టు తనకు సులభంగా తెలిసిపోయింది. తా మెంత అన్యోన్యంగా ఉండేదీ సౌభాగ్యం తనతో దాచకుండా చెప్పేసింది. తనూ, తన భర్తా కలిసి తీయించుకున్న ఫోటోలు నాలుగు చూపించింది తనకు. ఫోటోలోనే ప్రకాశం ఎంతో అందమైనవాడుగా కనిపించాడు. కాని చూడవలసింది అతని ఫోటోను కాదు — అతన్నే. అతనిదగ్గిర రాజు — చక్రవర్తుల కుండదగిన కళ ఉంది. అతని మాటల్లోకూడా అంతదర్జా ఉంది. అతనిచూపుకూడా భయం ఎరగని సూటి అయిన చూపు. కాని అందులో కాఠిన్యం లేదు, చూపే ఇంత చేసింది.

వచ్చిననాడే ప్రకాశం తను బావిదగ్గర చెంబులు తొలుస్తుండగా స్నానం చెయ్యటానికి వచ్చి తనవంక ఆచూపు చూశాడు. వెంటనే తనకు మతిపోయిన ట్టయింది. అతనికళ్ళు పలకరించగలవు — అదేం చిత్రమో ! — తనను పలకరించినై, ఎంతో సహజంగా, తప్పుచేస్తున్న భీతే లేకుండా !

ఆ తరవాత ప్రకాశం తనవంక అట్లాగే చూస్తూవచ్చాడు. తన కేమనుకోవటానికి తోచలేదు. సౌభాగ్యంవంటి భార్యను పెట్టుకొని అతను తనను చూడగానే మోహించా డనుకోవటం కష్టమైంది. అతను భార్యకన్న తనను ఎక్కువగా భావించటం అసాధారణ మైనప్పటికీ అసంభవం మాత్రం కాదు. ఐనా దీని అంతేమిటో కనుక్కోవా లనే తెగులు తనకు పుట్టింది — దాచటం దేనికీ ?

ఆ తరవాత తను అవకాశం దొరికినపుడల్లా — మూడోవాడికి తెలియకుండా— అతనివంక తదేకదృష్టిగా చూడటం మొదలుపెట్టింది. ఈ పని చెయ్యటానికి తను లేని అవకాశాలుకూడా కలిపించుకోసాగింది. ఎవరైనా తన మనస్సు పగలగోసి చూసి తప్పుపడతా రని ఒకచెంప భయంగానే ఉండేది. కాని తను కొంత సాహసించింది. ఆ సాహసంవల్ల తన కేదో తృప్తికూడా కలిగేది.

ఇట్లా రెండురోజులు గడచినతరువాత ప్రకాశం కళ్ళలోకి తనవంక చూస్తున్నప్పుడు ఒక విచిత్రమైన మార్పు — ఒకవిధమైన స్వతంత్రభావంతోకూడిన చిరునవ్వు — రాసాగింది. అప్పటినించీ తనకూ అతనికీ ఏదో ఆహ్లాదకరమైన బాంధవ్యం— బంధం — ఏర్పడ్డట్టు అనిపించింది తనకు. ఈ బంధం తనకూ అతనికీ తప్ప మరొకరికి అర్థంకావటం కష్టం. ఇంతమాత్రం చేత తన పాతివ్రత్యానికి కలిగే ఆటంకం

కూడా ఏమీ లేదు. కనుక తన అంతరాత్మ తన నేమీ బాధించలేదు.

కాని ఆ రాత్రి చీకట్లో తను భోంచేసి చెయ్యి కడుక్కుని వస్తుండగా ప్రకాశం తనను వెనకనించివచ్చి ఆలింగనం చేసుకుని మెడమీద ముద్దుపెట్టుకుని ఏమీ జరగనట్టు నిశ్చింతగా వెళ్ళిపోయినందుకు తనా బాధ్యురాలు ? ఇందువల్ల తనకు ఏమాత్రమైనా సుఖం కలిగినా అది తన తప్పుకాదు. తనను తన భర్త అంత ప్రేమగా పరామర్శించి ఎంతకాలమైందో: ప్రకాశం ఆ పని చెయ్యకపోతే బాగుండే దని తను అనుకోకపోలేదు; అందువల్ల కలిగిన సుఖాన్ని తను హృదయంలో దాచిపెట్టి ఆరాధించలేదు. చేసుకున్నవారికి చేసుకున్నంతా ! తనకు ఇటువంటి అల్ప సుఖాలు తన భర్త ఇవ్వకపోతే లేకుండా జరుపుకుపోవాలనేకాని వీటికోసం దేశం మీదున్న మగవాళ్ళందరిమీదా పడ్డమేనా?

పుణ్యపాపాలసంగతి అట్లా ఉంచి ఎవరైనా చూస్తే ఎంత అప్రతిష్ఠ ? అతని కేం, మగవాడు. ఆక్షణాన తన భర్తగాని, అత్తగారుగాని, ఆడబిడ్డగాని, అవతలి భాగంలోనించి సౌభాగ్యంగాని, ప్రకాశం చెల్లెలుగాని, తండ్రిగాని — ఎవరుదొడ్లోకి వచ్చినా తనగతి ఏమైఉండును !

అతను అంత సాహసి ! నలుగురూ చూస్తూండగానే అతను భార్యను వీపుమీద తడతాడు. ఆ పిల్ల బుజాలమీద చేతులు పెట్టి వంగి ఆమె చెవిలో రహస్యం చెబుతాడు. ఆమె కూర్చున్న మంచంమీదే కూర్చుంటాడు. ఆ పనులే మరొకరు చేస్తుంటే లేకితన మనిపిస్తుంది. కావి అతను చేస్తే అనిపించదు — అతని తెలివి తేట లెటువంటివో !

పరపురుషుణ్ణి స్పృశించా లనే యావ తనకు ఏకోశానా లేదు — స్వర్గసౌఖ్యం కోసమైనాసరే. తను పెద్ద పెద్ద పతివ్రతల జాబితాల్లో చేరుదామనికూడాలేదు. ప్రకాశంమీద తనకు మనస్సు పోక పోలేదు. పోయి ఏమిటి చేసేది ? అతని వల్ల సుఖించే యోగ్యత తనకుంటే ప్రకాశమే తనకు భర్త అయ్యేవాడు. అదే తన వేదాంతం. ఏదో వేదాంతం లేకపోతే ఈ ప్రపంచంలో ఎట్లు నెగ్గిరాగలంగనక !

అనుకోవటమేగాని వెనకనించివచ్చి పరపురుషుడు ఆలింగనం చేసుకున్న తరువాత ఈ దిక్కుమాలిన కలికాలంలో ఏ సీత అయితే ఏం చేస్తుంది ? అరుస్తుందా ? నలుగురూ వచ్చి ఏం జరిగిందని అడుగుతారు. జరిగిన సంగతి చెబితే మరుక్షణంనించీ ఆ మనిషిని కొంతవరకు చెడిపోయిన మనిషికిందే చూస్తుంది, లోకం: లేక "నన్ను అతను ముట్టుకో బోయినాడు" అని అంటే, కొంతమంది అయినా "అబ్బో ! ఏం విపరీతం మనిషిరా ! మగవాణ్ణి పక్కగానైనా వెళ్ళనివ్వదే ! ఎంత పతివ్రత !" అని హేళన చేస్తారు...ప్రకాశాన్ని అల్లరి చెయ్యాలని తనకు లేకపోవటం ఒక పాయింటు



''నా లెక్క తప్పంటారా చూడండి, అంతా చేర్చి పది. యాభయిమూడు

కాదు! — అతన్ని అల్లరి చెయ్యదలచు కున్నా తనకు అవకాశం లేదు కనక.

ఆనాటినించీ ఈనాటివరకూ — ఈ పది పన్నెండు రోజుల్లోనూ — ప్రకాశం తన మీద ఏ డెనిమిది సార్లయినా చెయ్యి వేశాడు. రెండుసార్లు తనను గాఢంగా కౌగిలించుకుని ఆప్యాయంగా ముద్దు పెట్టు కున్నాడు. అనేకసార్లు తనని 'కనకం' అని రహస్యంగా పలకరించాడు. ఆ పిలు పులో విద్యుత్ప్రసారం ఉంది.

అతను ఇటువంటి పని చేసినప్పు డల్లా తన జీవితం ఒక్కసారి వెలిగిన ట్లవుతుంది. ఈ వెలుగు మూలకంగా తన మిగతా జీవితం మరీ గాఢాంధ కారంలో ఉన్న దనిపిస్తోంది. తన కతను సుఖం కలిగించటం లేదనుకోడం అనవ సరం — అసత్యం కూడానూ. అతనిమీద కోపం తెచ్చిపెట్టుకోవటంకూడా అనవస రమే — పైగా అసాధ్యం. తనని ఇంత ప్రమాదమైన స్థితిలోకి తెస్తున్నందుకు ఏమైనా కోపం కలిగిఉంటే, అది కాస్తా మొన్న అతను "కనకం, నే నెప్పుడో నీ కొంప తీస్తాను. నీ కాపరం చెడగొట్టు తాను...నీ కోసం చెయ్యి చాచకుండా ఉండలేకపోతున్నాను. ఏం చెయ్యను?" అనగానే చప్పున చల్లారిపోయింది.

తప్పులోకూడా మంచితప్పూ, చెడు తప్పూ అంటూ ఉంటుందో ఏమో! ప్రకాశం ఏం చేసినా తన అంతరాత్మకు వెగటుగా ప్రవర్తించడు. అతను ఒక్క అసహ్యమైనమాట నోటివెంట అనలేదు; ఒక్క కౌగలింత — ఒక్కముద్దు —

ఇంతకంటె అధికంకోసం తనను నిర్బం ధించలేదు. అతను ఏం చేసినా సరే "ఇవాళనించీ నాలో కలుషం ప్రవేశిం చింది. నే నిక చెడిపోయినవాళ్ళలోజతే!" అనిపించదు.

ఇవాళవరకూ తన అదృష్టం బాగుంది. కాని ఇట్లా ఇక ఎంతోకాలం వెళ్ళదు. వెళ్ళటం అసంభవం; ఎప్పుడో ఎవరో చూస్తారు. అసలు ఇంతకాలం ఇట్లాజరిగి ఉండటమే ఆశ్చర్యం. ఇదివరకే ఎవ రైనా పసిపట్టి బయటపడకుండా సమయం కోసం కనిపెట్టుకున్నారేమో అని భయంగా ఉంది. తన ఆడబిడ్డ కాలాం తకురాలు; ఆవిడ మామూలుగా తనవంక చూస్తుంటేనే అంతరాత్మను పరీక్షిస్తున్న ట్టుంటుంది: ఈ పదిపన్నెండురోజుల్నించీ ఆవిడకేసి చూట్టానికే తనకు దడగాఉంది!

తన కిప్పు దేదిదారి ? ఈ పద్మవ్యూ హంలోనించి తను బయటపడటం ఎట్లా? ప్రకాశం మీద తన పంచప్రాణాలూ ఉన్నై. ఉంటే ఏం ? అంతగా అయితే అతనికోసం రహస్యంగా తపించ వచ్చును. అందువల్ల ప్రమాదంలేదు. కాని ఇదంతా బయటపడిపోతే తనకు ప్రపంచ మంతా తారుమార వుతుంది. అటు తన పుట్టింటివారికీ, ఇటు అత్తవారి వైపువారికీ శాశ్వతమైన తలవంపూ. తనకు ఆత్మహత్యా తప్ప మరేమీలేదు. నిజం ఎట్లాగూ బయటపడుతుంది. బయటపడితీరుతుంది; ముమ్మాటికి నిజం!

కొద్దిపాటి జ్వరంగా ప్రారంభించిన ప్రకాశం వ్యాధి మందులకు ఎదురు తిరిగి అతన్ని మంచాన పడదోసి లంఖ ణాలు చేయిస్తున్నది. పైగా అతనిది కాస్త పైత్యశరీరమో ఏమోకాని అప్పు డప్పుడూ బిగ్గరగా కలవరించడమూ, సంధించినట్లు మాట్లాడటమూ కూడా ఉంటున్నది.

"ఇప్పటికి పదిలంఖణాలు. టైఫా యిడ్ జ్వరమే అయితే ఇంకా పదిరోజు లిట్లాగే వెళ్ళుతుంది; ఆ తరవాత మళ్ళీ ఒక నెలదాకా కోలుకోడు. అప్పటికి శలవులు దాదాపు అయిపోవస్తూఉంటై. ఇది నాకోసమే వచ్చిందేమో" అని కనకం లోలోపల సంతోషించింది. కనకం అంతరాత్మ ఈ విధమైన ఆలో చనలను తీవ్రంగా ఖండించింది. కాని అంతరాత్మను లక్ష్యంచేసి ఏ ఆడది నెగ్గుకు రాగలదు ? కనకం అంతరాత్మను గడ్డి పరకకింద తోసిపారేసింది. ఆమెకు ఒకటేచింత -- ప్రకాశానికి వచ్చిన జబ్బు టైఫాయిడ్ కాదేమోనని! డాక్టరు ఆ విషయం రూఢిగా చెప్పలేదు -- అస లాయన నోటివెంట మాటేరాదు. "రోగం ఏమిటండి" అని నిలదీసి అడిగితే "ఏదైనా మీకు ఒకటే. నాలో నమ్మకం లేకపోతే ఇంకో వైద్యుణ్ణి పెట్టుకోండి!" అని నిర్మొహమాటంగా అన్నాడు. పేరుపడ్డవాడు ఏమంటే చెల్లదు కనక !

ఒక నాడు సాయంకాలం సౌభాగ్యం



"అట్లా నెట్టుకొస్తావెం? నా సత్తిన కూర్చో. లేకుంటే?"
"థాంక్స్. ఇక్కడే బావుంది, అక్కడైతే జారుతుంది."

కనకందగ్గిరికి కంటనీరు పెట్టుకుంటూ వచ్చి కూర్చుంది. ఎంత ప్రశ్నించినా కారణం చెప్పలేదు. కనకానికి జడవేస్తూ ఉండిన ఆడబిడ్డ "ఊరుకో! అమ్మాయి. ఇంతలో వచ్చిన ప్రమాదం ఏమీలేదులే."

"అది కాదండి, అక్కగారూ!... మగవాళ్ళ మనస్సు తెలుసుకోవడం ఎంత కష్టమండీ!" అన్నది సౌభాగ్యం.

కనకం ఆడబిడ్డ నవ్వి "ఆడవాళ్ళ విషయం మగవాళ్ళూ అట్లాగే అంటారు. దీనికి అంతేమిటి? ఇంతకూ ఇప్పుడు జరిగిందేమిటి?" అని అడిగింది.

సౌభాగ్యం కాస్త ఆపుకున్న దుఃఖాన్ని మళ్ళీ తెచ్చుకుంటూ "మావారు ఇవాళల్లా వాళ్ళ సరోజినిని గురించే కలవరిస్తున్నారు: నన్ను గురించి ఒక్కసారన్నా కలవరించలేదు. ఇన్నిరోజులూ" అన్నది

కనకమూ, ఆడబిడ్డా బిగ్గరగానవ్వారు.

"సరోజినెవరమ్మా?" అంది కనకం.

"వాళ్ళ మేనమామకూతురు. ఎప్పుడైనా వస్తుంది. వీరంటే చాలా ప్రేమ. ఏమి పరసలాడుతుం దనుకున్నారు. అందుకు నాకేమీ రోషంలేదు మగవాళ్లు మనవాళ్ళైతే పై ఆడవాళ్ళేం చెయ్యగలరు చెప్పండి: మావారి కావిడగారిమీద ఇంత మోజున్న దని నాకిదివరకు తెలియదు: పోనివ్వండి. ఎవరు చేసుకున్నంత వారికి:" దిగులుగా ఊరుకుంది సౌభాగ్యం.

ఆ పిల్ల వెళ్ళిపోయినతరవాత కాస్సేపటివరకూ కనకంగానీ, ఆడబిడగానీ ఈ విషయం ఏమి ఒకరితో ఒక రనుకోలేదు.

కనకం హృదయం కాస్సేపు అసూయతో దహించుకుపోయింది ఈ సరోజిని ఎవతె? ప్రకాశం ఆ పిల్లను సందిలో కూడా కలవరించటానికి ఆమె అతనికి

ఏమి సౌఖ్యం ఇచ్చిఉంటుంది ? తనకు సౌభాగ్యంమీదలేనిఅసూయ సరోజినిమీద ఎందుకుండాలో కనకంనిర్ణయించుకోలేదు.

ఈ అసూయావస్థలో మరొక ఆలోచన వచ్చి కనకం హృదయాన్ని ఒక్క ఊపు ఊపి వదిలింది. ఈ సంధిలో ప్రకాశం ఆ సరోజినినికాక తన పేరే కలవరించి ఉండినటయితే ! ఎంత అల్లరి జరిగి ఉండేదో కనకం ఊహించనైనా లేకపోయింది. ఆమె కడుపు చల్లగా ఆ సరోజిని ఎవరోగాని తన మానం కాపాడింది. ఇంతకూ తన అదృష్టం బాగుంది. ఈసారికి నిజం బయటపడబోవటంలేదు!

కనకం అప్రయత్నంగా ఒక దీర్ఘమైన నిటూర్పు విడిచి, ఆడబిడ్డతో "మనసులో ఉన్న మాట అల్లా, సోదిలో వచ్చినట్టు, కలవరింతలలో బయటపడుతుంది కామాలు !'' అన్నది.

కనకం ఆడబిడ్డ చప్పరించింది.

"ఆఁ. ఆపిల్ల చాదస్తం. నువ్వు రెండుమూడుసార్లు నిద్రలో ప్రకాశం పేరనటం నే విన్నాను ! దాని కేంటి ?"

కనకం వెంటనే కొయ్యబారింది.

ఇంతకూ నిజం దాగనేలే దన్న మాట! కాని తన అదృష్టం బాగానే ఉంది ! కావలిసింది అదీ !







బొమ్మలకే ప్రాణాలొస్తే....



బి.వి. రమణ రావు

మా అత్తమామలు వరుసగా మా తల్లిదండ్రులను ప్రేమించిన సందర్భంలో నా పెళ్ళి స్థిరపడింది. ఆలోచించుకోడానికేనా వ్యవధిలేకుండా ముహూర్తం పెట్టేరు. చూస్తుండగా పెళ్ళయిపోయింది. ఊపిరాడకుండా కాపురం పెట్టించేరు. గుక్క తిప్పుకోకుండా పిల్లలు పుట్టేరు. ఇంక ప్రేమించడానికవకాశ మేదీ! ఈ 'ప్రేమ' అనేది పూర్వజన్మ సుకృతం వల్ల లభ్య మయ్యే ఒక మహాయోగ మని నా నమ్మకం. అసురులకు అమృతం లాగ నాకు ఈ ప్రేమొక తీరని కోరికై పోయింది. పోతే, అనుభవ రీత్యా నే గ్రహించిం దేమిటంటే... పెళ్ళి అనేది మొగాడనే బ్రహ్మ పదార్థాన్ని ఆడదనే జడపదార్థంతో (రిబ్బన్‌తో సహా) సమ్మేళనంచేసే వేదోక్తమైన దురాచారం...అని.

పోనీ సాహసించి ఏదో అవకాశం చూసుకుని ఈ ప్రేమసాగరంలో ఓ మునుగు మునిగి చూద్దామనుకుంటే, మాఆవిడ ధర్మమా అని అది అసాధ్యమైపోయింది. అసలు సంగతేమిటంటే, చిన్నప్పట్నుంచీ మాఆవిడనోరు ఓ 'లవుడ్‌స్పీకర్'లాగ ఉంటూ వొచ్చిందిట. మరి జ్ఞానమొచ్చేక (ఒచ్చిందని ఆవిడనమ్మకం) వాల్యూం ఇంకొంచెం ఎక్కువయిం దిట. పెళ్ళయ్యేక విపరీత మయిం దనుకుంటుంటే, పిల్లలు పుట్టేక మితిమీరిపోయింది. ఇలాంటి మృదు మధుర సాధనంతో, నేను పరస్త్రీని కన్నెత్తి చూడ ననీ, చూసినా పలకరించడ మైనా రా దనీ, తలొంచుకుని మౌనంగా వుంటా ననీ, మా ఆవిణ్ణి అదేపనిగా ప్రేమించేస్తా ననీ, ఇల్లే నాకు స్వర్గ మనీ, పిల్లలంటే నాకు పంచప్రాణా లనీ వూళ్లో వాళ్ళ చెవులు చిల్లులు పడేలాగ మా ఆవిడ ప్రచారం చేస్తుంది. ఇలాంటి పరిస్థితుల్లో పోనీ అని తెగించి ప్రేమిద్దా మనుకుంటే మాత్రం ఏ ఆడది ముందుకొస్తుంది. దానా దీనా ప్రేమంటే కేవలం ప్రబంధ సాహిత్యంగానూ వెండి తెరమీద దృశ్యాలుగానూ నా మనస్సులో ఉండి పోయింది.

* * *

చంద్రం ఆరు నెలల్నుంచి శారదని ఏకధాటిగా ప్రేమించేస్తున్న సందర్భంలో తన ప్రేమ సిద్ధాంతాల్ని విశ్వవ్యాప్తి చేసి మానవలోకంలో నైతిక విప్లవం తీసుకు

రావాలని బద్ధకంకణం ధరించడానికి ప్రబల నిదర్శనంగా "ప్రేమబోధిని" అనే గ్రంథాన్ని రాశాడు. ఈనాడు యుద్ధ ప్రేరేపణ, పరరాజ్యాపహరణ, రాజకీయ వైషమ్యాలు, పదవీ వ్యామోహం, ధనాపేక్ష, జాతికులమత భేదాలు సమసిపోవాలంటే వీటిపై ప్రవహించే మానవుల మనస్సులను ప్రేమమీదకి మళ్ళించాలి. అప్పుడే మానవలోక మంతా ప్రేమమయమై విశ్వశాంతి కరతలామలక మౌతుంది. ప్రజాసామాన్యానికి ప్రేమ సిద్ధాంతాలు సులభగ్రాహ్య మయ్యేలాగ డాక్యుమెంటరీ చిత్రాలు తియ్యాలి. నేటి శారదాబిల్లు, వరకట్న నిషేధచట్టం రద్దు చేసి వాటి స్థానే నిర్బంధ ప్రేమ వివాహ చట్టం అమలుజరపాలి. దీని ముసాయిదా కూడా "ప్రేమబోధిని"లో ఒక అధ్యాయంగా పొందుపరచబడివుంది. ఇలాంటి మహత్తర విషయాలెన్నో ఆ పుస్తకంలో వున్నాయి. ప్రేమబోధిని చదివే అదృష్టం కలిగిన విద్యాశాఖా మంత్రి ఈ పుస్తకాన్ని ప్రీ-యూనివర్సిటీ తరగతిలో పాఠ్యగ్రంథంగా వుంచాలని అభిప్రాయం వెలిబుచ్చినట్టు ఒక అనధికార వార్త.

చంద్రం ధర్మమా అని ప్రేమబోధిని చదివే భాగ్యం నాకూ కలిగింది. పరస్త్రీని ప్రేమించే అవకాశం సాహసం లేనందువల్ల కనీసం భార్యనైనా ప్రేమించి తరించాలన్న సత్సంకల్పంతో, దీనికి కూడా సహకారం కావాలి కాబట్టి, ఆ పుస్తకాన్ని చదువమని మా ఆవిడకిచ్చేను. మోక్షతుల్యమైన ఈ ప్రేమోపాసన మా ఆవిడ ఎంతవరకూ సాధన చేసిందో చూద్దామని, ఇందుమించు మంచుముక్కలాగ సంచలనం లేకుండా మంచంమీద శయనించిన ఆమెను మృదువుగా తట్టిలేపి "చదివేవా?" అని అడిగేను. కాలసర్పం పడగ ఎత్తినట్టు అమాంతంగా మంచంమీద లేచి కూర్చుని "ఆ దిక్కుమాలిన ప్రేమబోధినేనా! ఏడిసినట్టుంది. దానితో అంటిస్తే కుంపటి కూడా అపవిత్రమై పోతుందని పెంట మీదకి గిరవాటెట్టేను" అంది బుస కొడుతూ.

"అది చంద్రం రాశాడే... విద్యాశాఖా మంత్రికూడా..."

"ఎడవలేక పోయాడు. ఎప్పటికప్పుడే చెబుదామనుకుంటున్నాను. ఈసారి ఆ చంద్రంగారు మన గడప తొక్కడా గరిటె కాల్చి వాతెడతానని చెప్పమంది పక్కింటి పేరమ్మగారు."

"ఆవిడ కదేం రోగం!"

"రోగం కాదు. చంద్రంగారి ప్రేమ రోగానికి మందు."

నాకీ ధోరణి అర్థంకాలేదు. ప్రేమబోధినిలో వితంతు ప్రేమ వివాహాలు విలువయిన వనీ, విధిగా విరివిగా వైభవంగా జరగాలని వున్నమాట వాస్తవమే. అయితే పేరమ్మగారు ఏభయ్యేళ్ళు దాటిన

వితంతవు. కేశవిహీనురాలు. నిత్యధవళ వస్త్రధారిణి. ఇంతటి ఘోరమైన విధవలు కూడా ప్రేమార్హు లని చదివినట్టు జ్ఞాపకం లేదు. మరోసారి ప్రేమబోధిని చదువు తేనేగాని ఈ విషయం ఇదమిద్ధ మని తేల్చడం కష్టం. అయినా ముందు సందే హనివృత్తి చేసుకుందా మని మా ఆవిణ్ణి అడిగేను.

"చంద్రం పేరమ్మగార్ని ప్రేమించేడా!"

"అలా చేస్తే ఆయనరోగం అంత ముదరకుండానే ఆవిడ చీపురుకట్టతోటో పేడనీళ్ళతోటో వైద్యం చేసుండేది."

"మ రిం కెందుకు వాత లెట్టడం ?"

"ఆయన శారదని ప్రేమిస్తున్నాట్ట. ఆవిడ కది యిష్టంలేదు."

"ఆవి డిష్ట మేమిటి ! బోడి యిష్టం ! ఆవిడ కిష్టం లేకపోతే వూళ్ళోవాళ్ళెవళ్లూ ప్రేమించుకోకూడదా !"

"ఎందు కూడదూ : కావలిస్తే ఆయన వూళ్ళోవాళ్ళందరినీ తీరుబడిగా ప్రేమించుకోమనండి ... ఆ అమ్మాయిని తప్ప "

"వాళ్ళిద్దరూ ఇష్టపడి ప్రేమించు కుంటుంటే..."

"ఎంత అప్రతిష్ట! నెమ్మదిగా మాట్టా డండి. ఈ మాట ఆవిడ చెవిని పడిం దంటే ముందు మీకు మర్యాద చెయ్య కలదు అయినా ఆ చంద్రంగారి కదేం పొయ్యేకాలమండీ ! ఆ అమ్మాయిమీద ప్రేమగీతాలు రాసి పత్రికల్లో వేయించ డమూ, ఆ పత్రిక లన్నీ ఆ అమ్మాయికి పంపిస్తూ దస్తా కాగితాలకి తక్కువ కాకుండా ప్రేమలేఖలు రాస్తాట్ట !

"ప్రేమంటే అదేనే! నువ్వు నాలుగో అధ్యాయంలో ప్రేమలేఖల నమూనాలు చదవలేదూ !"

"మీ కేమయినా మతి పోయిందా ! పెళ్ళికాని పిల్లకి మర్యాదస్తు డెవడైనా వుత్తరాలు రాస్తాడా !"

"పెళ్ళయిన పిల్లకి రాయమంటావా! ప్రేమించేడు కనకనే శారదకి వుత్తరాలు రాశాడు. రేపొద్దున్న ఆ అమ్మాయిని పెళ్ళాడ్డానికి కూడా సిద్ధంగా వున్నాడు."

"ఔవ్వ ! ఔవ్వ! శారదకి పెళ్ళి స్థిర పడితే, ఆయన పెళ్ళాడట మేమిటండీ!"

"ఎవ రా పెళ్ళికొడుకు ?"

"పేరమ్మగారి తమ్ముడు. మూర్తి గారు."

"ఏమిటీ ! రెండో పెళ్ళివాడా :"

"అయితే మాత్రం ఏమి టండీ. ఆయనకి ముప్ఫయి రెండేళ్ళే గా వున్నాయి. ఏడాదయి భార్యపోయింది. మూడేళ్ళ చంటికుర్రాణ్ణెట్టుకుని, పెళ్ళీ పెడాకులూ లేకుండా ఎన్నాళ్ళుంటాడు!"

"శారద ఒప్పుగుందా :"

"ఎందు కొప్పుగోదూ. నిక్షేపంలా ఒప్పుకుంది. వాళ్ళవాళ్ళు బీదవాళ్ళు, ఇదా కట్నం కానుకలూ లేని సంబంధం. అరిమురికలేని సంబంధం. మూర్తిగారి భార్యకీ తనకూ వున్న స్నేహ మయితే

నేం, వాళ్ళ కుర్రాడంటే వున్న అభిమాన మయితే నేం, మూర్తిగారంటే వున్న భక్తి గౌరవాలయితే నేం, పేరమ్మగారు పెళ్ళిమాటెత్తగానే తక్షణం ఒప్పుగుంది. ఆ అమ్మాయే తనంతకి తను "మీకూ మూర్తిగారికీ అభ్యంతరం లేకపోతే ఈ సంసారాన్ని నేను చక్క దిద్దుకుంటాను" అనగానే, పేరమ్మగారూ నేనూ కూడా నిర్ఘాంతపోయాం. మూర్తిగారు శారదని పిలిచి వెర్రివెర్రి ఆవేశాల్లో పడి బతుకు నాశనం చేసుకోవద్దని మందలించేరుట. తను చాలా ఆలోచించే ఈ నిర్ణయాని కొచ్చేనని చెప్పి ఆయన్ని ఒప్పించిందిట."

"అయితే పెళ్ళి స్థిరపడినట్టేనా?"

"వచ్చే శనివారం కాక ఆపై శనివారం రాత్రి నరసింహస్వామి ఆలయంలో పెళ్ళి. శుభలేఖ కూడా యివ్వాళే యిచ్చేరు."

"నీకు సంతోషంగా వుందా?"

"ఏమిటో మొదట్నుంచీ శుభలేఖ చూసి సంతోషించాలనే సాంప్రదాయానికి చెందినదాన్ని; పదేళ్ళ పట్టి మీతో కాపరం చేస్తున్నా. శుభలేఖ చూసి కంట తడిపెట్టడం అలవాటవ్వలేదు"

"అదికాదే ... మూర్తిగారేమంత అందంగా వుంటాడు చెప్పు."

"మొగాడి కల్లా ముఖ్యం అందంటండీ! ... మొగుడుకి కాస్త అందం తక్కువయితే వచ్చిన నష్టమేమిటీ!... మన కాపరాని కేం లోటొచ్చింది!"

"నో రూమ్."

ఇంకా ఎన్ని సినీమాలు చూస్తే యీ సంఘానికి బుద్ధొస్తుందో కాని, నిత్య జీవితంలో మాత్రం ఎక్కడ చూసినా విలన్‌లాంటి మొగాళ్ళు హీరోయిన్‌లాంటి చక్కని చుక్కల్ని ఎగరేసుకుపోయి పెళ్ళాడటం కనబడుతుంది కాని హీరో ల్లాంటివాళ్ళ కెక్కడా ఛాన్సు కనబడదు. నిజంగా ఇదే సినిమాలో అయితే చంద్రానికి శారదకి ప్రేక్షకులందరూ ఆశీర్వదిస్తూండగా కన్నుల పండువుగా పెళ్ళయ్యేది.

* * *

రాత్రల్లా శారదని గురించి ఆలోచించానేమో, పొద్దున్నే లేవగానే అరిచేతిలో శ్రీకారం చుట్టుకోబోయి పరధ్యాన్నంగా శ్రాకారం చుట్టుకున్నాను. ఈ అనర్ధక్షరా రాక్షస మేమిటా అని శంకిస్తూనే లేచాను. తగటుగానే కాఫీ గొంతుకు దిగకుండా మా ఆవిడొచ్చి "మీ కోసం యమభటు లొచ్చేరు" అంది. ఎవరా అని బయిట కొచ్చిచూస్తే విశ్వం, పద్మనాభం.

వీళ్ళిద్దరూ చంద్రం ప్రేమ రథానికి చెరో చక్రంలాంటి వాళ్ళు. ప్రేమంటే చెవి కోసుకుంటారు. అవకాశం లేక అడుగున పడిపోయిన ప్రేమోపాసకులు. వీళ్ళు ముగ్గురూ ఒకే గదిలో వుంటూ నాలుగేళ్ళనుంచీ పట్టుదలగా బి. ఏ.

వితంతవు. కేశవిహీనురాలు. నిత్యధవళ వస్త్రధారిణి. ఇంతటి ఘోరమైన విధవలు కూడా ప్రేమార్హు లని చదివినట్టు జ్ఞాపకం లేదు. మరోసారి ప్రేమబోధిని చదువు తేనేగాని ఈ విషయం ఇదమిద్ధ మని తేల్చడం కష్టం. అయినా ముందు సందే హనివృత్తి చేసుకుందా మని మా ఆవిణ్ణి అడిగేను.

"చంద్రం పేరమ్మగార్ని ప్రేమించేడా!"

"అలా చేస్తే ఆయనరోగం అంత ముదరకుండానే ఆవిడ చీపురుకట్టతోటో పేడనీళ్ళతోటో వైద్యం చేసుండేది."

"మ రిం కెందుకు వాత లెట్టడం ?"

"ఆయన శారదని ప్రేమిస్తున్నాట్ట. ఆవిడ కది యిష్టంలేదు."

"ఆవి డిష్ట మేమిటి ! బోడి యిష్టం ! ఆవిడ కిష్టం లేకపోతే వూళ్ళోవా ళ్లెవళ్లూ ప్రేమించుకోకూడదా !"

"ఎందు కూడ్డదూ ! కా వ లి స్తే ఆయన వూళ్ళోవాళ్ళందరినీ తీరుబడిగా ప్రేమించుకోమనండి ... ఆ అమ్మాయిని తప్ప "

"వాళ్ళిద్దరూ ఇష్టపడి ప్రేమించు కుంటుంటే..."

"ఎంత అప్రతిష్ఠ! నెమ్మదిగా మాట్లా డండి. ఈ మాట ఆవిడ చెవిని పడిం దంటే ముందు మీకు మర్యాద చెయ్య కలదు అయినా ఆ చంద్రంగారి కదేం పొయ్యేకాలమండీ ! ఆ అమ్మాయిమీద ప్రేమగీతాలు రాసి పత్రికల్లో వేయించ డమూ, ఆ పత్రిక లన్నీ ఆ అమ్మాయికి పంపిస్తూ దస్తా కాగితాలకి తక్కువ కాకుండా ప్రేమలేఖలు రాస్తాట్ట !

"ప్రేమంటే అదేనే! నువ్వు నాలుగో అధ్యాయంలో ప్రేమలేఖల నమూనాలు చదవలేదూ !"

"మీ కేమయినా మతి పోయిందా ! పెళ్ళికాని పిల్లకి మర్యాదస్తు దెవడైనా వుత్తరాలు రాస్తాడా !"

"పెళ్ళయిన పిల్లకి రాయమంటావా! ప్రేమించేడు కనకనే శారదకి వుత్తరాలు రాశాడు. రేపొద్దున్న ఆ అమ్మాయిని పెళ్ళాడ్డానికి కూడా సిద్ధంగా వున్నాడు."

"ఔవ్వ ! ఔవ్వ! శారదకి పెళ్ళి స్థిర పడితే, ఆయన పెళ్ళాడట మేమిటండీ!"

"ఎవ రా పెళ్ళికొడుకు ?"

"పేరమ్మగారి తమ్ముడు. మూర్తి గారు."

"ఏమిటీ ! రెండో పెళ్ళివాడా !"

"అయితే మా త్రం ఏమి టండీ. ఆయనకి ముప్పయి రెం డే ళ్ళే గా వున్నాయి. ఏడాదయి భార్యపోయింది. మూడేళ్ళ చంటికుర్రాణ్ణెట్టుకుని, పెళ్ళీ పెడాకులూ లేకుండా ఎన్నాళ్ళుంటాడు!"

"శారద ఒప్పుగుందా !"

"ఎందు కొప్పుగోదూ. నిక్షేపంలా ఒప్పుకుంది. వాళ్ళవాళ్ళా బీదవాళ్ళు, ఇదా కట్నం కానుకలూ లేని సంబంధం. అరమరికలేని సంబంధం. మూర్తిగారి భార్యకీ తనకూ వున్న స్నేహ మయితే

చదువుతున్నారు. తీరుబడయినప్పు డల్లా పత్రికల్లోంచి నూతన దంపతుల ఫోటోలు సేకరించి భార్యల బొమ్మలూ, భర్తల బొమ్మలూ విడి విడిగా కత్తిరించి అంద చందాల ననుసరించి నూతన జంటలను సమకూర్చి సమాజం మీద పగ సాధించే యోధులు.

"త్వరగా బట్ట లేసుకో" అన్నాడు విశ్వం.

"ఎక్కడికి" అడిగేను.

"యమలోకం."

"ఇంత పొద్దున్నే క్లబ్బు కెందుకురా!"

"ఎనిమిది గంటలకి రహస్యంగా సానుభూతి తీర్మానం; ఎనిమిది న్నరకి బహిరంగంగా అల్పాహార విందు."

"ఏమిటి విశేషం !"

"నిన్న చంద్రం ఆత్మహత్య చేసు కున్నాడు కదా."

"ఆఁ ! చంద్రం చచ్చిపోయేడా !"

"చస్తే అశ్రుతర్పణం చేసి వూరు కుందుం. బతికున్నాడు కనకనే ఈ సమా వేశం."

"మరి ఈ ఆత్మహత్య గొడవేమిటి!"

"చంద్రం తన ఆత్మని హత్య చేసు కుని, నిన్నట్నుంచీ కేవలం భౌతిక శరీరంతో జీవిస్తున్నాడు."

"అస లేం జరిగిందిరా !"

"తన పెళ్ళి శుభలేఖ పంపుతూ శారద చంద్రానికి వుత్తరం రాసింది..."

"ఏం రాసింది ?"

పద్మనాభం జేబులోంచి వుత్తరం తీసి 'అతిరహస్యం' అని హెచ్చరించి చదవడం మొదలెట్టేడు.

శ్రీ చంద్రశేఖరరావుగార్కి,

గత ఆరు నెలల్లోనూ విసుగూ విరామం లేకుండా నాకు పంపుతూ వచ్చిన ప్రబంధాలు లాంటి వుత్తరాలూ, మీ భావ (విరహ) గీతాలు ప్రచురితమైన ప్రతికలూ, ఈ మధ్యనే పంపిన ప్రేమ బోధిని చదివి అపరిమిత వినోదభరితురా ల్నయ్యేను.

నన్ను మీరు విపరీతంగా ప్రేమించే స్తున్నట్టూ పెళ్ళాదేసెయ్యడానికి కూడా సిద్ధంగా వున్నట్టూ గ్రహించి మీ త్యాగ శీలతకు మనస్సులోనే జోహా ర్లర్పించు కున్నాను. ప్రణయ సరోవరంలో కవితా నౌక నెక్కి విరహగీతాలు గానంచేస్తూ స్వైరవిహారం చేసే మిమ్మల్ని ప్రేమించ టానికి కావల్సిన అనుభవం, ధైర్యసాహ సాలూ నాకు లేవు. అదీకాక, నేనుకూడా ప్రయత్నించి మిమ్మల్ని ప్రేమిస్తే ఆ ప్రేమ ఫలించి ఈనాడు మీరు చేస్తున్న అపార ప్రేమసాహిత్య కృషికి అంత రాయం కలుగుతుంది. అలాంటి సాహిత్య హత్య నేను చెయ్యలేను.

నా కాబోయే భర్త మీ అంతటి ప్రేమ పండితులు కాకపోయినా గౌరవమర్యా దలూ ఆత్మాభిమానం వున్న విద్యా వంతులు. మా వివాహాని కొచ్చి

నన్నాశీర్వదించమని కోరుతూ, ఇందుతో శుభలేఖ పంపుతున్నాను.

"శారద"

"ఇది చదివి ఏమంటాడు చంద్రం'' పద్మనాభా న్నడిగేను.

"ఏమి టనీది ! నేను వద్దంటున్నా వినకుండా, తిన్నగా మేడమీద పై డాబా గోడెక్కి కిందకి దూకేసి ఆత్మహత్య చేసుకోబోయి కళ్లు తిరిగి డాబామీద పడ్డాడు. కాలు బెణికింది. వాడి పరిస్థితి చూసి వాడి మేనమామకి 'ట్రంక్ కాల్' చేశాను. బెల్లిగ్రాంలాగ ఊడిపడ్డాడు."

"మరి యివ్వాళ పొద్దున్నే యీ పార్టీ ఏమిటి ?"

"వాడి మేనమామ యిస్తున్నాడు."

"ఎందుకురా !"

"చంద్రం ఆయనకూతుర్ని పెళ్లాడతా నన్నాట్ట.''

"చంద్రానికి మేనరికం వుందని ఎప్పుడూ చెప్పలేదే !"

"ఈ శారద ప్రేమదురద బురదలో పడి ఈ జన్మలో మేనరికం చేసుకో నని శపథం పట్టేట."

"మ రిప్పు డెలా చేసుకుంటాడు.''

"నిన్నటి గండంతో వాడిది పునర్జన్మ కనక ఆ పట్టింపు లేదని వాళ్ళ మేనమామే నచ్చచెప్పేడుట.''

"ఆ అమ్మాయికి వీడంటేయిష్టమేనా ?"

" 'అత్తా' 'అమ్మా' అన్నమాటలు రానిక్రితమే 'బావా బావా' అనడంతో మాటలు నేర్చుకుందిట. చిన్నప్పట్నుంచీ వీణ్ణే పెళ్లాడతా నని ప్రతిజ్ఞ చేసిందిట. పైగా వీడు రాసిన ప్రేమబోధిని చదివి నప్పట్నుంచీ వీణ్ణి తప్ప యింకెవర్నీ పెళ్లాడ నని ఇంట్లో ఘోర తపస్సు చేస్తోందిట."

"మరి చంద్రాని కదేం పొయ్యే కాలంరా !''

"అసలు ఆ అమ్మాయి తపోబలం వల్లనే శారదకి పెళ్ళి నిశ్చయమై పోవడం, వీడికి పునర్జన్మ ప్రాప్తి జరిగే యని వాడి మేనమామ వాదం. ఆ అమ్మా యిని పెళ్లాడకపోతే యిలాంటి గండ పరంపరలు తప్పవని బెదిరించేడుట.''

"మరి చంద్రం ఏమన్నాడూ.''

''ఆఁ...ఏమంటాడు : వాడి ఆత్మ నిన్ననే చచ్చిపోయింది కనక పెళ్లాడి ప్రాణం ఈ అమ్మాయి కప్పజెప్పి తను నిర్జీవ భౌతిక శరీరంతో బతుకుతాట్ట.''

"వాళ్ళ మేనమామ, ఇది విని ఊరు కున్నాడా ?''

"ఆమాత్రం దారిలోకొస్తే చాలు. మిగతా విషయా లన్నీ వాళ్ళమ్మాయి పాతి వ్రత్యంతో అవే సద్దుకుంటాయి పొమ్మ న్నాట్ట."

"దీనికే గాని మరో ముఖ్యమైన పని మీద నీ దగ్గిర కొచ్చాం. నువ్వో ఉప కారం చెయ్యాలి. దానికి నువ్వే

సమర్థుడివి'' అంటూ రంగంలోకి దిగేడు విశ్వం.

"ఏమిట్రోయ్'' అంటూ అభయహస్త మిచ్చేను.

"ప్రేమబోధిని అచ్చు వేయించటానికి మేమిద్దరం చెరో ఐదువందలూ పెట్టుబడి పెట్టేం. అవి దీపావళిలో టపాకాయల్లాగ ఇట్టే అమ్ముడయిపోతే అట్టే మా డబ్బు లాభంతోసహా యిచ్చేస్తానన్నాడు చంద్రం. ప్రస్తుతం వాటి అమ్మకం పరిస్థితి చూస్తే భారతదేశాన్నుంచి రష్యాకి ఎగుమతయిన చెప్పుల జతల్లాగ తిరిగి వచ్చేస్తున్నాయి.''

"అదేం!''

"సిటీ బుక్‌హౌస్‌వాడి కిచ్చిన వెయ్యి కాపీలకీ, ఈ నెల్లాళ్ళలో నూరెండు కాపీలు బ్రహ్మాండంమీద అమ్మేడట. కొన్న ఆ యిద్దరూకూడా మర్నాడే తిరిగొచ్చి వొంటిమీద దెబ్బలూ, వాతలూ చూపెట్టి కాళ్ళా వేళ్ళా పడి సగంరేటుకి తిరిగి అమ్మేసి పోయారుట'' అంటూ కంటతడి పెట్టేడు విశ్వం. వాడి మాటలు వింటుంటే మా ఆవిడ ఎంతటి మహా పతివ్రతో అర్థ మయ్యింది.

"సరే నన్నేం చెయ్యమంటారో చెప్పండి" అన్నాను ధీమాగా.

"ఏమీ అక్కర్లేదు. ఉత్త మాట సహాయము. చంద్రం మేనమామ కానీకట్నం యివ్వడుట. తన కొడుకుల పెళ్ళిళ్ళకి కట్నం పుచ్చుకున్న మహా పాపానికి పశ్చాత్తాపపడి కూతురు పెళ్ళికైనా నీతికి కట్టుబడివుండాలని కట్నాన్ని నిషేధించాడుట. కాని బాగా డబ్బున్నవాడుట. ఇవ్వాళ మంచి హుషారుగా యీ పార్టీ యిస్తున్నాడు. అంచేత పార్టీ అయిన తర్వాత ఆయన మూడ్ కనిపెట్టి, ఈ పెట్టుబడి డబ్బులు రాబట్టే ఏర్పాటు చెయ్యి. కావలిస్తే సకలహక్కు భుక్తాలతోటీ జన్మ జన్మాలకీ కావల్సిన కాపీ రైట్‌తోసహా ప్రేమబోధిని కాపీ లన్నీ ఆయన కిచ్చేస్తామని చెప్పు."

"అసలు మనిషెలాంటివాడు?"

"నవనీతంలాంటి మనిషనుకో"

* * *

సినీమాలో ఆఖరి రీల్‌లో మజ్నూలాగ వెర్రిమొహం వేసుకుని దెయ్యం రూపంలో ప్రత్యక్షమయిన చంద్రంజీవచ్ఛవం తాలూకు బుజంమీద చెయ్యివేసి "కంగ్రాచ్యులేషన్స్" అన్నాను. క్షణం బాహ్య ప్రపంచంలోకి అడుగెట్టి "థాంక్స్" అని వాడి మేనమామ ఇటు రావడం చూసి మళ్ళీ జీవసమాధిలోకి పోయాడు. విశ్వం, పద్మనాభం నన్ను కోరస్‌లో స్తుతిస్తూ ఆయనకి పరిచయం చేసేరు. వాళ్ళవూళ్ళో ఆయన హెడ్ మాస్టరుట. ఆకారం చూస్తే రావణాసురుడు, కంసుడు, దుర్యోధనుడు, శిశుపాలుడు మొదలయిన పురాణపురుషులు జ్ఞాపక మొస్తున్నారు.

అందరూ ఎవరి వినోదాల్లో వాళ్ళు వున్నారు. చంద్రం అక్కడలేడు. అదే సమయమనుకుని వాడి మేనమామతో కబుర్లు చెప్పడానికుపక్రమించేను. బయట నుంచి విశ్వం పద్మనాభం చెవులు రిక్కబొడుచుకుని కిటికీ వెనకాల పొంచి వింటున్నట్టు వాళ్ళ నీడలు కనబడుతున్నాయి.

"ప్రేమబోధిని చంద్రం చాలా కష్టపడి రాశాడు" అన్నాను.

"అవునుట!"

"విశ్వం పద్మనాభం అ పుస్తకం అచ్చు వేయించడానికి చాలా శ్రమ పడ్డారు."

"విన్నాను."

"మీ రా పుస్తకం చదివేరా?"

"లేదు. మా అమ్మాయి చదివింది. దానితోటే నాకూ మా అమ్మాయికీ జ్ఞానోదయం అయ్యింది."

"ఆవిడకి కూడా ఈ ప్రేమసిద్ధాంతంలో నమ్మక ముందన్నమాట."

"చూడండి,వశిష్ఠమహర్షి 'నారాయణ, నమశ్శివాయ' అనే పదాల్లోని జీవాక్షరాలతో 'రామ' అని శ్రీరాములవారికి పేరు పెట్టేట. 'ప్రేమ' అనే పదం 'ప్రేలాపన' 'సోమరి' అనే పదాల తాలూకు జీవాక్షరాలతో ఉద్భవించిం దని నా నమ్మకం. ఈ ప్రేమగాథల్లో నాయకులున్నారు చూశారూ... ఏదీ... ఈ రోమియో, సలీమ్, మజ్ను, దేవదాసు మొదలయిన వాళ్ళు... వీళ్ళల్లో ఏఒక్కడికీ ఒక్క పావలా డబ్బులు సొంతంగా సంపాదించే యోగ్యత లేదు. అమ్మా బాబూ తాలూకు రాజ్యాలూ ఆస్తులూ వుండబట్టి పనీపాటూ లేక ఈప్రేమే ఓ పెద్దపనిగా పెట్టుకుని జీవితాలు తగలబెట్టుకున్నారు. అలాంటి చవటే ఈ చంద్రం కూడాను. చదువూ సంస్కారం సంఘంలో ఓ స్థానం వుంటే బుద్ధి యింత వెర్రితల లెయ్యదు. వీడు రాసిన ప్రేమబోధిని చదివి వీడు కేవలం మూర్ఖుడు కాదనీ ఈ ప్రేమదెయ్యం పట్టడం వల్ల బుద్ధి వక్రించిం దనీ మా అమ్మాయి గ్రహించి, ఎంతయినా మేనమామ కొడుకుకదా అని జాలిపడి 'బావ ఏదో దుష్ట సహవాసాలవల్ల పాడయిపోయి వుంటాడు. ఇంటికి తీసుకురా. పెళ్లాడి బాగుచేస్తాను' అంది. మా అమ్మాయి అనుమానించినట్టుగానే కరటక దమనకుల్లాంటి స్నేహితులూ..."

"ఇప్పుడే వస్తానండి"అంటూ బయట పడి విశ్వం, పద్మనాభం తాలూకు నీడలు అంతర్ధానమైన దిక్కే కాళ్ళు మళ్ళించేను.




ఆకాశపు కాసారంలో సూర్యుడు ఒక కెందామర
బ్రతుకుల పూలధూళి రేగిన పుడమి ఒక కెందామర
నాడుల నాళాలు శైవాలాలు అలమిన
శరీరసరసిలోన హృదయం ఒక కెందామర
మందేహాల మోహాల తంద్రాతమస్వినిలో
మేలుకొనిన సందేహం కెందామర
మస్తిష్కపు శుష్కించని బలివేదిక కెందామర
అక్షరాల సిరామరకల సరోవరపు శిరసుమీద
పూచిన కవిత కెందామర
కరువుచెరువులో ఆకలి కెందానుర
బాధల అగాధంలోంచి, నిరాశల నిశీథపంకంలోంచి
అంకురించిన రుధిరాంకం, క్రాంతి ఒక కెందామర
క్రీస్తు కాళుల కేళుల వ్రణాలు కెందామరలు
సుగతుని నొచ్చిన చరణాలు కెందామరలు
చీకటి కోటకొమ్మను వ్రేలిన వీరుల శిరసులు కెందామరలు
దిగంతాల అనంతశూన్యంలో,
పరమాణువుల, రేణువుల పదార్థపంకంలో
తరగని చెరగని ఆ అదృశ్య ఆదిశక్తి కెందామర.

నీనీలకేశాల కాసారంలో నీ వదనం కెందామర
నిశ్చలనీరం వంటి నిర్మలవదనంలో కన్నులు కెందామరలు
కన్నీరుల సరస్సులో పూచిన ప్రేమ కెందామర.

# సినిమా క్విజ్




పై 2 బొమ్మలూ 2 సినిమా పేర్లు తెలియజేస్తవి ... ఏమిటవి? (జవాబులు 88 ఏ పేజీలో)



మామూలు చోటే, మామూలు సభ్యులే — చెంచయ్యా, వెంకట్రావూ, శాస్త్రీ వగైరాలు—కాఫీహోటల్లో ఎవరి బిల్లువాళ్ళం చెల్లించాము అంచేతనేమో ఒకరికొకరు తీసిపోవటంలేదు: చర్చ — సత్యా అహింసలమీద ప్రారంభమై, నీతి అవినీతి దాటి, ఆస్తికతా నాస్తికతాలోకి దిగింది. చెంచయ్య దేవుణ్ణీ దెయ్యాన్నీ — దేన్నీ ఒప్పుకోటంలేదు. కళ్ళకి చూపించమంటున్నాడు!

వెంకట్రావు వేదాంతి. మాలాంటి నాస్తికుల్ని చూసి జాలిపడటమే కాదు; క్షమించమని భగవంతుణ్ణి కళ్ళు మూసుకు ప్రార్థిస్తాడు కూడా. ఎప్పటికైనా మన దేశం పాశ్చాత్యదేశాలకి ముక్తి కలిగిస్తుం దని ఆయన నమ్మకం. మన దేశం భౌతికంగా స్వాతంత్ర్యం కోల్పోయినా, ఆధ్యాత్మికంగా యింకా చెడిపోలే దని ఆయన వాదన. గాంధిగారిని ఉదహరించి తప్ప మాట్లాడడు. అదేం ఖర్మమో గాంధిగారు చెప్పితే బాగావుండే మాటలు ఈయన నోట పడి, పనికిమాలినవై పోతున్నై — ఇదే కాబోలు క్షేత్ర మహాత్యం!

శాస్త్రిగారొక అతి వాస్తవిక రచన: తనకు తప్ప ఎవ్వరికీ అర్థం కాడు. ఎంతోమంది సాహిత్య పహిల్వానులు ఆయనచేత 'చిత్' అయిపోయారు. మూగవాడిచేత మాట్లాడిస్తాడు. ఆయనకి వొక సిద్ధాంత మంటూ లేదు!

మేము యిద్దరమైపోయాము. వెంక

చక్రపాణి

్రావు తగ్గిపోతున్నాడు. అంచేత శాస్త్రి గారు అటు కలిసి, బాలన్సు చేశారు :

"మీ రెన్నయినా చెప్పండి. తృప్తి అనేది మన వేదాంతానికి మూలసూత్రం. అది ఉండబట్టే మనం ఎన్ని తుపాన్లు వచ్చినా లెఖ్ఖ చెయ్యకుండా తుంగపొచలాగా తల ఎత్తుకుని ఉన్నాం. ప్రపంచకంలో ఎన్ని సామ్రాజ్యాలు నాశనం కాలేదు ? ఎన్ని జాతులు పేరులేకుండా పోలేదు ? ఈనాడు మన ఇంకా నిలిచిఉన్నా మంటే, మనకు ఉగ్గుబాలతో సంక్రమించిన సంస్కారం మూలానే! పాశ్చాత్యులకి తృప్తిలేదు. అందుచేతనే అలా కొట్టుకు చస్తున్నారు. మన కున్న సంస్కారంలో నూరోవంతున్నా వాళ్ళు ఆయుధాలు పార వేసి, బైబిలు చేతపట్టుకు కూర్చునేవాళ్లు."

"అలాగా :" అని సాగదీశాడు చెంచయ్య.

"కాక ! _ ఈ యుద్ధం కాగానే నానా జాతిసమితి ఉండదు. దానికి బదులు హిందూదేశంనించి మా వోటి వాళ్ళం కొంతమంది మె పోయి, ప్రతిదేశంలోనూ హిందూ వేదాంతాన్ని బోధిస్తాము — ఇదే ఆఖరియుద్ధం ! ఇక యుద్ధాలు ఉండవు — ఏమంటారు. వెంకట్రావుగారూ ?" అన్నారు శాస్త్రిగారు.

"దీనికి నేను వొప్పుకోను !" అన్నాడు చెంచయ్య.

"ఎందుకని ?"

"మన కున్న ఒక్క_సంపదా, రేడర్ ఆయుధం పాశ్చాత్యుల కిచ్చివేస్తే, మన మేమైపోతాము ?" అన్నాడు చెంచయ్య.

"శాస్త్రిగారూ ! ఎంతో కాలంనించి పెద్దలు దీన్ని ఎవ్వరికీ యివ్వకుండా కాపాడుకుంటూ వస్తున్నారు. ఈనాడు మీరు ఆ కాస్తా కిరస్తానీవాళ్ళ కిస్తే, మన గతేమిటి ?" అన్నాను నేను.

"అలాగా : ఐతే మీ కానందం వద్దన్నమాట !" అన్నారు శాస్త్రిగారు.

"ఎందు కొద్దు ? తప్పకుండాకావాలి" అన్నాము ఇద్దరం.

"ఐతే త్యాగంలేంది ఆనందం లభించదు."

"అఖ్ఖర్లేదు ! మేము ఏ సంకూ డా త్యాగం చెయ్యకుండా ఆనందం పొందుతున్నాము "

"అదే మీ పొరపాటు : మీరు ఇంత సేపుమాట్లాడితిరే. మీవిజ్ఞానాన్ని వృథాగా పంచిపెట్టితిరే, ఏం లాభం చూసుకుని ? ఏమీలేదు. అందుకనే అది త్యాగంకిందికి వస్తుంది. మేముయింత సేపూ మీ మాటలు విని మీకు బదులుగా ఆనందాన్ని యిచ్చాము ఇంకా అప్పుడప్పుడూ ఎదురు చెప్పాము కాని, లేకపోతే మేము మీ కిచ్చిన ఆనందాన్ని మీరు బ్రహ్మానందం లోకి మార్చుకునేవారు."

శాస్త్రిగారు ఎన్ని ధర్మాలు మాట్లాడినా, ఆయన చేసింది ధర్మయుద్ధంకాదు. ఐనా, ఆయన ప్రయోగించిన బ్రహ్మాస్త్రం

వృధాపోలేదు. మా తలలు తుంచలేక పోయినా వంచింది.

ఇంతలో మా పాలిటి దేవుడి లా ప్రకాశరావు వచ్చి అడ్డుపడ్డాడు.

"మీరు విన్నారా ? — శేషమ్మ కూతురికి పోతురాజు పూనాడు !" అన్నాడు.

"ఏ పోతురాజు ?" అన్నాను నేను, ఏదో ఒకటి మాట్లాడా లని.

"పోతురాజు కాదు పున్నయ్య కొడుకు !" — అన్నాడు వెంచయ్య.

"ఏమి టేమిటీ ? మళ్లీ చెప్పు" అన్నాడు శాస్త్రి.

ప్రకాశరావుని సరిగ్గా చెప్పనివ్వలేదు మేము. మధ్యనే ఎవరిపాట వాళ్ళు పాడే వాళ్ళం. ఒకరి కొకరికి శ్రుతిలేదు.

అరగంట వాగినతరవాత ఒక అభిప్రాయాని కొచ్చారు అంతా. వెళ్ళి చూసిరావాలని నిర్ణయించారు. నేను అర్జంటు పని ఉందని వంక పెట్టి పోలేదు.

* * *

సాయంత్రం వెంచయ్య కనిపించాడు. అతనిధోరణి చూస్తే పోతురాజు యితన్నే ఆవేశించినట్టుగా ఉంది.

"నాన్‌సెన్స్ ! అంతా దగా ! పోతురాజొచ్చి తనకు గుడి కట్టించ మని దాని దగ్గర ఏడుస్తాడా ?"

"ఇక్కడ పోతురాజు లేడుగాఅసలు" అన్నాను నేను.

"ఎందుకు లేడూ ? మనం పాలెం పోయే దోవలో లేదూ రాయి, అదే పోతురాజట. అతనే దాన్ని పట్టి అలా పలికిస్తున్నాడట !"

నాకు ఆశ్చర్య మేసింది. నా చిన్నతనం నించీ ఆ రాతిని నేను చూస్తూ ఉండేవాణ్ణి. దాని కింతవర కెవ్వరూ పేరు పెట్టలేదు. గొడ్లు తోలుకుపోయి పిల్లలు దానిమీద కూర్చుంటూ ఉండేవాళ్ళు. నేనెక్కాలా నంటే నేనని చాలమంది దానికోసం కొట్టుకున్నారుకూడా. గొడ్లూ, పందులూ కూడా దాన్ని రాచుకుంటూ ఉండేవి — దురదగా ఉన్నా, బురదగా ఉన్నా ! ఈనాటి పోతురాజా అది ! గుడా దానికి ! !

"ఏం చేస్తాం ? మూఢ ప్రజలు. వాళ్ళ అజ్ఞానానికి చింతించాల్సిందే !" అన్నాను.

"ఎవరి అజ్ఞానానికి ? వెంకట్రావుని వేసుకుని శాస్త్రిగారు కూడా అక్కడే కూర్చున్నారు. ఇక ప్రకాశరావు —"

"శాస్త్రిగారికి నమ్మకముందంటావా?"

"ఏమో ! అటువంటివాళ్ళతోడుంటే వెంకట్రావుల బలం జాస్తికాదా ?" కాదని ఎలా అనగలను ? అందుకనే వెంచయ్యను చల్లబర్చటానికి అన్నాను:

"నువ్వేనన్నన్నా చెప్పు వెంచయ్యా ! మనలాంటివాళ్లు ఏదో కొద్దిమంది తప్ప, ఎవ్వరూ వెనకటి నమ్మకాలు వదలుకోలేరు. ఉగ్గుబాలతో జీర్ణించినవాళ్ళ మూఢనమ్మకాలు ఇవ్వాళ పోతయ్యా ! వాళ్ళు మనతో కలిసిరావటంలేదని దిగులు పట్టంకంటె గర్వపట్టంమంచిదేమో?"

చెంచయ్యకు ఈ మాటలు బాగా నచ్చినై. తర్వాత ఇద్దరం కలిసి, వాళ్ళ అజ్ఞానాన్ని విమర్శించి తృప్తిపడ్డాము. ఎంత తృప్తి అంటే, పొరుగు వాడు దివాళా ఎత్తినా మాకంత ఆనందముండేది కాదు.

* * *

మమ్మల్ని, మా విమర్శల్ని ఏమి లెఖ్ఖచెయ్యకుండా భక్తులు గుడి కట్టించేశారు. పూజారిస్థానం శేషమ్మ సంపాదించుకుంది. ఆ గుడి మొదలు పెట్టిన వేళావిశేషమో, లేక శేషమ్మ పూర్వ పుణ్యమో (ఈ జన్మలో శేషమ్మ ఏ పుణ్యమూ చెయ్యలేదు, మాకు తెలిసినంతవరకు) పోతురాజు బాగా పాపులర్ అయాడు. దూర దూరాల్నించీ జనం వస్తున్నారు. పాతమొక్కు లుంటే చెల్లించటానికీ కొత్తగా మొక్కుకోటానికీ. ఊళ్ళోవాళ్ళకే కాదు నాకుకూడా చుట్టాల తాకిడి ఎక్కువైంది. వాళ్ళదగ్గిర పోతురాజుని విమర్శించటానికి కూడా వీలులేకుండా ఉంది — తిండి పెయ్యలేక తిడ్తున్నాడని అనుకుని పోతారేమోనని!

పోతురాజుప్రభ నానాటికి వెలిగిపోతున్నది. అనుకోని విధంగా వెంకట్రావుకు ఉద్యోగం దొరికింది...శరభయ్యభార్యకి 35 దో ఏట కడుపు వచ్చిందట. వెంకటస్వామికి పోయినచూపు కొద్దిగా వచ్చిందట...ఇలా రోజు కొక సెన్సేషనల్ న్యూస్ తీసికొస్తున్నాడు శాస్త్రిగారు. 'ఏమంటారు దీనికి?' అని మమ్మల్ని వెటకారం చేస్తున్నాడు. అనేది ఏమీలేక, శాస్త్రిగార్ని చదువుకున్న మూఢునికింద జమకట్టాము.

ఇంతలో వర్షాలు వచ్చినై — కలరాను వెంటబెట్టుకుని. శేషమ్మకి సరికొత్తగా పోతురాజు పూనాడు. తనకి కొలుపులు కొలవకపోతే ఊరంతా విరుచుకుతింటానని బెదిరించాడు. ఊళ్ళో పెద్దలు కొలుపులు కొలుస్తామని ముడుపులు కట్టారు. ఊరంతా పోతురాజును నమ్మినా, మునిసిపాల్టీవాళ్ళు నమ్మలేదు. వాళ్ళ జాగర్త వాళ్ళు పడుతూనే ఉన్నారు. బావుల్లో మందు కలిపారు. తోవలో నుంచుని కనపడ్డవాడికల్లా కలరా వాక్సిన్ యిచ్చారు.. ఇంకా యిస్తూనే ఉన్నారు.

నేనూ, చెంచయ్యా కలరా వాక్సిన్ తీసుకున్నాము. శాస్త్రిగారుకూడా తీసుకున్నారని విన్నాం కాని, వారు ఒప్పుకోలేదు. ముడుపు కట్టానన్నారు — మమ్మల్నికూడా కట్టమని సలహా యిచ్చారు. చెంచయ్యా నేనూ కలసి శాస్త్రిగారిని చదువుకున్న మూఢునిక్రింద జమకట్టాముకదా అనుకున్నాము.

కలరా అక్కడి కక్కడికీ పాకిపోతున్నది. మా పేటకికూడా వచ్చింది. ఇద్దరు ముగ్గురు జారారుకూడా. నేను డాక్టరుగారిని అడిగి కాంఫర్ 12x తీసుకుని ఒకడోసు వేసుకున్నాను.



"ఇంట్రెస్టింగ్, ఏం ఎగా కొన్నారంటే ఈ సొడ్డు?"

ఫలం నేను మందు మీదకూడా ఆధారపడలేదు. తిండి తగ్గించాను — వేడి పదార్థాలు తప్పితే, ముట్టడంలేదు.

సాయంత్రం శాస్త్రిగారు కనబడ్డారు పసుపుబొట్టు పెట్టుకుని. "ఏమిటి ఈ వేషం" అన్నాను.

"అమ్మవారి పసుపు" అన్నారు.

"అమ్మవారెక్కడనించి వచ్చింది. కొత్తగా?"

"కొత్తగానే వచ్చింది. పోతురాజు ఒక్కడికే కొలుపులు కొలవగూడదట!"

"ఒక్కమాటే పిల్లల్నికూడా తీసుకురాకపోయారూ?" అన్నాను.

"అవసరమైతే చెప్పుతుందా?" అని శాస్త్రిగారు నవ్వుతూ వెళ్ళిపోయారు

ఆ రాత్రి నాకు సరిగా నిద్రపట్టలేదు.. శాస్త్రిగారినీ పోతురాజునీ తలుచుకుంటే, నా ఒళ్ళు ఉడికిపోతున్నది.

తెలవారుఝామునకి గుడ్డికున్కొకటి వేశాననుకుంటాను అంతలో సన్నని ఏడుపుతో నాకు మెలకువ వచ్చింది. జారిసట్టేనా? సామూహిక రోదనంగా లేదే? — నాకు మళ్ళీ కన్నంటలేదు. తెల్లవారి తెలిసింది — వాడు జారాడట. మా పొరుగున కొత్తకేసు! ఉదయం ఉత్తకాఫీ తీసుకున్నాను. ఇంకేమీ తినలేదు. కాసేపటికి శాస్త్రిగారొచ్చి బలవంతంచేసి యిడ్లీ తినిపించారు. ఇంకో మాటు కాఫీ!

నాకిష్టం లేకపోయినా, శాస్త్రిగారు

పోతురాజుని ఎత్తుకున్నారు. నాకు చాలా కష్ట మేసింది .. "సోషలిస్టు స్టేటులో ఐతే మీబోటివాళ్ళని ఇలాంటి మూఢనమ్మకాలు ప్రచారం చేస్తున్నందుకు ఉరితీసే వాళ్ళు!" అన్నాను.

"ఆ లెఖ్ఖని ఈ స్టేటులో ప్రచారం చెయ్యకపోతే తీస్తారు!"

శాస్త్రిగారు చెప్పిందాంట్లో యదార్థం లేకపోలేదు, దూర మాలోచిస్తే.

"ఏమైనా రోగిని చికిత్స లేకుండా చంపటం ధర్మంకాదు" అన్నాను.

"చికిత్సతో చంపటంకూడా ధర్మం కాదు. డాక్టర్లు చంపితే ఏం కేసుంది, పోతురాజు చంపితే ఉంటానికి? డాక్టర్లతో నయమైనవాళ్ళు ఉంటే పోతురాజుతో నయమైనవాళ్ళూ ఉండనే వున్నారు.''

ఎందుకనో తిరస్కరించటానికి నాకు మనసు పోలేదు; అసలు మనసే బాగో లేదు. ఇంటి కొచ్చి, చాలా కొద్దిగా తిన్నాను అన్నం... పొరుగు కేసుకూడా ఫెయిల్ అయేటట్టుగా కనబడుతున్నది.. దానికిసూచన ఇంట్లోవాళ్ళు యిస్తున్నారు.

ఇంట్లో వుండలేకపోయాను ప్రకాశరావు యింటికి పోయి. పేకాట ప్రారంభించాము.

కడుపు నొప్పి ప్రారంభమైంది. ప్రకాశరావు వెధవ హల్వా తెచ్చి, మా అందరిచేతా తినిపించాడు. వెంచయ్య కూడా కడుపు పుచ్చుకున్నాడు.

బజారుకు వచ్చి కాఫీ తాగాము కడుపునొప్పి యింకా ఎక్కువైంది డాక్టర్నుఅడిగి Nux 200 తీసుకున్నాను

శాస్త్రిగారు ఏదో వాగించటానికి ప్రయత్నిస్తునే ఉన్నారు, నాకు ఏమీతోచటంలేదు ఇంటికి పోతున్నానని బయల్దేరా. కాని నా మనస్సుమనస్సులోలేదు నాకుతెలియకుండానే చుట్టుతిరిగి పోతురాజుగుడిదగ్గరికి వచ్చాను. చీకటి పడింది పోతురాజు గుడిముందు కాగడాలు వెలుగుతున్నై. తప్పెట్లూ, పంబజోళ్ళూ, వీరాంగం, గజావాహ్లా...నా వొళ్ళు పులకరించింది. ముఖంమీద వెలుతురు పడకుండా సాధ్యమైనంత దూరంలో నుంచున్నాను. కళ్ళు మూసుకుని చేతులు జోడించి పోతురాజుకు ముడుపు కడతానన్నాను. గత అపరాధాలు క్షమించమని చెంపలు వాయించుకుని చుట్టూచూశాను–ఎవ్వరూ చూడటం లేదుకదా అని! నాకు ధైర్యం చిక్కింది. ఎవ్వరూ చూడటం లేదు. నా పక్కని ఎప్పుడో వచ్చి నుంచున్న వెంచయ్య మాత్రం కళ్ళు మూసుకుని ఇదివరకు నే నున్నస్థితిలోనే ఉన్నాడు. అతని ధ్యానభంగం కాక ముందే, నే నక్కడినించి పారిపోయాను

---

సినిమా క్విజ్ - జవాబులు

1. ఇద్దరు పెళ్లాలు　　　　2. ముగ్గురు కొడుకులు

సీరియల్ వ్యాసం:

# కవిత్వమంటే-

కవిత్వం వాస్తవలోకానికి కేవలం ప్రతిబింబం కాదు. అలా అయితే అప్సరసలు, అమరులు, ఆకాశగంగ, పాలసముద్రం, మేరుపర్వతం లాంటి ఆనందదాయకాలైన విషయాలకూ, నరకం, వైతరణివంటి భయావహాలైన విషయాలకూ, కవితాజగత్తులో తావు లేకుండేది. మానవుడు సుఖదుఃఖాలకు రూపారోపణం చేసి స్వర్గనరకాలు సృష్టించుకున్నాడు. తన మనోగతమైన సౌందర్యాన్ని ఒకచోట ప్రోగుచేసి రంభాద్యప్సరసలను కల్పించుకొని ఊహామాత్ర మాధుర్యం అనుభవిస్తున్నాడు. నిత్యజీవితంలోని పూలు క్షణమాత్రమో దినమాత్రమో వికాసంతో ఉండి పిమ్మట వాడివత్తలై పోవడం మానవుడు సహించలేక 'పరిమళము చెడని వాడని పరువము దప్పని పరాగము'గల పారిజాతాది పుష్పాలను ఊహించుకొని తల నూపుతున్నాడు. కాబట్టి వాస్తవ జగత్తులో లభ్యంకాని వస్తువులను, సాధ్యంకాని పదార్థాలను కవితా జగత్తులో సృష్టించుకొని అవ్యక్తానందం పొందుతున్నాడు. ఇది ప్రపంచ సాహిత్యా లన్నిటిలో ఉన్న విషయమే. ఉదాహరణకు కామదేవతనుతీసుకుందాం. ఇటు సంస్కృత సాహిత్యంలో అటు గ్రీకు సాహిత్యంలో మదనుని ప్రస్తావన ఉంది. ఇతణ్ని పూలవింటివాడుగా ఉభయ సాహిత్యాలు కల్పన చేశాయి. భర్తృహరి మదన మహిమను ఇలా ఉగ్గడించాడు –

"ధనుఃపౌష్పం మౌర్వీ మధుకరమయీ
చంచలదృశాం
దృశాం కోణోబాణః సుహృదపి
జడాత్మాహిమకరః
తథాప్యేకోనంగ స్త్రిభువనమపి
వ్యాకులయతి
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి
మహతాం నోపకరణే."

అంతటి నెరజోదుకు–జగము లొక్కుమ్మడి సాధింపనెంచిన మదన మహీపతికి పూలే బాణాలు, తుమ్మెదల బారే వింటినారి. శుకపికాలే బలగం. తాను అనంగుడై

డా॥ సి. నారాయణ రెడ్డి

కూడా పొంగుల హృదయాల్లో చిచ్చు రగిలిస్తాడు.

ఈ కల్పన కవితాజగత్తుకు సంబంధించిందే. అనుభూతి (మదనానుభూతి) మాత్రం వాస్తవికం. దీనికి రూపకల్పనం చేశాడు కవి. కాబట్టి వాస్తవికంగా ఉన్న లౌకికానుభూతులకు కవి కమనీయ రూపం కల్పిస్తాడని తేలింది.

## కవి-అనుభూతి

పైనచెప్పింది సామాజికుని అనుభూతి. కవియొక్క నైజానుభూతిని బట్టికూడా ఈ విషయం చర్చింపవలసివుంది. వస్తుస్థితి కవి భావనను పురస్కరించుకొని చిత్రిత మవుతుంటుందిగాని కేవలం వస్తువుయొక్క యాథార్థ్యాన్ని బట్టికాదు. ఒక్కొక్కప్పుడు కవి యథార్థానికి అతీతంగా భావనచేస్తాడు. కొన్ని సందర్భాల్లో వస్తువుయొక్క యధార్థస్వరూపం గుప్తమై ఒక కొత్తరూపు దాంట్లో మిలమిలలాడుతుంటుంది. అదే వస్తువు కవి మానసిక స్థితిగతులను బట్టి భిన్న సందర్భాల్లో భిన్నమైన అనుభూతులను ఇస్తుంది. లాంబర్న్ అనే విమర్శకుడు ఈ విషయాన్ని ఇలా బలపరచాడు :

"Art is the expression of the artist's mood, not the representation of objective fact. To a poet in a lover's mood, the sea smiles with him in his joy, the winds whisper the name of his beloved, the stars look down on him like friendly eyes; to the same poet in another mood, the same sea looks grim and cruel, the winds mock his sighs, and the cold stars watch him with a passionless inscrutable gaze."

(The Rudiments of Criticism

ఈ అభిప్రాయాన్నే ఆనందవర్ధనుడు ఇలా వెల్లడించాడు :

'అపారే కావ్య సంసారే
కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే
శృంగారీచే త్కవిః కావ్యే
జాతం రసమయం జగత్
సఏవ వీతరాగశ్చేత్
నీరసం జాతమేవతత్."

ఆనందవర్ధనుని శ్లోకానికి లాంబర్న్ మాటలు ఉదాహరణప్రాయంగా ఉన్నవి. తేలిందేమిటంటే కవి స్వీయానుభూతులనుబట్టి కూడా వస్తుస్థితిగతుల్లో మార్పు రాకతప్పదు వాస్తవికత అనేది ఎప్పుడూ చెల్లేదికాదు. కొన్ని సందర్భాల్లో వాస్తవిక చిత్రణ కావ్యానికి వన్నె గూరిస్తే మరి కొన్ని తావుల్లో ఆదర్శక చిత్రణం సొగసుగా ఉంటుంది వాస్తవికత పేరుతో ప్రతిభా లోపాన్నీ. శిల్పదారిద్ర్యాన్నీ కప్పిపుచ్చరాదని Howard Fast తాను వ్రాసిన 'Literature and Reality' అనే గ్రంథంలో ఇలా విశదీకరించాడు.

'Realism is the reflection literature, of life, itself. It is a ladder to the stars, a road to such art as man never knew and never dreamed of.'

వాస్తవికత కల్పనకు సోపానం వంటిదని ఫాస్ట్ అభిప్రాయం.

కవులు అలౌకికంగా ఊహించిన విషయాలుగూడ కేవలం అభూతాలనుకోరాదు. వాటి పునాదులు లౌకికానుభూతుల్లోనే ఉన్నవి. స్వర్గం, ఆకాశగంగ, క్షీరసాగరం మొదలైనవి సామాజిక జగత్తులో బీజప్రాయంగా ఉన్నవే. లౌకిక జగత్తులోని ఆనంద ధామమే కావ్యజగత్తులోని స్వర్గం. ఇక్కడి గంగయే ఇంతకు ఇమ్మడి ముమ్మడి అందాన్నీ ఉదాత్తతనూ సంతరించుకుని ఆకాశ గంగగా రూపుదిద్దుకున్నది. ఉదయ సూర్యుని కాంతిలో మిలమిల మెరిసిపోయే ఇసుకే ఆకాశ గంగాతీరంలోని స్వర్ణ సైకతం. పున్నమవేళ పండు వెన్నెల్లో తళతళలాడే సామాన్య సముద్రమే కవితాలోకంలో క్షీరసాగరం. ఇక్కడ కవి పొందిన లౌకికానుభూతులే ఇంచుకంత భేదంతో అలౌకిక వస్తువులుగా రూపొందినవి. డా॥ జి. వి. కృష్ణరావుగారు వ్రాసిన మాటలు ఈ సందర్భంలో గమనింపదగినవి.

"కవుల వర్ణన ప్రకారం శివుడు అలౌకిక మూర్తి. కవులు ఎలా సృష్టించగలిగారా అనే సందేహం ఒకప్పుడు నన్ను పీడుస్తూ వుండేది. కాని సైకో యెనలిస్టులు బండారం బయట పెట్టారు ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాదనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతి మార్గాలను పోనీక సంయమించటంవల్ల ఈ సృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికం కాదనీ, కేవలం పుంస్త్వ స్వరూపమే ననీ గ్రహిస్తేచాలు."

(కావ్య జగత్తు)

కృష్ణరావుగారి తీర్పు సైకో ఎనాలిసిస్ అనే ఫ్రాయిడ్ సిద్ధాంతంతో సంబంధించినదైనా, శివసృష్టి యేరకంగా లౌకికానుభూతులతో లంకెవేయబడి ఉందో నిరూపిస్తున్నందున ఈ సందర్భంలో ఉదాహరించబడింది.

కవిత్వం- మానవప్రకృతిచిత్రణం

ఫిలిప్ సిడ్నీకి వందయేండ్ల తర్వాత జాన్‌డ్రైడెన్ అనే ఆంగ్ల విమర్శకుడు 'Essay on Dramatic Poesie' ని ప్రకటించాడు. ఇది ప్రధానంగా గేయ నాటికల స్వరూప స్వభావాలను చర్చించడానికి ఉద్దిష్టమైన రచనే అయినా కవిత్వాన్ని గూర్చికూడా కొన్ని అభిప్రాయాలను వెల్లడించింది. డ్రైడెన్ ఈ వ్యాసంలో play (poetry) నిర్వచనమిలా చేశాడు;

'A just and lively image of human nature, representing its passions and humours, and the

changes of fortune to which it is subject, for the delight and instruction of mankind."

కవితా జగత్తును ఆదర్శ జగత్తుగా, అలౌకిక ప్రపంచంగా చిత్రించిన సిడ్నీ అభిప్రాయానికి భిన్నమైన సిద్ధాంతాన్ని డ్రైడెన్ ప్రతిపాదించాడు. మానవ ప్రకృతిని యథాతథంగా చిత్రించడమే కవిత్వధర్మ మన్నాడు. ఇతని వాదం ఇంకా ఇలా సాగిపోయింది–

మానవప్రకృతి చమత్కార మయం, అద్భుతావహం, ఆవేశబద్ధం. ఇదికొన్ని వింత ప్రవృత్తులతో లంకె వేసుకొని వుంటుంది. కాబట్టి ఆవేశ బద్ధములూ చమత్కార సిద్ధములూ అయిన విచిత్ర ప్రవృత్తులకు ప్రాతినిధ్యం వహించే మానవ ప్రకృతియొక్క ప్రతిబింబమే కవిత్వం, విధివిలాసాన్ని బట్టి ఈ ప్రకృతి పరివర్తనం పొందుతూ వుంటుంది. విధివశాత్ పరిణామాత్మక మైన యీ మానవ ప్రకృతి చిత్రణతో సహృదయులు ఆనందాన్నీ సందేశాన్నీ అందుకుంటారు. ఇది డ్రైడెన్ వాద సారాంశం. దీని కుదాహరణగా ఇతడు హామ్లెట్ నాటకాన్ని తీసుకొమ్మన్నాడు. హామ్లెట్ తండ్రి తన పినతండ్రి చేత హత్య చేయించబడకుండా వుంటే, హామ్లెట్ తల్లి భర్తృహంతయైన తన మరదిని పెళ్ళాడకుండావుంటే, హామ్లెట్ అంతర ప్రకృతిలో దాగివున్న నైజం విస్ఫుటించకుండావుండేది. విధివశాత్తున ఏర్పడిన యీ సంఘటనలే హామ్లెట్ పాత్రలోని నైశిత్యాన్ని వెలికిదన్ని దానిని కవితాఖండంగా రూపొందించా యని డ్రైడెన్ అభిప్రాయ పడినాడు. ఒక్కమాటలో ఇతని సిద్ధాంతాన్ని ఇలా సంగ్రహించవచ్చు. కొన్ని కొన్ని సంఘటనలనుబట్టి మానవ ప్రకృతిలోని వైవిధ్యం, వైలక్షణ్యం వ్యక్తమవు తుంది. దానిని ప్రకటించడమే కవితా ధర్మం. David Daiches వాఖ్యానించి నట్లుగా డ్రైడెన్ వాదం తర్కబద్ధం ఇతని సిద్ధాంతంలో ఆధునికుల 'Psychological Realism' (మనస్తత్వంమీద పరిస్థితుల ప్రభావం) అనే వాదం తొంగి చూస్తున్నది.

డ్రైడెన్ ప్రతిపాదించిన అభిప్రాయాన్నే ఇంచుమించుగా డా॥ జాన్సన్ బలపరచాడు. షేక్స్పియరు రచనల సంపుటికి తాను వ్రాసిన ఉపోద్ఘాతంలో జాన్సన్ కవిత్వాన్నిగూర్చి తన అభి ప్రాయాలను ప్రకటించాడు. సిడ్నీ ప్రతి పాదించిన ఆదర్శవాదాన్ని ఖండించాడు. సాధారణ మానవ ప్రకృతిని యథా తథంగా చిత్రించడమే కవిత్వ మన్నాడు అతని వాద సారాంశ మిది :–

సాధారణ ప్రకృతుల సహజ చిత్ర ణమే అన్నికాలాల్లో అందరినీ అలరించే గుణం. కల్పనాశక్తివల్ల రూపొందించిన విచిత్ర చిత్రణం తాత్కాలికంగామాత్రమే

'Realism is the reflection literature, of life, itself. It is a ladder to the stars, a road to such art as man never knew and never dreamed of.'

వాస్తవికత కల్పనకు సోపానం వంటి దని ఫాస్ట్ అభిప్రాయం.

కవులు అలౌకికంగా ఊహించిన విషయాలు గూడ కేవలం అభూతాలనుకోరాదు. వాటి పునాదులు లౌకికానుభూతుల్లోనే ఉన్నవి. స్వర్గం, ఆకాశగంగ, క్షీరసాగరం మొదలైనవి సామాజిక జగత్తులో బీజప్రాయంగా ఉన్నవే. లౌకిక జగత్తులోని ఆనంద ధామమే కావ్యజగత్తులోని స్వర్గం. ఇక్కడి గంగయే ఇంతకు ఇమ్మడి ముమ్మడి అందాన్నీ ఉదాత్తతనూ సంతరించుకుని ఆకాశ గంగగా రూపు దిద్దుకున్నది. ఉదయ సూర్యుని కాంతిలో మిలమిల మెరిసిపోయే ఇసుకే ఆకాశ గంగాతీరంలోని స్వర్ణ సైకతం. పున్నమవేళ పండు వెన్నెల్లో తళతళలాడే సామాన్య సముద్రమే కవితాలోకంలో క్షీరసాగరం. ఇక్కడ కవి పొందిన లౌకికానుభూతులే ఇంచుకంత భేదంతో అలౌకిక వస్తువులుగా రూపొందినవి. డా॥ జి. వి. కృష్ణరావుగారు వ్రాసిన మాటలు ఈ సందర్భంలో గమనింపదగినవి.

"కవుల వర్ణన ప్రకారం శివుడు అలౌకిక మూర్తి. కవులు ఎలా సృష్టించగలిగారా అనే సందేహం ఒకప్పుడు నన్ను పీడుస్తూ వుండేది. కాని సైకో యెనలిస్టులు బండారం బయట పెట్టారు. ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాదనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతి మార్గాలను పోనీక సంయమించటంవల్ల ఈ సృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికం కాదనీ, కేవలం పుంస్త్వ స్వరూపమే ననీ గ్రహిస్తేచాలు."

(కావ్య జగత్తు)

కృష్ణరావుగారి తీర్పు సైకో ఎనాలిసిస్ అనే ఫ్రాయిడ్ సిద్ధాంతంతో సంబంధించినదైనా, కవిసృష్టియేరకంగా లౌకికానుభూతులతో లంకెవేయబడి ఉందో నిరూపిస్తున్నందున ఈ సందర్భంలో ఉదాహరించబడింది.

## కవిత్వం- మానవప్రకృతిచిత్రణం

ఫిలిప్ సిడ్నీకి వందయేండ్ల తర్వాత జాన్‌డ్రైడెన్ అనే ఆంగ్ల విమర్శకుడు 'Essay on Dramatic Poesie' ని ప్రకటించాడు. ఇది ప్రధానంగా గేయ నాటికల స్వరూప స్వభావాలను చర్చించడానికి ఉద్దిష్టమైన రచనే అయినా కవిత్వాన్ని గూర్చికూడా కొన్ని అభిప్రాయాలను వెల్లడించింది. డ్రైడెన్ ఈ వ్యాసంలో play (poetry) నిర్వచన మిలా చేశాడు;

'A just and lively image of human nature, representing its passions and humours, and the

ఆనందదాయిక మవుతుంది. ఆకస్మికంగా కలిగే ఆశ్చర్యకర సంఘటనలవల్ల సమ కూరే ఆనందం త్వరలోనే అంతరించి పోతుంది. సుస్థిర సత్యాలపై ఆధార పడడంవల్లనే హృదయానికి శాశ్వతా నందం లభిస్తుంది.

ఈ విమర్శకు లిరువురూ పాక్షికమైన మార్గాన్నే అవలంబించా రనాలి. ఎందు చేత ననగా ఈ యిరువురూ ఊహాశక్తినీ కల్పనాశక్తినీ ఆదరించలేదు సరికదా కొంతవరకు త్రోసిపుచ్చారు. నాటక రచనను దృష్టిలో పెట్టుకోవడంవల్ల వీరి అభిప్రాయాలు ఇలా వెలువడినవి. ఈ రెంటిలో డ్రైడెన్ సిద్ధాంతం కొంత సహేతుకంగావుంది. ఇతడు Lively అనే శబ్దాన్ని ప్రయోగించడంవల్ల సమ గ్రత యేర్పడింది. మానవ ప్రకృతి ప్రతిబింబాన్ని మనస్తత్వ శాస్త్రవేత్త గూడా చిత్రింపగలుగుతాడు. అతని చిత్రణ రసవత్తరంగా ఉండదు. ఆ చిత్ర ణనే కవి రసాత్మకంగా (livelyగా) పర్యవసింప జేస్తాడు. ఏది యెలా గున్నా వీ రిర్వురూ ప్రధానంగా మానవప్రకృతి యొక్క యథార్థ చిత్రణవైపే పక్షపాతం చూపారు. ఈ విధానం నాటకంపట్ల చెల్లు తుందిగాని కవిత్వం పట్ల అంత గా వర్తించదు. ముఖ్యంగా ఆత్మాశ్రయ కవిత్వంలో ఊహా, కల్పనా లేనిదే సొగసు లేదు. వాస్తవస్థితికి ఊహ అనే సుందర చేలాన్ని తొడిగినప్పుడే శోభిస్తుంది. అంతమాత్రాన మానవ జీవితంనుంచి కవిత్వాన్ని పూర్తిగా విడదీయడానికి వీలు లేదు. కొన్ని సందర్భాలలోనే మానవ జీవితానికీ నిత్యనైమిత్తికానుభూతులకూ అతీతమైన విషయాలు కావ్యజగత్తులో కనిపించవచ్చు. అంతమాత్రాన కవితా లోకం నిత్యజీవితానికి భిన్నమైనది కాదు. ఐ.ఏ. రిచర్డ్స్ Principles of Literary Criticism అనే విమర్శగ్రంథంలో అన్న క్రిందిమాటలు ఈ సందర్భాన స్మరింప దగినవి:

"The seperation of Poetic experience from its place in life and its ulterior worths, involves a definite lop-sidedness, narrowness and incompleteness in those who preach it sincerely."

కావ్యానుభూతిని జీవితంనుంచీ దాని పరమార్థంనుంచీ విడదీయడంవల్ల అట్టి సిద్ధాంతాలను మనఃపూర్తిగా ప్రతిపా దించేవారిలో పాక్షికదృష్టీ, సంకుచి తత్వం, అసమగ్రత్వం ఏర్పడుతా యని రిచర్డ్స్ అభిప్రాయం.

(సశేషం)






చూపు లో చూపు

# కైఫియాని

"త్రాతయ్యా! తాతయ్యా! ఒకకథ చెప్పవూ" అని అడిగాను నేను.

మామూలుచోటే — సుబ్బయ్యగారి రత్తయ్య అరుగులమీద కూచుని ఉన్నాం. రాత్రి పదవుతుంది. ఊళ్ళోఅంతా తలుపులు మూసుకున్నారు. ఎక్కడా అలికిడి లేదు. ప్రొద్దుపోని కుర్రకారంతా తాతయ్యా చుట్టూ చేరాం. పైపంచె నడుముకూ, మోకాళ్ళకూ బందంలాగాచుట్టి, తాతయ్యా తాపీగా చుట్ట కాలుస్తున్నాడు.

"ఇప్పుడేంకథలే పోనిద్దూ!"

'తాతయ్యా— తాతయ్యా'

'తాతయ్యా నువ్వు నీ నులకమంచాలు ఊడదీసి పెట్టావే. రేపు వాటిని నెయ్యటానికి మా సాయం అక్కరలేదా?" అని అడిగాడు శంకరాయి.

"అయినా చెప్పటానికి కథలేమి ఏడిసినయ్ గనుక. రాజులూ, రాణీలు ఉన్నకథలు చెపితే రాజకీయాల వాసన రావొచ్చు అందులో ఈమధ్యే కొత్త చట్టా లేవో వచ్చినయ్యంట. నీతికథలు చెపుదామంటే మీకు తెలియని నీతులేమున్నయ్. అయినా అలాంటి కథలు మీరు చిన్నతనంనుంచీ ఎన్నో చదివి ఉంటారు దేవతలు రాక్షసులు భూతాలు ప్రేతాలు పిశాచాలు వచ్చే కథలు చెప్పదామంటే మీ కారువాళ్ళకు వాటిలో నమ్మకం లేదాయె. రాగా పోగా మిగిలింది ప్రేమ ఒకటి. ఏ గొడవా లేనిది."

"పర్వాలేదులే తాతయ్యా. ప్రేమకథే చెప్పు ఎవడూ వద్దనడులే!" అన్నాడు రాముడు. ఆ పెధవాయి ఈ మధ్య ప్రేమ మీద పరిశోధన సాగిస్తున్నాడులెండి.

"దాంట్లో గూడా ఎన్ని చిక్కులు ఏడిసినయ్యి. మన రంగాయో ఎవడో చెప్పాడు—ఈమధ్య కొంతమంది కథలు రాసేవాళ్ళు ఏంరాయాలో తోచక, తమ స్నేహితులు, బంధువులు, పరిచయస్తులు అయినవాళ్ళ సంగతులే కథల్లో ఎక్కిం చేస్తున్నారట. వీళ్ళదెబ్బకు తట్టుకోలేక కథలు రాసేవాడంటే సరి, మైలుదూరం నుంచి పారిపోతున్నారట ప్రజలంతా. ఇలాంటి కథలద్వారా తమ జీవితాలు రచ్చకెక్కేసరికి కొంతమంది ఆత్మ

హత్యలుకూడా చేసుకున్నారట. అందు వల్ల అబ్బాయిలూ!...''

'నీతో అలాంటి భయం లేదులే తాతయ్యా! నువ్వు గొప్ప భావనాశక్తి గలవాడివి..."

"అంటే..."

"అంటే నువ్వు లేనిపోనివన్నీ కల్పించి చెప్పగలవన్నమాట" అని వ్యాఖ్యానం చేశాడు శంకరాయి.

"అంటే నేను వట్టి అబద్ధాల కోరు నని మీ ఉద్దేశమన్నమాట. ఇదిగో అబ్బాయి! నేను ఇంతవరకూ నాజన్మలో ఎన్నడూ అబద్ధమాడి ఎరుగను— ఎగ తాళికూడా. నేను మీకు కథలు చెబు తున్నానంటే నా జీవితంలో జరిగిన విష యాలే పేరులవీ మార్చి కథలుగా అల్లి చెబుతున్నానన్నమాట. అయితే ఒక్కటీ కూడా అబద్ధంకాదు. నాకసలు అబద్ధాలు చెప్పటంలో నమ్మకంలేదు" అన్నాడు తాతయ్య.

"దానికేం తాతయ్యా. నువ్వు కథ మొదలుపెడుదూ. ఒరే యిక నోళ్ళు మూయండిరా!" అన్నాడు రాముడు. అందరం నోళ్ళు మూశాం.

"ఆరోజుల్లో నేనొక ఓడల కంపెనీలో పనిచేస్తూ ఉండేవాణ్ణి. మా ఓడలు దక్షిణ పూర్వంలో ఉన్న దీవులకు పోయి తిరిగి వస్తూండేవి ఏలకులు, లవంగాలు, మసాలా దినుసులు మొదలైనవి కొని జేరవేస్తూ ఉండేది మాకంపెనీ. అది తెల్లవాళ్ళది. మా ఓడ కప్తానుకూడా తెల్లవాడే. చాలా మంచివాడు. నేనంటే ఇష్టంగా ఉండేవాడు. ఒకసారి...''

"ఆకంపెనీ పేరేమిటి తాతయ్యా—'' అని అడిగాడు శంకరాయి.

"ఒరేయి కంపెనీ పేరు ఏదయితే నీకెందుకురా? నీకు కథ కావాలా, ఓడల కంపెనీలపేరుల జాబితా కావాలా? ఇలాంటి కుంటిప్రశ్నలు వేశారంటే కథ చెప్పటం మానేస్తాను. మీరు పత్రికల్లో, పుస్తకాల్లో ఇన్నికథలు చదువుతున్నారు వాళ్ళందరినీ ఇలాంటి ప్రశ్నలు అడుగు తున్నారా? ఏం, నేను లోకువగా దొరికా నన్?" అన్నాడు తాతయ్య.

"లేదులే తాతయ్య. నువ్వుకథచెప్పు. ఇక ప్రశ్నలువేస్తే ఒట్టే.'' అన్నాను నేను.

"అలా రండి దోవకు— ఎక్కడ వున్నానూ, ఆఁ. ఒకసారి ఏంజరిగిం దంటే మేం నడిసముద్రంలోఉండగా పెద్ద తుఫాను వచ్చింది. ఓడపని మునగటం తేలటంగా ఉంది. తాటిఎత్తున లేచిన కెర టాలు ఓడమీద విరుచుకుపడుతున్నాయి జీవితమంతా సముద్రంమీద గడిపిన కప్తానుకూడా ఆలోచనలో పడిపోయాడు. సముద్రం ప్రళయరూపం దాల్చింది. 'డెక్'మీద ఉన్న మాకు కాళ్ళు నిలవటం లేదు. ఇక్కొక్క కెరటం వచ్చి పడిం దంటే దాని తాకిడికి ఓడ అంచువరకూ కొట్టుకు పోతున్నాం. ఎలాగో త్రాళ్ళు

కట్టుకుని, ప్రమాదంలో పడిపోకుండా ప్రాణాలు కాపాడుకొంటున్నాము. అందులో కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. మా గ్రుడ్డి లాంతర్లు ఎపుడో ఆరిపోయాయి. కెరటాల తలలమీద కిరీటాల్లా మెరుస్తున్న నురుగు తప్ప ఏమీ కనుపించటం లేదు.

"ఇంతలో ఒక బ్రహ్మాండమైన కెరటం వచ్చిపడింది. అల్లంతదూరంలో దాన్ని చూడగానే మా గుండెల్లో దడ బయలుదేరింది. కాళ్ళూ చేతులూ ఆడలేదు. 'వస్తోంది, జాగర్త' అని ఒకరి నొకరం హెచ్చరించుకున్నాం. ఇంతలో రానే వచ్చింది. ఆ నిమిషంలో ఏం జరుగుతుందో నా క ర్థం కా లే దు. ఏవో కేకలుమాత్రం వినిపించాయి. ఏదో ఒక మహత్తరశక్తి నన్ను పసిపిల్లవాణ్ణి చేసి ఎత్తుకపోతున్నట్టు తోచింది. ఏం జరిగిందో గ్రహించే టప్పటికే నేను మహాసముద్రంలో ఉన్నాను.

"అ ప్ప టి కే ఓడ నాకు దూరమైపోయింది. కప్తాను గదిలో దీపం మిణుగురు పురుగులా మెరుస్తోంది. ఈ తుఫానులో నన్ను రక్షించటం సంగతి అలా ఉంచి వాళ్ళను వాళ్ళు రక్షించుకుంటే చాలు. నా దురదృష్టాన్ని తిట్టుకోవటం తప్ప నేను చేయగలిగిం దేమీ కనుపించలేదు. మనిషి బొందెలో శ్వాస ఉన్నంత వరకూ ఆశ చావదు. బిగ్గరగా అరవాలని ప్రయత్నించాను. ఎలాగో ఈది ఓడను చేరుకోవాలని పోరాడాను. ఫలితం మాత్రం కనుపించలేదు. అలసి సొలసి స్పృహతప్పిపోయాను.

"నాకు మళ్ళీ స్పృహ వచ్చి కళ్ళు తెరిచి చూసేటప్పటికి ఇసుకలో పడి వున్నాను. నా కళ్ళకు ఎదురుగా కనిపించినది ఒక నల్లని ముఖం. ఆ ముఖంలో సంతోషం వుద్రేకం రెండూ కనిపిస్తున్నాయి. అతను ఆడుస్తూ ఏదో చెబుతున్నాడు. కాని, అతని భాష నాకు అర్థం కావడం లేదు. ప్రళయంలాగ వచ్చిన తుఫాను నన్ను ఏదో ఎరుగని దీవిలో తెచ్చిపడేసిం దని అప్పుడు గ్రహించాను. అతన్ని ఏవో ప్రశ్నలు అడగబోయాను. అతడు సైగలతో "నిన్ను నేను రక్షించి తీసుకు వచ్చాను" అని చెప్పాడు.

"తన రొమ్ము చరిచి, 'కిమాని, కిమాని' అన్నాడు. వాన్ని బట్టి అతని పేరు 'కిమాని' అని గ్రహించాను. నేను కూడా మెల్లగా రొమ్ముని తాకుతూ 'రామయ' అన్నాను. అతను చప్పట్లు చరిచి 'రామ, రామ' అని గంతులు వేయసాగాడు. నన్ను లేవదీసి మెల్లగా నడిపించుకుంటూ తీసుకు వెళ్ళాడు. ఆ ప్రశాంత మహాసాగరంలో నే నెరుగని ఒక చిన్న దీవి. అక్కడి ప్రజలు చూడడానికి మంగోలు జాతికి దగ్గరగా వున్నారు. కాని, వాళ్ళు యింకా పొడుగ్గా, నల్లగా, దృఢంగా వున్నారు. వాళ్ళంతా నన్ను గురించి, కుతూహలం కనబరచారు. కాని, ఏ విధమైన అయిష్టత



కాని, పరాయివాడి ననే ఏవగింపుగాని వారి ప్రవర్తనలో కనుపించలేదు. కొద్ది రోజుల్లోనే వారు నన్ను తమలో ఒకణ్ణిగా స్వీకరించారు.

"కిమానీ నన్ను వాళ్ళ రాజుదగ్గరకు కూడా తీసుకువెళ్లాడు. వాళ్ళ రాచమర్యాద అదీ నేర్పి-నన్ను రాజుకు నమస్కరించమన్నాడు. నన్ను గురించి రాజుకు ఏదో చెప్పాడు. రాజు చిరునవ్వు నవ్వి తల ఊపాడు. నేను చాలా మంచివాడి ననీ, నా వల్ల ఆ దీవి ప్రజలకు ఏవిధమైన కీడూ రాదని హామీ ఇచ్చి నన్ను తనతోనే ఉంచుకుంటా నని కిమానీ చెప్పాడట. ఇది నాకు తర్వాత తెలిసింది. రాజు ప్రక్కన ఎవరో ఒక పడుచు ఉన్నది.

ఆమెవంక చూపించి కిమానీ ఏదో చెప్పాడు. రాణీ ఏమో ననుకున్నాను. ఆమెకూడా చిరునవ్వు నవ్వింది. ఆమె రాణీ కాదనీ, రాజకుమారి రీతా అనీ తర్వాత తెలిసింది.

"ఆ దీవి ప్రజలను చూస్తే నాకు కొంచెం ఆశ్చర్య మేసింది. ఎందుకంటే– వారు చూడడానికి అనాగరికులుగా వున్నా, అతిథి మర్యాదలో గాని, సంఘపు కట్టుబాట్లను పాటించడంలో గాని, ఒకరి నొకరు గౌరవించుకొనడంలో గాని నాగరికుల కంటే మిన్నగా వున్నారు.

"నాకూ కిమానీకి మంచి స్నేహం కుదిరింది. అతడు నా ప్రాణాలు రక్షించాడనే కాదు; అతని స్వభావంలోనే యిట్టే స్నేహం కలుపుకునే గుణం వుంది. అతని దేహం ఎంత నల్లటిదో మనస్సు అంత తెల్లటిది. చాలా బలశాలి.

"సంతోషంగా వున్నప్పుడు గట్టిగా నా వీపుమీద చరిచి నన్ను పిల్లవాణ్ణి ఎత్తుకున్నట్లు ఎత్తుకుని అల్లిబిల్లి తిప్పేవాడు ఆ దీవిలోవున్న చిన్నలు, పెద్దలు అంతా అతన్ని చాలా గౌరవించేవాళ్ళు. సాటి పడుచు వాళ్ళు అతన్ని చూసి అసూయపడే వాళ్ళు. ఆ దీవిలోని పడుచులు అతన్ని ఎంతో ఆశగా చూస్తు వుండేవాళ్ళు నయగు రైదుగురు పడుచులు కలిసి సముద్రపు ఒడ్డుకు గాని, చెట్ల గుబురులోకి గాని జట్టుగా వెడుతున్నప్పుడు కిమానీ ఎదురుపడితే ఒకళ్ళ నొకళ్ళు మోచేతుల్తో పొడుచుకోవడం, నవ్వుతూ అతనివంక చూడడం నేను స్వయంగా చూశాను. కిమానీ వాళ్ళ దృష్టిలో వొట్టి అందగాడే కాదు, గొప్ప వీరుడుకూడా. బల్లెంతో పెద్దపెద్ద చేపలను చంపడంలో గాని, తెప్పను నడపడంలో గాని, వేటాడడంలో గాని, అతన్ని మించినవాళ్ళు ఆ దీవిలోనే లేరని నాకు తెలిసింది. కాని, పాపం కిమానీ అందమైన ఆడపిల్లలకు అందరాని పండయి పోయాడు. ఎందువల్లనంటే – కిమానీ రాజుకూతురు రీతాని ప్రేమించాడని. ఆ అమ్మాయికి కూడా అత నంటే యిష్టం మరి. భాష తెలియక పోవటంవల్ల ఇది నేను ఆమెను మొదట చూసిన రోజున గ్రహించలేక పోయాను.

"కిమానీ చాలా సిగ్గరి. ఆడపిల్లలు అతనికి వినబడేటట్లు వేళాకోళా లాడినా అత నేమీ జవాబు చెప్పేవాడు కాదు. వాళ్ళ సంగ తేమీ పట్టించుకోకుండా వెళ్ళి పోతుండేవాడు. పడుచుదనంలో సహజంగావుండే చిలిపితనంగాని, ఆటకాయితనంగాని అతనిలో నాకు కనుపించలేదు. వయస్సు ఎక్కువ లేకపోయినా అతడు చాలా గంభీరమైన మనిషి.

"మెల్లమెల్లగా నేను వాళ్ళలో కలిసిపొయ్యాను. వాళ్ళ అలవాట్లన్నీ అలవరచుకున్నాను. వాళ్ళ భాష కూడా కొంచెం కొంచెంగా నేర్చుకున్నాను.

"ఒకరోజున కిమానీ వచ్చి నాతో

'వెడదాం పద' అన్నాడు. 'ఎక్కడికి' అన్నాను. 'చెబుతా పద' అన్నాడు. అతని వెంట నడిచాను. కొంతదూరం వెళ్ళాక అర్థం అయింది నాకు—అతను నన్ను రాజువద్దకు తీసుకెడుతున్నా డని.

'వద్దు, నే దేనికీ ?' అన్నాను.

'బలేవాడి వే. రీతా నిన్ను చూడా లన్నది' అని నా చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళాడు.

"మొదటిసారి రాజు ప్రక్కన చూసినప్పుడు, భయం వల్లగానీ, బెదురువల్లగానీ ఆమెను సరిగా చూడలేదు. ఇవాళ చూశాను. అసలా దేశపు స్త్రీలు చాలా అందమైనవాళ్ళు. నల్లగా ఉంటేనేం, చెక్కిన విగ్రహాల్లా ఉన్నారు అందులో రాజకుమార్తె మరీన్నీ—శరీరకష్టం చేసే వాళ్ళలోగాని ఆ అందం కనబడదు. ఆ ఒంపులూ, ఆ కండలూ..."

"ఇక సరే—చలంగారి వర్ణనలు మొదలుపెట్టాడు తాతయ్య" అన్నాడు రాముడు.

"చలం ఎవరో ! ఆమె పేరు రీతా" అన్నాడు తాతయ్య.

"లేదులే తాతయ్యా. నువ్వు కథ చెప్పు !" అన్నాను.

"అయితే ఆమెకూ, ఆ దీవిలోని యితర పడుచులకూ కట్టులోగాని, బొట్టులోగాని నా కేమీ తేడా కనిపించలేదు. ప్రవర్తనలో మాత్రం తేడా వున్నది. ఆమె చూపులూ, మాటలూ, మర్యాదలూ హుందాగా వున్నాయి. నేను పరాయిజాతివాణ్ణయినా, నా వంక విచిత్రమైన జంతువును చూసినట్టుగా చూడలేదామె. ఆమెలో వెకిలితనమనే దెక్కడా లేదు.

'కిమానిని నాకు దూరం చేశావు—అన్నది. రాకుమారి.

నేను గాబరాపడి 'అదేంటి అలా అంటారు'అని క్షమాపణ చెప్పబోయాను.

'నీ వంటి మంచి స్నేహితుడు దొరికే టప్పటికి కిమానీ నన్నుకూడా మరచి పోయాడు' అన్నది ఆమె—నాకు నెమ్మది కలిగింది.

'సెలవు తీసుకుని తిరిగి వచ్చేటప్పుడు రాజుకు ఆమె అంటే ప్రాణమనీ, ఆమె ఏమి కోరినా కాదనడనీ చెప్పాడు కిమానీ.

"ఆ రోజునుంచి రీతావద్దకు ఎప్పుడు వెళ్ళినా కిమానీ నన్ను కూడా తీసుకెళ్ళే వాడు. సముద్రపు ఒడ్డుకు వెళ్ళినా, వనంలో పళ్ళు కోసుకోవడానికి పోయినా మేం ముగ్గురం కలిసి వెళ్ళేవాళ్ళం.

"ఆ దీవిలో స్త్రీలకు స్వేచ్ఛ ఎక్కువ. స్త్రీలూ, పురుషులూ జంటలు జంటలుగా కలిసితిరుగుతూఉండేవారు. పెద్దలెవ్వరికీ అభ్యంతరం ఉండేదికాదు. సంఘంలో ఎక్కువతక్కువలూ అంతస్తుల తేడా కూడా ఉన్నట్టు కనుపించలేదు.

"కిమానీ నన్ను సోదరునిలా చూసే వాడు. రాకుమారితో కులాసాగా తిరుగుతూ ఉంటే నేను పానకంలో పుడకలా వున్నా ననే భావం అతనిలో ఏ కోశానా కను

...ంచలేదు. ముగ్గురం కలిసి తిరుగుతున్నప్పుడు రాకుమారి ఒక్కొక్కరోజు అతనిలాగానే నా బుజంమీదకూడా చేయి వేశేది. మరోసారి నన్ను నవ్వుతూ కవ్వించేది. అతను ఈర్ష్య పడినట్లు ఎప్పుడూ తోచలేదు. ప్రేమను సంపూర్ణంగా స్వాయత్తం చేసుకున్న ధీరహాసా కనపరచేవాడు. ఒకరోజున హఠాత్తుగా కిలకిలా నవ్వే రాకుమారిని గాలిలో ఎలాగ్గా ఎత్తేశాడు అంత బలమైన రాకుమారీ గాలిలో సీతాకోకచిలుకలాగా అలా కాళ్ళూ చేతులూ ఆడిస్తూ ఉండిపోయింది. క్రిందకు దించి 'నువ్వెత్తుకో చూదాం' అన్నాడు. నాకు ముచ్చెమటలు పట్టాయి. 'ఊ, కానీ!' అన్నాడు. రాకుమారి చేతులు చాచింది. నాగరికతలోంచి వెళ్ళినవాడికి నా కా స్వేచ్ఛతా, స్వాచ్ఛందతా ఎక్కడినుంచి వస్తాయి? ప్రయత్నించాను. నాకు కళ్ళు బయర్లు కమ్మినట్లయింది. రాకుమారి కూడా ముడుచుకుని అలా వాలిపోయింది. క్రిందకు దించేశాను. 'చూశావా, నీవల్ల కాలేదు' అన్నాడు కిమానీ నవ్వుతూ. నేను సిగ్గుతో తల వంచుకున్నాను.

"అప్పటినుంచి నాలో ఏవదో దొంగ ప్రవేశించినట్లయింది. రాకుమారిని కన్నెత్తి చూడాలన్నా తాకాలన్నా బెదురుగా ఉండేది రాకుమారి మామూలుగానే నవ్వుతూ మాట్లాడుతూ ఉండేది. కాని ఆమెలోకూడా ఏదో మార్పు ఉందని అనిపించేది నాకు. ఆమె నన్ను తాకినప్పుడు ఆ స్పర్శ పూర్వంలా ఉన్నట్లనిపించేది కాదు. ఆమె నా వంక చూసినప్పుడు ఆ కళ్ళు ఎందుకో మెరుస్తున్నట్లు అనిపించేది. అంతా నా భ్రమ అనుకొనేవాడిని.

"ఏవిధమైన మార్పూలేనివాడు కిమానీ– నాలో మార్పుకూడా అతడు గమనించలేదు. అతణ్ణి చూసినప్పుడు నేను చాలా సిగ్గుపడేవాణ్ణి. నన్ను నేనే తిట్టుకునేవాణ్ణి. ఒక్కొక్కసారి ఈ ఆలోచనలతో రాత్రిళ్లు నిద్రకూడా పట్టేదికాదు. రాకుమారిని తప్పించుకు తిరగాలని నిశ్చయించుకున్నాను. ఏదో సాకు చెప్పేవాణ్ణి. కాని కిమానీ వినలేదు. 'రాకుమారి నీ స్నేహితుడు ఏమయ్యాడని అడుగుతుంది' అని చెప్పి నన్ను బలవంతాన లాక్కుపోయేవాడు.

"మొసలి పట్టుకొని లాక్కుపోయిన వానిలా నేనేదో అగాధంలోకి వెళ్ళిపోతున్నానని నాకు తెలుసు. గిజగిజలాడుతున్నాను. కాని లాభంలేకపోతున్నది.

"ఏదన్నా ఓడ రాకపోతుందా అని ఆశగా సముద్రంవంక చూసేవాణ్ణి; భగవంతుణ్ణి ప్రార్థించేవాణ్ణి; కాని దిక్కుల కవాటాలు మూసేఉన్నాయి. ముక్తికి మార్గం కనుపించలేదు. మరణశిక్ష విధించబడినవానిలా నేను రోజులు లెక్కపెట్టనాగాను.

"నేనేదో దిగులుగా ఉన్నానని కిమానీ




"తన కున్న కొద్ది టైంలోనే అందరికీ కొలతలు తీసికోవాలి మరి."

గమనించాడు. 'ఒంట్లో బాగాలేదా? ఇంటి మీద గాలి మరలిందా?' అని అడిగాడు. నేనెందుకు అలా ఉన్నానో రాకుమారి కూడా అర్థం కాలేదు.

'నీ స్నేహితుడికి ఇక్కడ బాగా లేదా? మనం అతిథి మర్యాదల్లో ఏమన్నా లోపంచేశామా?' అని అడిగింది కిమానీని.

'అబ్బే! ఏమీ లే'దని బుకాయించాను.

'కొద్దిగా ఓపికపట్టు. మా తెప్పతిరణాల వస్తున్నది. ఆ వైభవం చూశావంటే నీ దిగులంతా మరచిపోతావు' అన్నది రాకుమారి.

'తెప్పతిరణాల ఏమిటి,' అని అడిగాను కిమానీని.

'తెప్పలే మాకు జీవనాధారంగదా? తెప్పలమీదవెళ్ళి చేపలను బల్లాలతో వేటాడి తేనేగాని ఈ దీవిలో ఎవరికీ గడవదు. సంవత్సరానికొక్కసారి పూర్ణిమనాడు ఈ దీవిలోని పడుచువాళ్ళంతా తెప్పల పందెంలో పాల్గొంటారు. గెలిచినవారిని మా రాజు కోరినదిచ్చి సన్మానిస్తాడు. ఆ రోజున మా దీవిలో గొప్ప వైభవంగా ఉంటుంది. ముసలివాళ్ళూ, రోగులూ, పసిపాపలూ తప్ప ఇళ్ళల్లో ఎవరూ ఉండరు. అంతా కడుపునిండా తిని, త్రాగి వెన్నెల్లో నృత్యం

చేస్తారు. మా దీవి ఆ రోజున స్వర్గమే ననుకో' అన్నాడు.

'నువ్వుకూడా నృత్యం చేయగలవా?' అన్నది రాకుమారి నవ్వుతూ. నన్నేదో చెప్పరాని భయం ఆవహించింది.

"తిరణాల దగ్గిరకొచ్చినకొద్దీ దీవిలో హడావుడి ఎక్కువయింది. ఇంటింటా తినుబండారాలు, పళ్ళూ, ఒరి రకమైన చెట్టురసంలోంచి కాచే 'కీసా' అనే సారాయి, నిల్వచేయసాగారు. పడుచు వాళ్ళ ఉత్సాహానికి మేరలేదు.

"తిరణాల రెండురోజులు ఉందనగా కిమానీ ముసలితల్లి హఠాత్తుగా జబ్బు పడింది. కిమానీకి ఆమెతప్ప నా అనే వారు లేరు. అతనేవో ఆకుపసరులుతెచ్చి చికిత్స చేసాడు. కాని ఆమె జబ్బు తగ్గ లేదు.

"తిరణాల రోజున కిమానీకి ఇష్టం లేకపోయినా తెప్పల పందానికి వెళ్ళక తప్పలేదు. పోటి పడుచువాళ్ళంతా పాల్గొంటూ ఉంటే, అతను ఇంట్లో కూచుంటే అతనికీ, రాకుమారికీ కూడా నామోషీకాదా! రాకుమారి స్వయంగా వచ్చి అతన్ని తీసుకొనివెళ్ళింది. నన్ను కూడా రమ్మన్నది. కాని నేను వెళ్ళ లేదు కిమానీతల్లికి సేవచేస్తూ కూచు న్నాను.

"దూరాన్నుంచి దీవి ప్రజల హర్ష కోలాహలం వినవస్తున్నది. ముసలమ్మ ఏదో మూలుగుతున్నది. నాకు దూరమై పోయినదేశాలూ ఇళ్లూ జ్ఞాపకంవచ్చాయి. విధి నన్ను ఎక్కడికి తీసుకొనివచ్చింది!

"కిమానీ మధ్యాహ్నానికి గాని తిరిగి రాలేదు. నన్ను చూడగానే 'నేనే గెలి చాను. నేనే గెలిచాను' అని కేకలేశాడు. అతనివెంట రాకుమారి కూడా ఉన్నది. సాయంత్రం ఇద్దరినీ తప్పకుండా నృత్యా నికి రమ్మని చెప్పి వెళ్ళిపోయింది. రాకుమారికీ తనకూ పెళ్ళి స్థిరమైనట్లే ననీ రాజుకూడా ఒప్పుకున్నాడనీ కిమానీ చెప్పాడు. అతనికళ్ళు సంతోషంతో మెరుస్తున్నయ్. తల్లి జబ్బుగా లేకపోతే అతను ఇంకా ఎంతో సంతోషించేవాడు!

"సాయంత్రం అతని తల్లికి పరిచర్య చేయటానికి పక్కింటి ముసలమ్మను ఒప్పించి ఇద్దరమూ నృత్యానికి వెళ్లాము. వెళ్ళక తప్పిందికాదు.

"ఇళ్ళన్నీ ఖాళీగా ఉన్నాయ్. జన మంతా ఒక మైదానంలో చేరారు. వెన్నెల వెలుగులో దివిటీల కాంతి సరిగ్గా కన పడటంలేదు. విందు ఎప్పుడో మొదల యింది. తినేవాళ్ళు తింటున్నారు. త్రాగే వాళ్ళు త్రాగుతున్నారు. మేమక్కడకు వెళ్ళగానే జనమందరికళ్లూ ముఖ్యంగా పడుచుల కళ్ళు కిమానీవైపు తిరిగినయ్. తెప్పల పందెంలో గెలిచినవాడుకదా!

"వెళ్ళగానే ముందు కొయ్యపాత్రలో కీసా అందించారు. రాకుమారి తిను బండారాలును ముందు పెట్టింది. పడుచు పిల్లలంతా ఒక్కొక్కరే వచ్చి కీసా

పాత్రలు తినుబండారాలు అందించి మమ్మల్ని మర్యాద చేసిపెడుతున్నారు.

పైన చంద్రుడు నోరారా నవ్వుతున్నాడు. కీసా వాసన, పడుచుల మెడలోని పూల సువాసన జీవించమనే దేవత ముందు ధూపంలా గుబాళిస్తున్నాయ్. గుడిసెలో మూలుగుతున్న ముసలమ్మనూ, ముసలమ్మను పొంచుకుని కూర్చున్న మృత్యువునూ మేం మరిచిపోవటంలో ఆశ్చర్యమేముంది!

"మృదంగాలు మ్రోగినై -పడుచువాళ్లు గాలిలో ఎగిరి గంతులు వేసి నృత్యం చేయసాగారు. ఆనందంతో చిందులు త్రొక్కుతున్నవారి పాదాల క్రింద భూమి కంపించసాగింది. ముఖాలు మసక మసకగా కనుపించసాగినై — వారు త్రాగిన కీసా అంతా చెమటగా ప్రవహించసాగింది యువకుల చెమర్చిన మొగాలపైనా, వీపుల పైనా, యువతుల బాహువులపైనా, వారితోబాటే నృత్యం చేస్తున్న పాలిండ్లపైనా, పాముల్లా వ్రేలాడుతున్న పూలహారాలపైనా, వెన్నెల తళతళా ప్రకాశిస్తున్నది. అలసిపోయినవారు వస్తున్నారు. మళ్ళీ కీసా త్రాగి నృత్యానికి వెళ్ళుతున్నారు. నృత్యం చేస్తున్న వాళ్ళ ఉత్సాహం కనుపించని పాశంలాగా కూర్చుని చూస్తున్న వాళ్ళనుకూడా కట్టివేసింది.

"నేను కల కంటున్నట్లుగా, అలాగే చూస్తూ కూర్చున్నాను. ఒడ్డున కూర్చుని ఒక భయంకరమైన ప్రవాహాన్ని చూస్తున్నవాడిలా ఉంది నా పని. కళ్ళుతిరిగినంత పనయింది

"కిమానీకి తీరిక లేదు. యువతులంతా అతనివెంట పడుతున్నారు తమతో నృత్యంచేయమని. అతనికి వీలైనప్పుడల్లా రాకుమారితోనే నృత్యం చేస్తున్నాడు. కాని మిగిలిన పడుచులను తప్పించుకోలేకపోతున్నాడు.

"రాకుమారి కళ్ళు మెరుస్తున్నవి. ఆమె శరీరం అంతా పూవులా విరుస్తున్నటుగా ఉంది. వెన్నెల ఆమె దేహంలో ప్రవేశించి లోపలినుంచి బయటకు కాంతులు విరజిమ్ముతున్నట్టుగా ఉంది. నృత్యంచేస్తూ మధ్యమధ్య నా కేసి చేయి ఊపుతున్నది.

"ఇంతలోకి ఒక కుర్రవాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. కిమానీని పిలిచి వాళ్ళమ్మ చావు బతుకుల్లో ఉందని చెప్పాడు. కిమానీ చెమటతుడుచుకుంటూ రాకుమారికీ సంగతి చెప్పాడు. నేను కూడా లేవటం చూసి నన్ను రాకుమారికి తోడు ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు.

"మృదంగాలు క్రొత్త ఊపిరి పోసుకున్నట్టు మ్రోగసాగినై. నృత్యం స్థాయినందుకున్నది. రాకుమారి చుట్టూ కలయచూచి నా వద్దకు వచ్చింది. చేతులు చాచి 'నృత్యం చేదాం ర'మ్మన్నది. నా గుండెలు మృదంగాలలాగే మ్రోగసాగినై. నేను వెనుకాడాను. 'రా' అన్నది విసుగ్గా.

నా ప్రక్కనున్న ఇద్దరు ముగ్గురు 'పోవేం' అన్నారు. ప్రవాహంలో దూకాను.

"మృదంగాలు మ్రోగుతూనే ఉన్నాయి. వెన్నెల తళతళా మెరుస్తూనే ఉంది. నా రుధిరం కీసా వాసనకన్నా ఎక్కువ మత్తెక్కింది. పూలవాసన, పూలను మించిన పడుచుదపు సువాసన. గాలిలో తేలుతున్న కీసావాసనా, అంతకన్నా తీవ్రమైన వాంఛల వాసనా. నా తల తిరిగిపోయింది నే నెక్కడ ఉన్నానో, ఏం చేస్తున్నానో కూడా మరిచిపోయాను.

"ప్రొద్దుపోయింది. పెద్దలూ వయసు మళ్ళిన వాళ్ళంతా చల్లగా జారుకున్నారు. ఆ మైదానంలో పడుచువాళ్ళు మాత్రమే మిగిలారు

'రా కీసా త్రాగుదాం రా' అన్నది రాకుమారి. నేను రొప్పుకుంటూ వెళ్లాను. 'త్రాగు' అన్నది. కళ్ళు మూసుకుని త్రాగేశాను.

"నృత్యం చరమస్థాయి నందుకున్నది. పడుచువాళ్ళు జంటలు జంటలుగా చెట్ల గుబురుల్లోకి వెళ్ళిపోతున్నారు. ప్రక్కనున్న వాళ్ళవంక ఎవరూ తిరిగి కూడా చూడటం లేదు. చూడగలిగే స్థితిలో లేరు. నాకు వెన్నెలకూడా కీసాలాగే ఎర్రగా కనుపించింది రాకుమారి తీవెలాగా నా మీదకు వాలిపోతున్నది. నేను కూడా తడబడుతున్నాను. 'కాస్సేపు చెట్టక్రింద కూర్చుందాం, పద' అన్నది రాకుమారి. ఇద్దరం ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకొని చెట్లనీడల్లోకి నడిచాం.

"నాకు మెలకువ వచ్చేటప్పటికి ఆకుల సందుల్లోంచి ఎండ ముఖంమీద పడుతున్నది. బాగా ప్రొద్దెక్కినట్లుగా ఉంది. నా రొమ్ములమీద ఎవరిదో చేయి! రాకుమారి! అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు రాత్రి జరిగిందంతా.

"రాకుమారి సుఖంగా నిద్రపోతున్నది. నల్ల చలువరాతితో చెక్కినట్లున్న ఆమె ముఖంమీద ఎండపొడలు తళతళా మెరుస్తున్నాయ్. మెల్లగా 'రాకుమారీ' అని పిలిచాను. నిద్రలో ఏదో సణిగి, ఇంకా దగ్గరగా జరిగి నిద్రపోయింది. ఆమె ముఖంమీద ఎండపొడ లాంటిదే ఒక చిన్న చిరునవ్వు మెరిసింది.

"అనర్థానికి దారితీసిన ఆ రాత్రే కిమానీ తల్లి పోయింది. అంత్య క్రియాకర్మలో మునిగి వున్న అతనిని నేనుగాని రాకుమారి గాని చూడలేదు. మూడురోజులు గడచిపోయినై. రాకుమారి ఒక్క నిముసం కూడా నన్ను వదలలేదు నేనొక మహా ప్రవాహంలో ఉక్కిరిబిక్కిరి ఔతూ కొట్టుకుపోతున్నాను

"రాకుమారి తన తండ్రితో కిమానీని చేసుకోననీ, నన్నే చేసుకుంటాననీ చెప్పింది. రాజు మండిపడ్డాడు 'నేనిచ్చిన మాటసంగతి ఏమిటి? నలుగురిలో నాకు అవమానం కాదా, ఓ త్లైమ' అన్నాడు.

'దీనికి నువ్వే కారణం' అన్నట్లు నావంక నిప్పులు కక్కుతూ చూశాడు.



"పూర్వం మీరు తిప్పికొట్టినవే ననుకోండి, ఈ లోగా మీ అభిరుచి మారి ఉంటుంది అనుకున్నాను."

నేను గడగడ వణికాను. కాని రీతా ఏ మాత్రం చలించలేదు.

'ఏం ఫర్వాలేదు. నేను కిమానీతో చెప్పి ఒప్పిస్తా నన్నది. నా కేఅపాయం జరుగుతుందో నని నన్నుమాత్రం కని పెటుకొని ఉంటున్నది.

"కిమానీ ఇంటికి ఇద్దరం కలిసివెళ్లాం. అతని ముఖం తుఫానుముందు ఆవరించే కారుమబ్బుల్లాగ వున్నది. రీతా అతనితో స్పష్టంగా చెప్పింది, నన్నే పెళ్ళి చేసుకొంటా నని. 'ఇది ఎప్పటినుంచి?' అన్నాడు.

'అతణ్ణి చూసినప్పటినుంచీ' అంది.

"కిమానీ నావంక చూశాడు. అతని చూపుల్లో ఏముందో నేను చెప్పలేను నేను నిలువునా నీరైపోయాను. భూమి పగిలిపోయి నన్ను మింగేస్తే బాగుండు ననిపించింది.

'నీ ప్రాణాలు కాపాడాను. నిన్ను సోదరునిలా చూశాను. చివరకు నీవే నా ప్రాణాలు తీశావు' అన్నాడు.

"కిమానీ రీతాకు చాలా నచ్చచెప్పి చూశాడు. బ్రతిమిలాడాడు. చివరకు బెదిరించాడు కూడా—కాని లాభంలేకపోయింది. రీతా ససేమిరా అన్నది. చివరకు అతను నావైపు తిరిగి అన్నాడు — ఈ సమస్య

తిర్చాలంటే ఒక్కటే ఉపాయం ఉన్నది. మా ఆచారంప్రకారం యుద్ధం చేద్దాం. గెలిచినవాడికి రీతా' అని ఒక బల్లెం నా వైపు విసిరివేశాడు. రీతా ఒక్క కేక వేసి మా ఇద్దరిమధ్యా నిలుచున్నది. 'ప్లీజ్. నువ్వు అతణ్ణి చంపేస్తావు. నువ్వు అతణ్ణి చంపేస్తావు' అన్నది.

'పిరికిపందలా దాక్కుంటావేం? రా' అన్నాడు కిమానీ. నేను సజీవుణ్ణిలా అలాగే నిలబడి చూస్తూ ఉండిపోయాను. నా తప్పు ఏమీ లేదని చెప్పలేకపోయాను.

'రీతా! నువ్వు ఏమన్నా అను. నిన్ను మాత్రం నేను వదలను. నిన్నువదలి నేను బ్రతకలేను' అని కిమానీ వెళ్ళిపోయాడు.

"అతను చెప్పినంతా చేశాడు రాజుతో ఏం చెప్పాడో, ఎలా చెప్పాడోగాని, వెంటనే ముహూర్తం పెట్టించాడు. నేను రాకుమారి రీతాను చూడకుండా ఆంక్ష విధించాడు. ఏదన్నా ఓడ వచ్చేవరకూ ఉండటానికి నాకో గుడిశ ఇచ్చారు. సదుపాయాలు చేశారు. అంతవరకే జనమంతా నన్ను వెలి వేసినట్టు చూడసాగారు. నాతో ఎవరూ పలకటంలేదు.

"నా జీవితంలో అంత ఒంటరితనం ఎన్నడూ అనుభవించలేదు — చివరకు, సముద్రంలో తుపానులో చావుబ్రతుకుల మధ్య ఈదులాడుతున్నప్పుడుకూడా. నా మనస్సులో ఒకవిధమైన శూన్యం ఏర్పడిపోయింది.

రాకుమారి పెళ్లి సంబరాల నృత్యాలూ కేకలూ దూరాన్నుంచి సముద్ర ఘోష లాగా వినవస్తున్నవి. ఈ నాటకంలో ముఖ్య పాత్రధారులు తప్ప అంతా హాయిగానే ఉన్నారు. రాకుమారి సుఖంగా ఉండాలి. నా స్నేహితుడు కిమానీ సుఖంగా ఉండాలి. నేను ఎంతత్వరగా ఇక్కడనుంచి నిష్క్రమిస్తే అంత మంచిది. వాళ్ళ జీవితయాత్ర, నేను ఈ దీవిమీద అడుగు పెట్టకముందు ఎక్కడ ఉందో, అక్కడినుంచే మళ్ళీ ప్రారంభమయితే బాగుండును.

"తెల్లవారు ఝామున నాకు కొద్దిగా కునుకుపట్టింది. ఎవరో లేపారు. కళ్ళు నులుముకొని చూశాను. పది పదిహేను మంది బళ్ళెలుపట్టుకొని నిలబడిఉన్నారు. వాళ్ళ నాయకుడు కాబోలు — 'రాకుమారి ఇక్కడికి వచ్చిందా' అని అడిగాడు. 'రాలేదు. ఏం జరిగింది' అని అడిగాను.

'ఏం లేదు. నిన్ను రాజుగారు పిలుస్తున్నారు. పద! పోయి దీవిఅంతా గాలించండి!' అని వాళ్ళను ఆజ్ఞాపించాడు అతను.

"ఆరోజు సాయంత్రానికిగాని, దీవి మధ్యలో ఉన్న మొసళ్ళ మడుగులో రాకుమారి శవం దొరకలేదు. తాటిలోతు ఉన్న ఆ మడుగు పసరు నీటిలో మెత్తని పట్టువంటి రాకుమారి కేశాలు నాచులాగా తేలాయి. జలగర్భంలోని చీకటిలో ఆ కళ్ళు ముత్యాల్లాగ మెరిశాయి. ఆమె శరీర పరిమళాన్ని జలచరాలు ఆనందిం



"మీరు ఏమీ అనుకోకపోతే కొంచెం ఆ పటం ఇలా అందిస్తారా?"

చాయి. నల్లగా నిగనిగ లాడే ఆమె దేహం అందమైన చేపలాగా జారిపోయింది.

"దీవిలో రకరకాల పుకారులు బయలుదేరాయి. ఆత్మహత్య అని కొంతమంది అన్నారు. 'కిమానీయే చంపి మగుడులో పడేశా' డని మరికొంతమంది అన్నారు. వాళ్ళ పుణ్యమా అని నన్నెవరూ ఏమీ అనలేదు. ఆ రోజునుంచి కిమానీ కూడా మాయమయ్యాడు. రాజు అతనిని చంపించివేశాడని కొంతమంది, రాజు భయంతో అతనే పారిపోయి, దీవి కొచివర ఉన్న దట్టమైన అరణ్యంలో దాక్కున్నాడని మరికొంత మందీ అనుకోసాగారు. అసలు జరిగిన దేమిటో ఎవరికీ తెలియలేదు. ఆ దీవిమీద ఉన్న ఒక్కొక్క క్షణం నాకు ఒక్కొక్క యుగంలాగా గడవసాగింది. రీతా కిమానీలు వదిలివెళ్ళిన నీడలాగా ప్రేతంలాగా అలా తిరుగుతూ ఉండేవాడిని. దట్టమైన అడవిలో ఒంటరిగా పిచ్చివాడిలా తిరిగేవాడిని. ఒక్కొక్కసారి రాత్రిళ్ళు కూడా అడవిలోనే గడిపివేసేవాడిని. రీతా మొసళ్ళ మడుగులో కలసిపోయింది. కిమానీ గాలిలో మాయమైపోయాడు. వాళ్ళిద్దరే ఎందుకు చనిపోవాలి? నేనెందుకు చావలేదు?

"ఒక రోజున అలాగే తిరుగుతూ ఉంటే నా వెనుక పొదలో ఏదో అలికిడి అయింది. ఏదన్నా మృగమేమో నని

తిరిగి చూశాను. అయినా ఈ అడివిలో మృగాలు లేవే! కాదు. అతడు కిమానీ.

"నేను నిర్భ్రాంతిపోయి చూస్తూ నిలుచున్నాను. అతను పిచ్చివాడిలా భయంకరంగా ఉన్నాడు. ముఖంనిండా వంటినిండా దుమ్ము. గడ్డం పెరిగింది. జుట్టు రేగింది. కళ్ళు చింత నిప్పుల్లా ఉన్నాయి. అతని చేతిలో ఒకబల్లెం ఉన్నది.

'నీవా!' అన్నాడు. ఆ స్వరంలో కోపం, స్నేహం, ద్వేషం, ఆప్యాయతా ఏమీలేవు. ఆశ్చర్యం కూడా లేదు. ఒక రకమైన నిర్వేదం ఉన్నది. 'భయపడకు. నిన్ను చంపనులే.'

'కిమానీ! నేస్తం? నీవు ఒకరోజున నాకు ప్రాణ మిచ్చావు. ఇవాళ తీసుకున్నా చింతించను. కాని ఒక ప్రశ్నకు జవాబు చెప్పు. రీతాను నీవే చంపావా?'

"కిమానీ వెంటనే జవా బివ్వలేదు - కొంత సేపు అలా నా ముఖంవంక చూస్తూ నిలుచున్నాడు. చివరకు నిశ్చలమైన స్వరంతో 'రేటు నేను చంపలేదు. తానే చనిపోయింది.' అన్నాడు.

'ఎందుకు? ఏం జరిగింది? నువ్వు ఏం చేశావు?'

'ఏమీ చెయ్యలేదు. మొగుడు పెళ్ళాన్ని ఏం చేస్తాడో అ దే చే శా ను. నువ్వేం చేశావో, అదే చేశాను.'

'మరి, మరి...'

"మా పెద్ది క్రొత్తకూడాకాదు. పెళ్ళి కాకపోయినా ఇక్కడి తప్పులేదు. కాని ఎందువల్లనో అయిష్టత చూపింది. నేను బలవంతం చేశాను. నిద్రపోయి లేచి చూసేసరికి లేదు' ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టుగా ఉంది కిమానీ కంఠం.

'నీ ప్రశ్నకు జవాబిచ్చాను. నేను కూడా ఒక ప్రశ్న అడుగుతాను, జవాబిస్తావా?' అన్నాడు.

'అడుగు.'

'ఈ దీవిలో నన్ను మించిన బలశాలీ, ఎవరూ లేడు. తెప్పను నడపటంలో, చేపలు పట్టటంలో, వేటాడటంలో నా కెవరూ సాటిరారు. ఆడపిల్లలంతా నే నంటే పడిచస్తారు. నువ్వు రానంతవరకూ రీతాకూడా అంతే. నీవు రీతాను ఏం చేసావు? ఏం మాయచేశావు? ఏం మత్తు మందు చల్లావు? చెప్పు! నేను ని న్నేమీ అనను-చెప్పు!'

'నే నేం చేయలేదు. కిమానీ నేస్తం! నా మాట నమ్ము. జరిగినదానికి నన్ను నేను ద్వేషించని రోజు లేదు. నేను అధముణ్ని-అయినా అంత అధముణ్ని కాదు. ముంచుకొస్తున్న ప్రళయానికి దూరంగా ఉందామని ఎంతో ప్రయత్నించాను కాని లాభంలేకపోయింది. నన్ను క్షమించు. నీవు క్షమిస్తేగాని భగవంతుడు నన్ను క్షమించడు.'

'మరి మరి...రీతాకు నీమీద అంత ఇష్టం ఎందుకు కలిగింది? నా మీద అయిష్టం ఎందుకు కలిగింది?'

'నేస్తం! స్త్రీ హృదయంలో రహ-

స్యాలు భగవంతుడుకూడా కనుక్కోలేడు. కాని నేను ఒకటి అనుకుంటున్నాను. మా భాషలో 'క్రొత్త ఒక వింత అనీ, పాత ఒక రోత' అనీ అంటారు దానినే మరో విధంగా 'పొరుగింటి పుల్లకూర రుచి' అని అంటారు. మనిషి ఎన్నడూ ఉన్నదానితో తృప్తిపడడు. అందని ద్రాక్షపండ్లకొరకు అర్రులు చాచటం మనుషులకు అలవాటు. లేకపోతే ప్రపంచంలో ఇన్నిబాధలు ఉండవు. వస్తాను మిత్రమా! సెలవు! నన్నుగురించి చెడుగా అనుకోకు. క్షమించు' అని తలవంచుకొని వెళ్ళిపోయాను. కిమానీ నావంకే చూస్తూ అలాగే నిలబడిపోయాడు.

"ఆ తరువాత కొద్ది రోజులకే ఆ దీవికి ఒక ఓడ వచ్చింది దానిలోఎక్కి ఎలాగో అష్టకష్టాలుపడి, నేను స్వదేశానికి చేరుకున్నాను."

అని చెప్పి కథ ముగించి తాతయ్య ఒకసారి ఉమ్మేసి, ఆరిపోయిన చుట్టపీక పారేశాడు. కుర్రవాళ్ళు ఒక్కసారి ఊపిరి పీల్చారు.

"ఈ కథ నిజంగా జరిగిందేనా తాతయ్యా !"

"నువ్వెప్పుడన్నా ఓడల కంపెనిలో పనిచేశావా తాతయ్యా !"

"అయినా సరదాగా ఏదో కథ చెప్పమంటే ఇట్లాంటి ఏడుపు కథలు చెబుతావేం."

"అదుగో, అదే వద్దన్నాను. కథ చెప్పమని ప్రాణాలు తీసి, కథ అయిపోగానే నానామాటలు అంటారా, ఏరు దాటి తెప్పతగలేసినట్లు !" అన్నాడు తాతయ్య.

"ఒరే, తాతయ్య ఇప్పుడంటే ఇలా ఉన్నాడుగాని, ఈడులో ఉన్నప్పుడు గొప్ప హీరోలేరా ! దేశదేశాల స్త్రీలను ప్రేమించాడు" అన్నాడు రాముడు. వాడీ విషయం మీద అథారిటీ ఆయె !

"అరె, అసలుసంగతి నేను చెబుతా వినండిరా ! మొన్న మంగళవారంనాడు తాతయ్య స్వంతపనిమీద గుంటూరు వెళ్ళాడు. అక్కడ లీలామహలులో 'మ్యూటినీ ఆన్ ది బౌంటీ' చూసివచ్చాడు. అదే కాస్త ఉప్పుకారం కలిపి మనకు చెప్పాడురా !" అన్నాడు శంకరాయి.

"ఛా ఛా ! వెధవల్లారా ! మీకు కథలు చెప్పటం నాదే బుద్ధితక్కువ" అని తాతయ్యదులబరించుకుని లేచిపొయ్యాడు.



# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

### జరిగిన కథ

*[సెనేటు సభ్యుడు అనంతయ్య కోరికపై కూతురు మాధవికి పాఠాలు చెప్పడానికి ఇంగ్లీషు లెక్చరర్ చక్రపాణి అంగీకరిస్తాడు. మాధవి అన్న కేశవరావూ తల్లి ఆదిలక్ష్మీ మేనమామ శ్యామసుందర్ విషయంలో ఘర్షణపడు తారు. వాళ్ళయింట్లో మాధవి పెళ్ళి ఓ సమస్యగా పరిణమించింది.*

*చక్రపాణిపై కొందరికిగల ఈర్ష్య కారణంగా అతనికి గల్గిన ప్రాణాపాయ కరమైన గాయాలనుండి అనంతయ్యకుటుంబం సహాయంతో కోలుకుంటాడు.*

*మాధవి పాణీవాళ్ళకుటుంబంతో తిరుపతి వెళ్ళడంవల్ల వాళ్ళకుటుంబంతో ఆప్యాయతా, పాణితో అనుబంధం ఏర్పడుతుంది. ఒకరి హృదయాలొకరు తెలియపరచుకుంటారు.]*

— ఇక చదవండి.

"ఏమో బాబూ, అవన్నీ నాకు తెలియవు. ఆ మాత్రానికే ఇంత దండకం చదువు తున్నారు — మరిప్పుడేమంటారు?" అంటూనే చేతిలో వున్న వుంగరాన్ని చటుక్కున ముందుకు వంగి చక్రపాణి కుడిచేతి వ్రేలికి తొడిగింది. అంతా లిప్తపాటు కాలంలో జరిగిపోయింది. చక్రపాణికి వారించడానికికూడా అవకాశం లేకపోయింది.

"బిందూ!" దిగ్భ్రాంతి జెందిన అతడు అంతకంటే మాట్లాడలేకపోయాడు.

"ప్లీజ్, మాష్టారూ, ఎంతగానో ప్రార్థిస్తున్నాను. తిరస్కరించవద్దు. ఒక్క మాటకూడ పౌరుషంగా మాట్లాడవద్దు." తన మృదు హస్తంతో అతడి నోటికి సున్నితంగా అడ్డుపెట్టింది మాధవి. "ఇన్ని తెలిసిన మీకు స్త్రీ కోర్కెలూ, హృదయమూ అర్థంకావా?"

"........."

విస్మయంనుండి తేరుకోని పాణి మాటాడనేలేదు.



"నన్ను పుష్పంతో పోల్చారు. నిజమే. కాని పుష్పం పుట్టినది ఆ వృక్షాన్నే వాడిపోవడానికి కాదు. ఆ జన్మకు సార్థకత్వం మరొకచోట. ఆఘ్రాణించడమే తెలియని అప్రయోజకుని పాదాలక్రింద నలిగిపోకుండా, హృదయశూన్యుల శిరోజాలంలో అర్థరహితంగా వాడిపోకుండా, పువ్వు పువ్వుకూ తిరిగే భ్రమరానికి అమాయకంగా మధు వర్షించి అనామకంగా అంతరించుకుపోకుండా, ప్రయోజన రహితంగా ముకుళించుకుపోకుండా తనను తాను దైవపూజకు సమర్పించుకోవడం నేరమా? క్రూరుడైన వేటగాని పాలబడకుండా మయూరి సహృదయ రాజాశ్రయం పొందడం అవివేకమా?"

"ఈ పవిత్రస్థలంలో చేసిన పని విజయవంతంగా ఫలిస్తుంది పాణిగారూ అందుకే పిక్నిక్ మానుకుని మీ వెంటబడి వచ్చాను. ఇక మన జీవితాలొక్కటే మనకు అన్నివిధాలా ఆ అలివేలుమంగా ఆ వెంకటేశ్వరుల అండ వుండినది. అదే మనకు కలిమి—బలిమి. బరువైన నిట్టూర్పు వదిలాడు చక్రపాణి, "నిజమే బిందూ, ఆ శ్రీనివాసుదే మనకు అండ. 'నేను మోయలేను, నాకు వ' ద్దని చేతులు ముడుచుకు కూర్చున్న నన్ను యిక్కడికి రప్పించి చెయ్యి లాగి దోసిట్లో ఆణిముత్యాన్ని కానుకగా ప్రసాదించిన ఈ తిరుపతిరాయుని కరుణ అపారం. ఇక నేను తిరస్కరించను. ఇకనుండీ మనం ఒకటే. ఇందుకు ఈ ఏడుకొండలవాడే సాక్షి." మనసారా అన్నాడు పాణి తన వ్రేలి ఉంగరం తిరిగి మాధవి వ్రేలికి తొడుగుతూ; .

ఆ అంగుళీయకంలోని 'నీలం' శిశిరాతపంలో ఒక్కసారి తళుక్కుమని చిత్రంగా, అందంగా మెరిసింది.

పరిపూర్ణ సంతృప్త మానసాలతో బసకు తిరుగుముఖం పట్టారు ఇద్దరూ, ఇంకా తమ కాటేజ్ అల్లంతదూరంలో వుండగానే పాణి నిలబడిపోయాడు.

"నువ్వు వెళ్ళిపో బిందూ, నేను తర్వాత వస్తాను" అన్నాడు.

"ఏం ?"

"ఇంతటిపనిచేసినదానవు ఆ మాత్రం ఊహించలేవూ ?" అంటూ నవ్వాడు మాధవి సిగ్గుతో తల వాల్చింది.

"వెళ్ళు, నే తర్వాత వస్తాను. ఇద్దరం కలసి వెళ్ళా మంటే అమ్మ అనుమాన పడుంది మనం కావాలనే ఇలా విడిగా వుండిపోయామని నిందించగలదు.

"నిజమేనండోయ్" అంటూ మాధవి తర్కించక వడివడిగా నడిచిపోయింది

## 17

అనిర్వచనీయానందతరంగాలు లాస్యం చేస్తూన్న మాధవి వదనం పరీక్షగా చూచింది జానకమ్మ.

"ఎక్కడికి వెళ్లావ్ ?" అనడిగింది అధికారపూర్వకంగా.

చిన్నగా నవ్వింది మాధవి. "నేను నిద్రలేచే సరికి మీరెవరూ లేరు మరి, తోచక అలా కాస్త దూరం నడిచాను. అప్రయత్నంగా అబద్ధం చెప్పేసింది. 'సర్లేదు ఇదంతా నిజమే. కాకుంటే మిగిలిన సగం దాచి పెట్టాను.' అనుకొని లోలోన సంతృప్తిపడింది—

"అబ్బాయి ఏడీ ?"

"యేమో ?" మరో అబద్ధం.

"అయినా ఒంటరిగా యివేం షికార్లమ్మా పరాయి ప్రదేశంలో ? నాకేం నచ్చ లేదు." విసుగుదల కనబరచింది జానకమ్మ.

నవ్వింది మాధవి. "పరాయిచోటు కాదండీ మాకు. ఇది మా వూరే. ఇది మా యిల్లే. తరచూ వస్తూంటాం. నా కీ ప్రదేశా లన్నీ సుపరిచితాలే."

ఆమెమాట పూర్తి అయ్యీ అవుతుండగానే చక్రపాణి ప్రవేశించాడు. "వచ్చారా ఆలయంనుంచి? పాపనాశనం వెళ్దామా ?" అంటూ.

"ఆఁ వెళ్దాం. ఆకాశగంగా, పాపనాశనం కూడా వెళ్లాలి." మళ్ళీ అధోరణిలో పడింది జానకమ్మ.

"ఒక్క పాపనాశనానికే టిక్కెట్లు తీసుకున్నానమ్మా. ఆకాశగంగకు వెళ్ళేం దుకు బాగా రెండుమైళ్ళు నడవాలిట. మీరు నడవలేరు. పాపనాశనానికీ నడవాలి కాని అంతకష్టంకాదు. ఓ ఫర్లాంగో, రెండు ఫర్లాంగులో నడిస్తేచాలు.

"అదేమిటి ? బస్సుటిక్కెట్లు తీసుకున్నారా ? మనకు కారుందిగా ?" అంది మాధవి.

"ఉందనుకో. కాని అ దార్లు మరీ పెద్ద 'కర్వ్సు' తిరిగి వుంటాయి. ఇంకా పెద్దపెద్ద కొండలు, రోడ్లకు 'స్లోప్' ఎక్కువ. నువ్వు నడవడం నా కిష్టంలేదు."

"ఎంతభయం? పోనీ నేను నడపడం భయమైతే డ్రైవ రున్నాడుగా ?"

"అట్టే తర్కించక తయారవ్వండి త్వరగా. మళ్లా మనబస్సు దాటిపోతే మరో బస్సుకు మార్పించుకోవడ మదీ గొడవ. వచ్చాక సాయంత్రం కొండ దిగి పోదాం. అన్నీ చూసినట్టేగా ?"

"ఇవ్వాళ్ళేనా? ఇంకా పాండవతీర్థ మదీ చాలా వున్నాయి చూడవలసినవి అంది మాధవి.

"ఫర్వాలేదు. మరోసారి చూడవచ్చు. నా కీక సెలవులేదు మరి. సాయంత్రం పెందరాళే కొండదిగి, దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామి ఆలయం, తిరుచా నూరులో అలమేలు మంగమ్మ ఆలయం చూచుకొని తెల్లవారుఝామునే తిరుగు ప్రయాణం ప్రారంభించుదాం."

"సరే. నడవండి త్వరగా'' అంది జానకమ్మ.

డ్రైవర్నీ, మోతీనీ, కారునూ ఇంటిదగ్గరే వదలి అందరూ పాపనాశనం బయ ల్దేరే బస్సులస్టాండుదగ్గరకు నడక మొదలెట్టారు.

ఇందిరా పద్మా కబుర్లు చెప్పుకుంటూ నడక సాగించారు, డ్రైవరుకు తాము వచ్చేవరకూ జాగ్రత్తగా వుండమని బోధిస్తూంది జానకమ్మ. పాణి తలుపు తాళం వేస్తున్నాడు. మాధవి గబగబా గారేజ్ ప్రక్కనున్న మిట్టమీది గంధంచెట్ల దగ్గరకు పరుగెట్టింది.

"ఏమి టది?" తాళం వేయడం పూర్తై అరుగు దిగిన చక్రపాణి మాధవిని ఉద్దేశించి కేకేశాడు.

ఇటుతిరిగి నవ్వి "వచ్చేస్తున్నా" అంటూనే ఎగిరివచ్చింది ఒక్కక్షణంలో బిందు.

"మా పద్మకంటె అల్లరిదానవు దొరికావమ్మా. అడుగడుగునా నిన్ను కాచుకో లేక చచ్చిపోతున్నాం. ఏమిటా తుప్పల్లోనూ, కొండలమీదా నీకు పని?" అంది జానకమ్మ సగం వాత్సల్యంతో, సగం మందలింపుతో.

నవ్వి ఊరుకుంది మాధవి.

జాగర్తగా జేబురుమాలులో మూటగట్టి హాంచ్‌బాగ్‌లో పదిల పరుస్తూన్న ఆ విత్తనా లేమిటో అర్థంకాలేదు చక్రపాణికి. "ఏమి టవి?" అనడిగాడు.

"చెప్పుకోండి చూద్దాం."

"ఏమో. అస్తమానం వచ్చేదానవు. ఈ కొండ లన్నీ నీ నేస్తాలే. అవి నీ కేం మరకత మాణిక్యాలు బహూకరించాయో మరి నా కేం తెల్సు"

"చాల్లెండి హాస్యం" బుంగమూతి పెట్టింది." అవన్నీ గంధంచెట్లు. ఆమాత్రం తెలియదూ? ఇవి వాటి విత్తనాలు. మంచిగంధం విత్తనాలు. తెలుసా? ఇంకా చెప్పాలా?"

"మొలుస్తాయా" కుతూహలంగా ప్రశ్నించింది జానకమ్మ.

"ఏమో. చూడాలి ఈసారి పట్టుదలగా. సరదాగా పోగుజేయడమేగాని ఎప్పుడూ అంత శ్రద్ధ తీసుకోలేదు నేను. సాధారణంగా మొలకిరెత్తవని అంటారు మరి మా అమ్మా వదినాను "

"నీ చేత్తో వేస్తే మొలుస్తాయిలే. ఈసారి వేసిచూడు" హాస్యంచేశాడు పాణి.

"ఓహో. ఎంచేతో?" కళ్ళు చక్రాల్లా త్రిప్పింది మాధవి. అది మళ్ళీ ఏవో గుర్తుకు వచ్చినట్లు. "అన్నట్టు— ఇందాకా మీరు 'మరకత మాణిక్యాలు బహూకరించాయా' అన్నారు కదూ? మరిచేపోయాను. ఇవ్వాళ్ళ ప్రొద్దున్న నాకొక అమూల్యమైన మణి దొరికిందండోయ్. ఈ కొండలు మంచి బహుమానమే ఇచ్చాయి నాకు" అంది పకపకా నవ్వుతూ.

"ఉష్" మెల్లగా చిరుదరహాసంతో మందలిస్తూ 'వినపడగలదు సుమా' అన్నట్టు కొద్ది ఎదర నడుస్తూన్న తల్లిని కళ్ళతోనే చూపాడు పాణి.

మాధవి బెదరినట్టు నవ్వు నాపుజేసింది.

" ఆ అధిక సంతోషంతో వున్న నీవు ఇవాళ కారు నడపడం క్షేమంకాదనే బస్సు టిక్కెట్లు తీశాను. అర్ధమైందా?" అన్నాడు తగ్గుస్వరంతో.

మాధవి చిరునవ్వే సమాధానం చేసింది. మాట్లాడలేదు.

"నా కివ్వాళ్ళ ప్రొద్దున లక్ష్మీదేవి కన్పించింది."

"ఎవరేమిటావిడ? మీ బంధువులా?" పరధ్యానంగా ప్రశ్నించింది మాధవి.

"నా గృహలక్ష్మి; నువ్వు చూడలా? నీకు పాణి దొరికినప్పుడే దొరికింది.

అప్పటికి అర్ధంచేసుకున్న మాధవి పకపకా నవ్వేసింది.

"అంత మెల్లగా నడుస్తున్నా రేమిటి?" ఎదర నడుస్తూన్న జానకమ్మ ఆగి వెను దిరిగి పిలిచింది. పద్మా, ఇందిరా కూడా నడక ఆపి నిల్చున్నారు.

"వచ్చేస్తున్నాం" పాణీ మాధవీ లిద్దరూ నడక వేగం హెచ్చించి త్వరత్వరగా వారిని కలుసుకున్నారు.

"అనవసర షికా ర్లెక్కువ, అవసరమైనప్పుడు మాత్రం పిల్లినడకలు. పదండి త్వరగా."

జానకమ్మ మాటలకు అందరూ ముసిముసినవ్వులు నవ్వుకున్నారు.

పాపనాశనగంగ ఇంకా చాలాదూరం ఉండనగానే బస్సుదారి ఆగిపోయింది. మహోన్నత గిరిశిఖరాలతో, అగాధా లైన లోయల్లో వుంది ఆదారి అంతా. పలు రాకాల మర్కట సమూహాలతో ఒక విధమైన కోలాహలంగా కూడా వుంది. లోయలలో పరుగు లెడుతున్న పాపనాశనగంగ గలగల నాదాలు శ్రుతి మనోహరంగా వినవస్తున్నాయి ఆ నిశ్శబ్దంలో.

బస్సు దిగి నడక సాగించారు. ఇరువంక వృక్షసమూహాలతో నున్న పర్వతశ్రేణులతో ప్రత్యేక సౌందర్యా లొలకబోస్తున్నది దృశ్యం. అనేకరకాల వానర సముదాయాలు విచ్చల విడిగా విహరిస్తున్నాయి. యాత్రికులను చేయిపట్టుకుని కూడా అడుగుతున్నాయి కొన్ని; బాట కిరుప్రక్కల అనేకమంది బిచ్చగాండ్రు; శనగ పప్పు, మరమరాలు అమ్ముతూన్నవారు కొందరు. 'విధాత వివిధ పకాల విన్యాస మొనరించుతూన్నట్లుం దిక్కడ' అనుకున్నాడు చక్రపాణి నిమ్నోన్నతాలతో నున్న ఆ రాతిమెట్లబాట నధిగమించుతూ.

''ఇక్కడ ఫోటోలు తీసుకుందామా?'' అంటూ వెనుదిరిగిన చక్రపాణి మాధవిని చూచి ఒక్కక్షణం నిశ్చేష్టుడై తిరిగి మిగిలిన అందరు యాత్రికులతోపాటు పకపకా నవ్వేశాడు.

శనగపప్పు కొని పైటచెంగులో పోసుకుని కొద్ది కొద్దిగా జల్లుతోంది. కోతులు ఆ పప్పు తీసుకు తింటున్నాయి. చాలామంది యాత్రికులు అదేపని చేస్తున్నారు. కాని ఆ కోతులకంటె కొంటెగుణం కల మాధవి కుదురుగా వుండలేక దగ్గరగా వచ్చిన ఒక వానరాన్ని పప్పు ఇచ్చి ఇవ్వకా అశజూపి కవ్వించసాగింది. అసహనం పెరిగి పోయిన ఆ కపిరాజు ఆగ్రహంతో మాధవి చెయ్యి పట్టుకుంది. భయవిచలిత అయి పోయి మాధవి కెవ్వున కేకపెట్టి చెయ్యి లాక్కుని గెంతింది దూరంగా. ఆ తడబా టులో ఒడిలోని శనగపప్పు అంతా క్రింద ఒలికిపోయి ఆ కోతి దృష్టిని తనపైకి మళ్ళించుకుంది. కాస్త ఖంగారు సర్దుకుని, క్రింద పడిపోయిన హ్యాండుబ్యాగ్ తీస కుని ఎదరఉన్న పాణీ పద్మా ప్రభృతుల దగ్గరకు పరుగెట్టింది మాధవి.

"కోతులదగ్గర కొంటెతనం పనికిరాదు బుల్లెమ్మా" యాత్రికులలో ఎవరో అన్నారు.

"ఇక్కడి కోతు లేమీ హాని చెయ్యవు. భయపడకమ్మా'' మరొకరు.

"భయపడ్డావా? అయినా నేను అడుగడుగునా అఘోరిస్తూనే వున్నాను– 'కుదు రుగా వుండవే పిల్లా' అని'' అంటూ జానకమ్మ మాధవి వీపు తట్టింది. ఈసారి భయం పోయి సిగ్గు ఆవరించింది మాధవిని – అందరి ఎదుట ఆలా తన పిరికితనం వెల్లడైనందుకు.

అది గమనించిన పాణి ఆమె మనస్సు మళ్ళించటానికి అన్నాడు. "భయం దేనికిలే. వాటిలాగే అల్లరి చేస్తూంటే స్వజాతే నని భ్రమపడిన ట్లుంది. షేక్హేండ్ ఇచ్చింది నీకు. కెమెరా నా దగ్గ రుంటే ఓ ఫోటో తీసేద్దును మరి.''

ఆ హాస్యానికి చప్పట్లుకొడ్తూ ఎగిరెగిరి నవ్వారు ఇందిరా, పద్మా, 'కోతి షేక్ హాండ్ ఇవ్వడం, టాటా చెప్పడం; ఇంకేం బాగుంది :' అంటూ.

"మహా ఎగతాళి!'' చిరుకోపం ప్రదర్శించింది మాధవి. ఇందరిలో నేనే మర్యా ఎలు తెలిసినదానిలా కన్పించానేమో దానికి! అది ఆలోచించండి'' తనను తాను గర్వంగా సమర్థించుకుంటూ మళ్ళీ అందరిలో కలసిపోయి మామూలు మనిషై పోయింది.

పాపనాశన ధార దగ్గర పూజ చేసి హారతి యిచ్చారు. పెద్ద పర్వత భాగమైన గండశిల మీదుగా సుమారు ముప్ఫై నలభై అడుగుల వెడల్పున హోరుమనే శబ్దంతో



సంతత ధారాపాతంగా జాలువారుతూన్న ఆ గంభీర జలపాత దృశ్యాన్ని రెండు మూడు కోణాలలోనుండి ఛాయాచిత్రాలు తీసింది మాధవి. అక్కడ యాత్రికులు చాలామంది స్నానాలు చేస్తున్నారు కాని వీ రెవరూ చేయలేదు. ప్రయాణంలో ఫోటోలగురించి విసుగుకున్న జానకమ్మ ఇవ్వాళ ఏ విధమైన అభ్యంతరం చెప్పకుండా సంతోషంగా అందరితోపాటు అక్కడ ఫోటో తీయించుకుంది.

"మా అమ్మని మీరు బాగా మార్చేశారు'' అంది ఇందిర నవ్వుతూ మాధవితో. మాధవి నవ్వి ఊరుకుంది.

''సహవాస ఫలితం అంటా రిందుకే" అన్నాడు చక్రపాణి.

మీరు ఎప్పుడూ యిలా మాతో- మా యింట్లో ఉండిపోతే బాగుండును" అంది ఇందిర చటుక్కున.

మాధవీ చక్రపాణు లిద్దరూ ఉలిక్కిపడి ముఖముఖాలు చూచుకున్నారు. వెంటనే తేరుకున్న పాణి ''అదేంమాటే ఇందూ? ఏమైనా ఆలోచించి మాట్లాడావా?" అన్నాడు.

"ఏమో? ఏమిటో అలా అన్పించింది నాకు. అర్థం నాకే తెలియదు" అంది ఇందిర.

జానకమ్మ మాధవిని నఖశిఖ పర్యంతం చూస్తూ అంది ఇందుతో. ఈ మహాలక్ష్మిని మన బీదకొంప ఒక్క నిముషం భరించగలదామ్మా? ఏ ఇల్లు తపస్సు చేస్తోందో ఈ పాదాన్ని ప్రవేశపెట్టుకోవడానికి! మనలాటివాళ్ళ కంత అదృష్టమెక్కడ?"

మాధవి విననట్టే ముందుకు నడచింది.

'ఆ పిల్లతో అంత చనవేమిటని విసుక్కున్న అమ్మేనా యింత యిలా మాట్లాడుతూం' దని ఆశ్చర్యపోయాడు చక్రపాణి.

## 28

మాధవి యిల్లు చేరగానే ఏదో పెద్ద గాలిదుమారం లేవదీసి ఆదిలక్ష్మి గొడవ జేస్తుం దని భయపడ్డాడు అనంతయ్య. కాని అసలు ఆమె ఎక్కడా ఆ గొడవే ఎత్తకపోవడం, కూతుర్ని ఎప్పటికంటె ప్రేమాదరాలతో లాలించడం చూచి అనంతయ్య కేశవరావు లిరువురూ ఆశ్చర్యపోయారు. శ్యాం, అంత అవమానం జరగాకకూడా, యిల్లు విడిచి వెళ్ళకపోవడం మరొక ఆశ్చర్యకరమైన విషయంగా వుంది వారికి.

తన వినోదాల విషయంలోను చదువు విషయాలలోను నిత్యం యుసరుసలాడుతూ విసుక్కునే తల్లి ఎందు కింత ప్రేమగా ప్రవర్తిస్తోందో అర్థంకాలేదు మాధవికి. అడుగడుగునా వెనువెంట తిరుగుతూ బెదిరిస్తూండే శ్యామసుందర్‌లో అంత సరళత్వం ఎప్పుడు ఏ విధంగా ప్రవేశించిందో కూడా అర్థం కాలేదు; కాని ఊహించగలిగింది. "బహుశః మంచిగానే నన్ను సాధించాలని అనుకున్నారేమో!" ఆ ఆలోచన రాగానే నవ్వు వచ్చింది. 'ఇంకేం సాధిస్తారు? తానూ పాణీ అన్నీ నిర్ణయించేసుకొంటే?' ఆ వెనువెంటనే ఒక భయంకూడా ఆవరించింది 'నా కోరిక నాన్నగారికి ఎలా తెలియపరచడం? నాన్నగారు ఆమోదిస్తారా? ఒకవేళ అంగీకరించకపోతే అప్పుడు నేనేం చేయవలసి ఉంటుంది? నా కర్తవ్యమేమిటి?' ఈ ఆలోచనలతోనే రాత్రింబవళ్ళు సతమత మైపోవజొచ్చింది.

కాలేజీకి వెళ్తే రకరకాల హాస్యాలు వినవస్తున్నాయి స్నేహితురాండ్రనుండి. ఒక రోజున రుక్మిణి చనవుగా ఎదుటే అనేసింది; "ఏమే బిందూ! చక్రపాణిగారితో కలసి షికార్లు ఎక్కువయ్యాయట? మాకు చెప్తే వెంటబడతా ననుకున్నావా? పోనీలే దాచుకో.

మాధవి సిగ్గుతో మాట్లాడలేక పోయింది.

"ఏమే, అయితే మాష్టారికి నువ్వంటేయిష్టమేనా? నీతో బాగా మాట్లాడుతారా?"

రుక్మిణి తరచి ఆడగడంతో ఇక మాధవి దాచుకోలేకపోయింది. రుక్మిణికి అంతా చెప్పేసి, "ఇప్పుడు నే నేం చేయనే? అమ్మకూ నాకూ ఆదిలోనే పచ్చెదురు. మా మామయ్యనుచేసుకోమని అడుగడుగునా వేధింపుతుంది. ఇక నాన్నగారు—ఆయనకు



నే నంటే ఎంత యిష్టమైనా ఈ విషయం వినగాన మండిపడతారేమో నని భయంగా వుంది ఏమీ తోచడంలేదు."

"అబ్బ, అమాయకంగా వుంటూ ఎంతపని చేసేశావ్? అంతటి చక్రపాణి గారినే వలలో వేసేసుకున్నావు. ఘటికురాలవే" అంటూ ఆశ్చర్యం ప్రకటించింది రుక్మిణి. ఒక పని చెయ్యి. మీ వదిన చాలా మంచిదికదూ! ఆమెతో చెప్తే మెల్లగా మీ అన్నయ్యతో చెప్తుంది."

"అబ్బ, నాకు సిగ్గే" అంటూ ముఖం రెండు చేతులతోనూ కప్పుకుంది.

"పోనీ నేను చెప్తాలే. సరోజినిగారిదగ్గరా. కేశవరావుగారిదగ్గరా నాకు నీకంటే ఎక్కువ చనువు."

"నాకు భయంగా వుందే రుక్మిణీ."

"ఓస్ పిచ్చి, భయం దేనికే? ఊరికే గంతులేయడమా మరి? ఇటువంటి అవసర విషయాలలోనే ధైర్యంగా వుండాలి. నేను చెప్తాగా అన్నయ్యతో. నువ్వు ధైర్యంగా వుండు"

అంతలో వెంకటేశం రుక్మిణికోసం రావడంవల్ల సంభాషణ ఆగిపోయింది అతడితో ఇంకా అతడి స్నేహితులు నలుగురైదుగురు వున్నారు. వారిలో శ్రీహరీ, కరుణాకరమూ కూడా వున్నారు.

"నమస్కారం. ఎట్లా చదువుతున్నారండీ?' అని ప్రశ్నించాడు మాధవిని కరుణాకరం చిరుదరహాసంతో.

అతడి సరసధోరణికి లోలోన ఆశ్చర్యపోయింది మాధవి. 'అల్లరి చిల్లరిగా వుండే ఇతడిలో యింత మార్పు తెచ్చిన చక్రపాణిగా రెంత గొప్పవారు!' అనుకొంటూ లోలోపలే అంజలి ఘటించింది అతడికి.

"ఏదో మామూలుగానే. మీరు బాగా చదువుతున్నారా?" అనడిగింది తిరిగి అతడిని

అతడు నవ్వాడు "ఏదో అంతంతమాత్రమేలెండి. కాలేజి డే ఇక వారంరోజు లేగా వున్నది! నాటకాలూ రిహార్సల్స్‌లో పడిపోయాం. వారం పదిరోజులనుండి పుస్తకం తియ్యడం లేదంటే నమ్మండి"

"ఇంతకూ మీరు కాలేజి డేకి ఏమీ పేరివ్వలేదేమిటి ప్రతి ఏడూ నాటకంలో వేషం వేసేవారేమో-" అనడిగాడు శ్రీహరి

మాధవి నవ్వి ఊరుకుంది

"అవునే బిందూ. బొత్తిగా అంత మందకొడితన మేమిటి? నాటకంలో ఎందుకు

వెయ్యావు నువ్వు ? ఆ రోజున మన ఆడపిల్లలు రెండు నాటకాలు వేస్తున్నారు. ఒకదానిలో నువ్వు లేకపోవడ మేమిటి ?" అంది రుక్మిణి.

"పోనీ ఎవరినైనా తప్పించేద్దాం. మీరు ఆ పాత్ర తీసుకుందురుగాని" అన్నాడు సెక్రెటరీ.

"వద్దండీ, పాపం ముందు తీసుకున్నవాళ్ళని నాకోసం తప్పించడ మేమిటి ? ఎవరి సరదా అయినా ఒకటేగా ? అయినా నా కంత పట్టుదలగా వెయ్యాలనీ లేదు." అన్నది మాధవి.

కరుణాకరం నవ్వుతూ అన్నాడు: "నాలోనేకాదు. మీలోనూ చాలా మార్పు వచ్చింది. చక్రపాణిగారి ప్రభావం ఒక్కొక్కరిపై ఒక్కోవిధంగా పనిచేస్తూంది."

ఉలిక్కిపడి చూచింది మాధవి అతడి ముఖంవైపు. కాని ఆ వదనంలో స్నేహ పూర్వక హాస్యమేగాని ఎగతాళి కన్పించకపోవడంతో తృప్తిపడి ఊరుకుంది.

"అప్పుడు మిమ్మల్నడుగుదామంటే మీరు ఊళ్ళో లేరండీ." నొచ్చుకుంటూ అన్నాడు సెక్రెటరీ. "నాటకం కాకుంటే పోనీ మరొకటి. ఏదో ఒక విషయంలో పార్టిక్ చేయండి."

నవ్వింది మాధవి. "నేను శుద్ధమొద్దును. నాకు సంగీతం రాదు, నాట్యం రాదు కనీసం అందరూ తేలికగా పాడే సినీమాపాటలైనా పాడలేను. ఇంకేం చెయ్యను ?"

"నేను చెప్పనా ?" రుక్మిణి అంది. "పోనీ ఫ్యాన్సీడ్రెస్ వెయ్యి."

"అవును. అలా చేయండి" రుక్మిణి సలహాను అందరూ బలపరిచారు.

కొంచంసేపు ఆలోచించింది మాధవి. "సరే, అయితే ఏం వెయ్యమంటారు ?" అని అడిగింది.

అందరూ ఆలోచించి కడకు తేల్చారు "ఏముంది : ఆడవాళ్లు తేలికగా వేసే వేషం 'సోదమ్మ' ఉందిగా ?"

"పోనీ అందరూ వేసేదే ఎందుకు అందులోనే కొద్దిగా మార్పులు చేస్తాను కూరగాయలమ్మ వేషం వేస్తాను."

"సరే !" మాధవి మాటను అందరూ ఆమోదించారు.

"ఎప్పుడూ వేసే వేషాలనుంచి నేనూ కొంచం మార్చాను లెండి. ఈసారి పళ్లపుల్లలమ్మే అచ్చివేషం వేస్తున్నాను. ఎప్పుడూ సున్నంగుల్ల అమ్మే మనిషి జ్యోతిష్కుడు, బిచ్చగాడు-ఇటువంటివే వేస్తున్నాం అవి పాతబడిపోయాయి" అన్నాడు శ్రీహరి.

అలా కొంతసేపు ఇష్టాగోష్టిగా సాగినతర్వాత ఎవ రిళ్ళకు వారు దారితీశారు

"చీకటిపడింది. మీ యింటివరకూ రమ్మంటారా ?" అడిగారు శ్రీహరి, కరుణా కరంకూడ.

"థాంక్స్, వద్దండీ. నాకోసం కారు వస్తుంది" అంది మాధవి.

"చూశారా మన మాష్టారి ప్రభావం వీళ్ళమీద ?" అంటూ నవ్వాడు వెంకటేశం. "అల్లరివాళ్ళిద్దరూ అతి మంచివాళ్ళైపోయారు" అంటూ వాళ్ళతో కలిసి తానూ వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోతూన్న ఆ నలుగుర్నీ చూస్తూ అంది రుక్మిణి. "వాళ్ళు మనల్ని గేలి చేయడం, మనం వాళ్ళని తిటుకోవడం నానా చికాకుగానూ వుండేది ఇదివరలో. చక్రపాణిగారి ధర్మమా అని అంతా కలిసిమెలిసి సరదాగా ఒక యింట్లో పిల్లల మాదిరిగా ఉంటున్నాం. తరగతిలో విద్యార్థుల మందరం. కాలేజీ కొక్కరైనా చక్రపాణిగారివంటి ఉపాధ్యాయు డుంటే కాలేజీ లన్నీ బాగుపడిపోను."

నవ్వింది మాధవి. "నువ్వేప్రిన్సిపాల్ వో, వైస్ ఛాన్సలర్ వో అయితే పాణిగారి కొక డాక్టరేట్ బిరుదు పారేద్దువన్నమాట," అని హాస్యోక్తులాడుతూనే మెల్లగా నడకసాగించింది.

"అదేమిటే ? మీ కారు వస్తుందన్నావ్ ; నడచిపోతున్నావేం ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది రుక్మిణి.

కొంటెగా తమాషాగా చూచింది మాధవి. "అంటే రాదన్నమాట. ఆలస్య మౌతుంది కారు పంపక్కర్లే దని చెప్పిమరీ వచ్చాను" అంటూ కొంటెగా నవ్వింది.

అయోమయంగా చూచింది రుక్మిణి. "తిరుపతిలో మాష్టారు నీ మతి పోగొట్టేశా రేమిటి ? ఏమి టా మతిమాలిన ధోరణి ?"

"మరేను, ఇప్పుడు మళ్ళీ ఆ మతి కాస్తా ఆయన దగ్గర్నుండి తిరిగి తీసుకుందా మనే వెళుతున్నాను. "సాయం వస్తావా ? ఈ వీధి చివర్నేగా ? మళ్ళీ వచ్చేద్దువుగాని."

అర్థమైంది రుక్మిణికి. "నువ్వు ప్రాణేశ్వరుడిని కల్సుకుందుకు వెళ్తూంటే మధ్యన నే నెందుకు ? వెళ్ళిరా. గుడ్ విషెస్" చెయ్యి ఊపింది రుక్మిణి.

మాధవి 'గుడ్ బై' చెప్తూ సాగిపోయింది.

"ఎంతదానవే ? వదిలిందే చాలనుకుంటున్నావా ? నీ కసలు నేను రావాలని ఉంటేగా ?" అని వెనుకనుంచి రుక్మిణి అనడం మాధవి వినకపోలేదు.

మాధవి మెట్లెక్కుతూండగా ఎక్కడికో వెళ్ళిపోతూన్న పద్మ ఎదురైంది.

"మనం ఆ రోజునుండీ మళ్ళీ కల్సుకోనేలేదు. రా పద్మా. కాస్సేపు కూర్చుందాం" అంది మాధవి.

కాని పద్మ ఇబ్బందిగా పెట్టింది ముఖం. "నాకు పనుందండీ. లోపలికి వెళ్ళి కూర్చోండి. మా అమ్మా వాళ్లూ గుళ్ళోకి వెళ్ళారు. శివరాత్రికదూ? ఈ పాటికి వస్తూంటారు" అంటూనే సాగిపోయింది.

"అయితే మరి లోపల ఎవరున్నట్టు? ఇందిర ఉందా?" అంటూ లోపలికి వెళ్ళింది మాధవి. చావడి దాటి లోపలికి వెళ్తూనే ప్రక్కగదినుండి వినవస్తూన్న సంభాషణకు విస్మయంతో ఠక్కున ఆగిపోయి నిల్చుని వినసాగింది.

ఒకటి పాణి గొంతు; రెండవది శ్యాంసుందర్‌ది. సందేహంలేదు.

"ఇంతకూ ఏమిటి మీకు నాతో పని?" చక్రపాణి కంఠం.

రెండవ వ్యక్తి హేళనగా నవ్వడం విన్పించింది. "ఎందుకో నీకు తెలియదా! తెలిసో తెలియకో నాదారి కడ్డువచ్చావు కానీ మర్యాదగా తప్పుకొమ్మని. హెచ్చరిస్తున్నాను. పాముతో చెలగాటం పనికిరాదు, తెల్సుకో!"

తిరస్కారంగా నవ్వాడు చక్రపాణి. "పాము కాటు వేయడమే విన్నాంకానీ, కాటువేసినా తన విషం పనిచేయలేదని ఇలా కాళ్ళబేరానికి రావడంమాత్రం ఎక్కడా వినలేదు, కనలేదు."

"ఓ! ఎగతాళి కూడ చేస్తున్నావే? ఏమిటా డొంకతిరుగుడు సమాధానం?" శ్యాం గర్జన!

"మిష్టర్ శ్యాం" తీవ్రంగా విన్పించింది చక్రపాణి కంఠం," అనంతయ్యగారిపై మందే గౌరంవల్లనే యింతవరకూ నీతో మాట్లాడాను. నువ్వెవరు? నేనెవరు? నీతో మాట్లాడవలసిన అవసరం నాకు లేదు, గెటౌట్."

"ఓరేయ్ పాణీ. ఎవర్నో తెలుసా? ఒళ్లు దగ్గరపెట్టుకు మాట్లాడు."

"అహా, బాగా తెల్సు. చీకటి చాటున నిర్దోషుల బుఱ్ఱలు బ్రద్దలు గొట్టించే ప్రయోజకుడ వని బాగా తెల్సు."

"శ్రోత మేను ఒక్కసారిగా ఉలిక్కిపడింది."

"అఁ!, అయితే కనిపెట్టావన్నమాట?" ఆశ్చర్యంగా చలించినట్టు ధ్వనించింది శ్యాం గొంతు,

"కనిపెట్టడ మేమంత కష్టమైనపని? అప్పుడే కనిపెట్టాను. నాకు తెలియ దని విఱ్ఱవీగుతున్నావ్! నీవంటి అల్పుడినే అయితే నా బతుకు బయలు చెద్దును నాలో అంత నీచత్వం లేదు; నీపై నాకు కోపం, పగా లేవు. నాతో నీకు ఈ వైరం దేనికో అర్ధం కావడం లేదు. అసలు నీకూ నాకూ ఏమిటి దోస్తి?"

"తెలియనట్లు నటించకు. తెలివైనవాడివైతే నిన్ను కొట్టించిన దెందుకో గ్రహించుకుని ఈసరికే నా మార్గంనుండి విష్క్రమించివుందువు. ఇప్పుడైతేనేం - విను. మాధవి నా కాబోయే భార్య. పుట్టినప్పుడే నిర్ణయమైపోయింది. తెలిసో తెలియకో అది వేషాలేస్తూంటే నువ్వుకూడా "సై" అంటున్నావా, దానితో నీకు విహారాలా,



జాగ్రత్త. మళ్ళీ మా గడప త్రొక్కకు. మాధవి పేరెత్తావా మరి నీ ప్రాణా లుండవు"

'షటప్" చాలా కఠినంగా, ఆగ్రహంతో ధ్వనించింది పాణి స్వరం. 'ఇక అధికంగా మాట్లాడకు. గెటౌట్ ఆఫ్ మై ప్రెజెన్స్, కల్చర్‌లెస్ బ్రూట్"

"నోరు ముయ్యవోయ్. మహా ఇంగ్లీషు నీకే వచ్చు ననుకుంటు న్నావు. నేను హెచ్చరించిన విష యము గుర్తుంది కదూ ? మళ్ళీ మా మాధవితో మాట్లాడకు."

"షటప్ ఐ సే, అనంతయ్యగారి అమ్మాయికి నేను ట్యూషన్ చెప్తున్నాను. మధ్య నీబోటి నీచుడి ప్రమేయం అనవసరం."

"సరే. నీ పొగరంతా అణి చేస్తాను. జాగ్రత్తగా వుండు. ఆ రోజు నీ కింకా నూక లుండిపోవ డంవల్ల చావు తప్పింది" అంటూ నిష్క్రమించాడు శ్యాంసుందర్.

మాధవి చటుక్కున గుమ్మం చాటుకు తప్పుకుంది. ఆమెను చూడకుండానే శ్యాం సాగి పోయాడు.

కొద్దినిమషాలలాగే మౌనంగా నిలుచుండిపోయింది మాధవి. విన్న విషయాలన్నిటికీ ఆమె అంతరంగం ఆర్తితో అవమా నంతో కుంచించుకు పోసాగింది. అటువంటి అసహ్యకర పరిస్థితిలో చక్రపాణిని కల్సుకోవడం ఇష్టం లేక మెల్లగా బయటకు వెళ్ళి పోయి గృహాభిముఖురాలైంది.

ఫాల్గుణం ప్రవేశించడం వలన చలి కొంచం వెనకబట్టింది కృష్ణ పక్షపు చతుర్దశి కావటాన ఎక్కడా



చంద్రుని జాడలేదు. ఆ చీకటిలో టాక్సీస్టాండువరకూ నడచేకంటె వీధిమలుపులో రిక్షా కట్టించేసుకుందా మనే ఉద్దేశ్యంతో నిల్చుని రిక్షాకోసం చూస్తున్న మాధవికి పరిచితకంఠాలు విన్పించాయి.

"ఇందిరా ?" అని ఆశగా పలకరించింది.

"ఎవరూ ?" అంటూ ఇందిరా జానకమ్మా తిరిగి ప్రశ్నిస్తూ దగ్గర కొచ్చారు

"నువ్వామ్మా బిందూ ? ఇక్కడున్నావేమిటి ?" అని ప్రశ్నించింది జానకమ్మ

"రుక్మిణిగారింటి కొచ్చానండీ. మీ యింటి కొస్తే 'ఎవరూలేరు, ఆలయానికివెళ్లా రని చెప్పింది పద్మ."

జానకమ్మ చాలా నొచ్చుకుంది ఆ విషయం విని. "అదేమైంది ? మేం లేమని చెప్పి నిన్ను మర్యాద చెయ్యకుండా వెళ్ళిపోయిందా ? తెలివితక్కువది. లెక్క జేసుకోకమ్మా, లోపలికి వెళ్ళలేకపోయావా, మీ మాష్టా రున్నారుగా లోపల ?"

మాధవి మౌనం వహించింది.

"రా. వెళ్దువుగానిలే. ఆ ప్రయాణంలో తప్ప మళ్ళీ నిన్ను చూడనేలేదు. ఒక్క సారి ఇంటికిరామ్మా, కాస్సేపు కూర్చుని వెళ్దువుగాని."

"ఎందుకులెండి, వెళ్ళిపోతాను."

"అలాకాదు తల్లీ ఒక్కసారి రా. శివరాత్రిమూలాన ఆలయానికి వెళ్ళాను లేకుంటే ఇంటిదగ్గర ఉండేదాన్నే."

"రండీ, ఒక్కసారి" అంటూ ఇందిర చేయి పట్టుకుంది.

మరి కాదనలేకపోయింది మాధవి. "సరే, నడవండి. మీరు ఊరుకుంటారా ? నాకూ చూడా లనే వుంది కాని ఈ ఇరవై రోజులనుండీ ఏమిటో అలా అశ్రద్ధ అయిపోయింది."

ముగ్గురూ నడక సాగించారు. చికాకుగా వున్న మాధవి మనసు కాస్త తేరుకో సాగింది.

ఆలయానికి మీ అమ్మగారూ, నాన్నగారూ, సరోజినీకూడ వచ్చారు. పాపం. మీ నాన్నగారికి ఎంత అపేక్ష మేమంటే ? ఎంత ఆదరంగా మాట్లాడారు !"

"పర్వదినాలలో అమ్మా నాన్నగారూ చాలా శ్రద్ధగా చేస్తారులెండి పూజలు ఆలయానికి వెళ్తారు వదినకుకూడా భక్తి ఎక్కువే" అంది మాధవి.

"కాదుమరి ? ఉండవలసిందే అయితే రుక్మిణిఇంటికి వస్తూనేవుంటావు కదూ ? కాస్త ఓసారి లా రాకూడదటమ్మా ? తిరుపతినుంచి వచ్చాక మళ్ళీ నిన్ను చూడనే లేదు. అబ్బాయిని అడుగుతూంటే 'కాలేజీకి వస్తూనే వుం'దని చెప్పాడు "

''ఏమిటోనండి, అశ్రద్ధ అయిపోయింది. ప్రయాణంనుండి వచ్చిన రెండు మూడు రోజులవరకూ అలసట తీరదుకదా ? ఆ తర్వాత వ్యాపారసంబంధమైన పని మీద నాన్నగారు మద్రాసు వెళ్ళారు. పెద్దన్నయ్య ఏదో పనిమీద వైజాగ్ వెళ్ళాడు మొత్తంమీద రెండుకార్లూ లేవు. నాకు నా కారుంటేనేకాని ఎక్కడికీ వెళ్ళబుద్ధి కాదు. అంతా వచ్చి రెండురోజులే అయ్యింది."

"అయితే మీకు ప్రత్యేకంగా ఒక కారు ఉందా ?'' ఆశ్చర్యంగా అడిగింది ఇందిర

నవ్వింది మాధవి "మనం – తిరుపతి వెళ్ళిన కారు నాదే. అదంతా ఒకకథలెండి ఒకసారి చిన్నన్నయ్యా నేనూ కారు 'నా' దంటే 'నా'దని పోట్లాడుకున్నాం నాలు గేళ్ళక్రిందట. తను సినీమాకు వెళ్లాలనీ, నేను షికారుకు వెళ్లాలనీ – ఒకేసమయంలో దానితో పట్టుదలలు పెరిగి పోట్లాడుకుని ఫిర్యాదు నాన్నగారివరకూ వెళ్ళింది ఫలితంగా నాకు ప్రత్యేకంగా ఒక కారు వచ్చింది నెల తిరిగేసరికి."

ఆశ్చర్యంగా విన్నారు ఇందిరా, జానకమ్మా. "ఎన్ని నోములు నోచి పుట్టావో ఆ ఇంట్లో ! అంత అపురూపంగా పెరుగుతున్నావు'' అంది జానకమ్మ.

"ఇదేమిటీ ? మీరు ముగ్గురూ ఎక్కడ కలిశారూ ?" అనడిగాడు చక్రపాణి ఆ ముగ్గురూ లోపల ప్రవేశించగానే.

అతడి వదనం ప్రశాంతంగా, చిరుదరహాసం చిందులాడుతూ ఎప్పటిమాదిరిగా వుండడం చూచిన మాధవి తృప్తిపడింది.

కొద్దిసేపు కూర్చున్నాక మాధవి వెళ్తానని లేచింది.

''ఎలా వెళ్తావు ? కారులో రాలేదేం ?" అనడిగాడు పాణి.

సంగతి విన్నాక, "ఉండు; కొంచంసేపు కూర్చో. టాక్సీ పిలుస్తాను"అని మాధవి వారిస్తున్నా వినకుండా వెళ్ళి తెచ్చాడు.

''ఎప్పుడైనా వస్తూండమ్మా" అని మాధవి బుగ్గలు నిమురుతూ ఆప్యాయంగా కారువరకూ సాగనంపుతున్న తల్లిని చూచి విపరీతంగా ఆశ్చర్యపోయాడు చక్రపాణి. 'మడీ దడీ అంటూ మాధవిని అసహ్యించుకుని దూరందూరంగా తిరిగిన ఆమేనా ఈ అమ్మ !'

"మీరూ వస్తారా ? ఎందుకు శ్రమ ? అక్కర్లేదండీ'', అంది మాధవి కారెక్కు తూన్న చక్రపాణిని. మాటవరసకు జానకమ్మ ఎదుట అన్నదేకాని 'వస్తే బాగుండు' నని ఆమెకూ అన్పించింది. ఆమె అంతర్గత వాంఛకు తగినట్టుగానే చక్రపాణి ఆమె వారింపు చెవినిబెట్టి కారెక్కాడు.

"దిగవిడిచి వస్తాడు. లేకుంటే ఒక్కడెవ్వా తిరగడ మేమిటి? త్వరగా వచ్చేయి బాబూ" అంటూ జానకమ్మకూడ చక్రపాణి పనిని సమర్థించింది.

"ఎలాగైనా మీ అమ్మగారు చాలా మారారు'' అంది మాధవి చక్రపాణితో, కారులో.

"ఊఁ!" పరధ్యానంగా ఉన్న పాణినుండి అంతకంటె సమాధానం రాలేదు

మాధవికూడ అంతకుముందు జరిగిన సంఘటన మనస్సులో మెదుల్తుండగా సంభాషణను మరి పొడిగించలేదు.

ఇంటిదగ్గర దిగిపోతూ "రండి మాష్టారూ. నాన్నగారికి కన్పించి వెళ్దురుగాని" అంది మాధవి.

"మరోసారి వస్తానులే."

"ఏం ? ఇప్పుడేం ?''

"అబ్బ. వెళ్లూ లోపలికి. నే నాయన దర్శనం ఎప్పుడో చేసుకుంటానుగా. నీ కెందుకు ?" అంటూనే కారును పోనిమ్మన్నాడు.

సాగిపోతూన్న కారును అలా విస్మయ విచారంతో చూస్తూ నిల్చున్న మాధవి, కొంత సేపటికి అటువచ్చిన కేశవరావు పలకరింపుతోగాని ఈ లోకంలోకి రాలేదు.

"ఏమిటే చీకటిలో అలా నిల్చున్నావు వీధిలో ?" అనడిగాడు.

"ఏమీలేదు" అంటూ మెల్లగా లోపలికి పోయింది మాధవి. కేశవ్ ఆశ్చర్యపోయినా అప్పటికి మరి మాట్లాడలేదు.

ఇంటికి తిరిగివచ్చాక చక్రపాణితో అంది జానకమ్మ; "ఆలయంలో అనంతయ్యగారూ, ఆదిలక్ష్మి, సరోజనీ కన్పించారు. ఆయనకు ఎంత అభిమానమో మనపైన ఆ ఆదిలక్ష్మికి అంత అసహ్య మనుకుంటాను."

"ఏం ?" అడిగాడు పాణి.

"మేం దైవదర్శనం చేసుకుని వచ్చేస్తూంటే వారు అప్పుడే వచ్చారు ఆలయానికి. మమ్మల్ని చూచి, కారు దిగుతూనే మా దగ్గర కొచ్చేసి ఎంతో ఆప్యాయంగా పలుకరించి మంచీ-చెడ్డా కనుక్కున్నారు. ఆదిలక్ష్మి అసలు మాటే ఆడలేదు. దగ్గరకు వెళ్ళి నేనే పలుకరించాను. ముఖం త్రిప్పుకుని అక్కడినుంచి వెళ్ళిపోయింది"

"ఓహో," అంతకంటే చక్రపాణి మాట్లాడలేదు.

ఆ సంభాషణపట్ల అతడి ఉదాసీనతను గమనించిన తల్లి మరి మాటలు పొడిగించలేదు.



## 29

ఊరినుండి తిరిగివచ్చిన తరువాత ఇంటి విషయా లన్నిటినీ వాకబుచేసి కనుక్కోవటానికి ఈ రోజున తీరిక చిక్కింది అనంతయ్యగారికి. కేశవరావుకూడా ఊళ్ళో లేకపోవడం వలన గృహవిషయాలూ, వ్యాపారవిషయాలూ కూడా చాలా అస్తవ్యస్తంగా తయా రయ్యాయి. నౌఖర్లపైనా, ఆదిలక్ష్మిపైనా, శ్యామసుందర్ పైనా, అందరిపైనా చాలా ఆగ్రహంతో మండిపడ్తున్నాడు.

'నేను ఊళ్ళో లేనప్పుడే నువ్వుకూడా ఎందుకు పోయావు? ఇద్దరం లేకపోతే ఇంత సిర్వాకంగా తగులడ్తుం దని ఎరుగుదువు కదా!" అని విసుక్కున్నాడు కేశవరావును.

"ఊరికే వెళ్ళలేదండి. బ్రాంచి ఆఫీసునుండి వైరు వస్తే తప్పనిసరిగా వెళ్లాను" అన్నాడు కేశవరావు ఎంతో అణకువగా.

"తెల్సులేరా" అంటూ కోపం తగ్గించుకున్నాడు అనంతయ్య. అయ్యో, నాకంటె బాధ్యతతో మెలిగేవాడిని అనవసరంగా కోపపడ్డానే' అని లోలోపల బాధపడ్డాడు.

"మీ కందరికీ బుద్ధి వుందా లేదా? నేను ఎదుట ఉంటే ఒకటీ లేకుంటే ఒకటీనా? బాధ్యత తెలియవద్దూ? మరొకసారి ఇటువంటి తేడాలు వస్తే ఒక్కొక్కళ్ళనే ఉద్యోగాలనుంచి తోలిపారేస్తాను" అని మండిపడ్డాడు గుమస్తాలపైనా, నౌఖర్లపైనా.

ఆయన ఊళ్లో లేని ఈ ఇరవై రోజులలో ఆఫీసు అక్కౌంట్లలో నాలుగువేలు తేడా వచ్చింది. ఎవ్వరూ 'మాకు తెలియదంటే మాకు తెలియ' దంటున్నారు. అందుకే అనంతయ్య కోపం మరీ అవధులు దాటిపోయింది.

"ఇనప్పెట్టె తాళం తాళంలాగే వుండగా నాలుగువేలు పోవడమంటే ఎంత అవమానం? ఆ నాలుగువేలూ నాకు లెక్కలోనివి కావు. కాని రేపు మరొకటి ఇలాగే జరుగుతుంది ఇలా చూస్తూ వదిలేయవలసినదేనా? ఇంట్లో కెవరూ క్రొత్త మనుషులు రాలేదు. సిబ్బంది అంతా పాతవాళ్ళే. మరి ఇదివరకు లేని నకిలీతనం ఇప్పుడే వచ్చిందా? ఇది ఇలా వదిలివేయవలసిన విషయం కాదు."

ఎవ్వరూ మాట్లాడలేదు.

అంతలోనే కాలేజినుండి వచ్చి మేడమీదకు వెళ్ళిపోతున్న మాధవిని చూడగానే అతడి కోప మంతా ఎక్కడిదక్కడ ఎగిరిపోయింది.

"ఇలా రామ్మా బిందూ, రోజూ కాలేజీకి వెళ్తున్నావా?" అనడిగాడు.

"వెళ్తున్నాను నాన్నా:" అంటూ బిందు వచ్చి ప్రక్కనే కూర్చుంది సోఫాలో.

"ఈ రెండురోజులనుంచీ తీరికే లేకపోయిందమ్మా నీ విషయాలు కనుక్కోవడానికి. ప్రైవేట్ మాష్టారు వస్తున్నారా?"

"......" నిన్నటి విషయా లన్నీ మదిలో మెదుల్తూండగా జవా బివ్వలేకపోయింది. మాధవినుండి సమాధానం రాకపోయేసరికి అనంతయ్య కనుబొమలు ముడివడ్డాయి.

"ఏం? ఎందుకు రావడంలేదు? ఎవరైనా రావద్దన్నారా?" తీవ్రంగా ప్రశ్నించాడు.

"మీకూ మీ కూతురికీ ఇష్ట మయ్యాక ఎవరు ఏం చేయగలరు? ఎవరికి పెత్తన మేడిసింది గనక ఈ యింట్లో?" నిరసనగా అంది ఆదిలక్ష్మి.

విషయా లన్నీ చెప్పేద్దా మనుకున్నదిగాని మాధవి మళ్ళీ తటపటాయిస్తూ ఆగిపోయింది. "నాకు తెలియదు నాన్నా. నేను రావద్దనలేదు" అంది మెల్లగా.

శ్యాంసుందర్ మందు మ్రింగినట్లు ఎటో చూస్తూ కూర్చున్నాడు.

"నిన్న వచ్చినట్టున్నారండి,....." అంటూ నసిగాడు ఒక గుమస్తా

"ఏమమ్మాయి ?" నిశితంగా చూస్తూ అడిగాడు అనంతయ్య.

ఇక మాధవికి తప్పలేదు. కాని చుట్టూ అందరూ ఉండడంవల్ల అప్పుడుకూడ పూర్తిగా యదార్థం చెప్పలేకపోయింది. "నిన్న రుక్మిణి ఇంటినుంచి వచ్చేసరికి చాలా చీకటిపడిపోయింది. అక్కడే మాష్టారి ఇల్లుకూడా. నేను వెళ్ళి కారణ మడిగితే తిన్నగా చెప్పలేదు. 'ఊరికినే అశ్రద్ధ అయిపోయింది' అన్నారు. తర్వాత నేను వద్దని వారించినా 'చీకటిగా ఉన్న'దని నన్ను టాక్సీలో ఇంటిదగ్గర దిగబెట్టమన్నారు వాళ్ళమ్మగారు.........'

"ఊం, అయితే ?"

"ఇంతవరకూ వచ్చారుకాని దిగమంటే దిగలేదు. రానని వెళ్ళిపోయారు.

శ్రోత లందరూ తలొకవిధంగా ఆశ్చర్యపోయారు.

"గుమాస్తాగారూ ఇప్పుడే కారు తీసుకువెళ్ళి చక్రపాణిగారిని నేను రమ్మన్నానని ఒక్కసారి మీవెంట తీసుకురండి. ఎదురుసమాధానం రాకూడదు" నిప్పులు చెరగుతూన్న ఆ నేత్రాలను చూచి హడలిపోతూ వెనుకనడకలు నడుస్తూ వెళ్ళిపోయాడు గుమాస్తా.

మాధవి వదనం విప్పారింది.

కాని ఆగ్రహం పట్టలేని ఆదిలక్ష్మి ఆవేశాన్ని అణచుకోలేకపోయింది, "ఏ ఒక్క గొడవలోనూ ఈ తద్దినం తప్పడంలేదు. వా డెందు కిప్పుడు ? ఏమిటి వాడిమీద అంత మోజు ?" చుట్టూ నౌక ర్లున్నా రన్న సంగతికూడ మరచిపోయి అనేసింది

అసలే చికాకుగా ఉన్న అనంతయ్య అసహనం మరింత పెరిగిపోయింది "నోర్ముయ్. తెలివితక్కువదానా" అని ఎప్పుడూ లేనంత తీవ్రంగా మందలించాడు.

అందరి ఎదుటా జరిగిన ఆ అవమానాన్ని ఆదిలక్ష్మి సహించలేకపోయింది "చెప్తున్నాను వినండి ఇప్పుడు మీకేమీ ఒళ్ళు తెలియడంలేదు కాని ఈ చేసే పనులకు ఒకనాడు మీరే బాగా విచారిస్తారు. ఆనాడు లెంపలు వాయించుకున్నా ఫలితం కన్పించదు" శపించుతూన్నట్లు; సవాల్ చేస్తూన్నట్లు అంటూ వెళ్ళిపోయిం దక్కడినుంచి కళ్ళు ఒత్తుకుంటూ.

మౌనంగా ఉన్న కేశవరావు కలిగించుకున్నాడు. "ఎందుకు నాన్నా ఈ వాగ్వాదాలు. మీరు నడవండి పైకి."

అతడికేసి చూస్తూ హేళనగా నవ్వాడు. "కేశవ్, చాలా పెద్దమనిషిలాగ చెప్తున్నావు

కాని సరోజినిగారి మెళ్ళో క్రొత్త రవ్వల నెక్లెస్ ఎక్కడిది ? ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడట."

కెశవ్ ఒక్కసారిగా నిర్ఘాంతపోయాడు. వెంటనే ఏమీ మాట్లాడలేకపోయాడు. కాని అనంతయ్య నేత్రాలలో ఒక్కసారిగా క్రోధారుణ రేఖలు పేరుకున్నాయి. "శ్యాం! ఎవరితో మాట్లాడుతున్నావో, ఎవరి ఎదుట మాట్లాడుతున్నావో తెలుసా?" తర్జనితో బెదిరిస్తూ అన్నాడు. "కేశవ్ — ఈ యింటికి ఉత్తరాధికారి నన్నుమించిన బాధ్యతతో మెలిగేవాడిని గురించి నా ఎదుటే ఇలా మాట్లాడటానికి నీకెన్నిగుండెలు?"

అప్పటికి కొంచం తేరుకున్న కేశవ్ అన్నాడు. "ఆ నెక్లెస్ సరోజినికి పుట్టింటి వారు పంపించారు. అయినా ఇదేమి అభియోగం? డబ్బు నాకు కావలిస్తే నాన్నగారు లేనప్పుడు దొంగిలిస్తానా? ఇలా ఎప్పుడైనా జరిగిందా ఈ యింట్లో?"

"ఇదివరలో జరగనవి ఎన్ని జరగడంలేదు ఇప్పుడు? వాటిలో ఇదొకటి" ఇంకా అవహేళనతో నవ్వాడు శ్యాం.

"ఛీ నోర్ముయి" కోపంగా అరిచాడు అనంతయ్య.

కుటుంబంలోని ఆత్మీయవ్యక్తుల మధ్యనే కలతలు రేగి తమ ఎదుటనే వివాద పడడం చూచిన గుమాస్తాలకు కాస్త చనువు ఎక్కువైంది.

"పోనీ పోలీస్ రిపోర్టు ఇస్తేనాండి ?" అఖండమైన సలహా యిచ్చినట్టు పోజు పెట్టాడు ఒకతడు.

అప్పటికి కేశవరావు ఆగ్రహం బాగా అవధులు దాటిపోయింది. దానితో పరిస్థితి బాగా అర్థమైంది. కర్తవ్యమూ స్ఫురించింది.

పరివారజనంవైపు తిరిగి ఆజ్ఞాపించాడు. "మీ బోడి సలహా లెవరికీ అవసరం లేదుకానీ పోయి ఎవడిపనులు వాడు చూచుకోండి. ఒళ్ళు దగ్గరపెట్టుకు మసలుకోండి. మరెప్పుడూ ఇటువంటి పొరపాట్లు జరగకూడదు. ఈ జరిగిన విషయమూ—గొడవా ఎక్కడా బయట పొక్కకూడదు. జాగ్రత్త."

ఆ ఆజ్ఞ వినీ వినడంతోనే అందరూ పిల్లుల్లా వెళ్ళిపోయారు.

అప్పుడు కేశవరావు శ్యాంసుందర్ దెసగా తిరిగాడు. "శ్యాం, నీ పన్నాగం అర్థమైంది. ఇక నాచేత అధికంగా మాట్లాడించకు. తక్షణం వెళ్ళు మా యింటినుంచి."

ఒక్కక్షణం నిర్ఘాంతపోయిన శ్యాంసుందర్ వెంటనే తేరుకున్నాడు. "ఏం నీ బండారం బయట పెట్టాననా ? చూశావా బావా ?"

అనంతయ్య మాట్లాడకుండా మేడమీదకు వెళ్ళిపోయాడు. అదే తాను చేస్తున్న పనికి ఆమోదసూచకంగా గ్రహించాడు కేశవరావు.



"ఇంకా నాచేత అధికంగా మాట్లాడించకు. కుటుంబంలో వ్యక్తులమధ్య కలహాలు రేపి నీ పథకం నెరవేర్చుకోదలిచావా ? నడువు"

"వెళ్ళకపోతే ?"

"నౌకర్లక్కర్లేదు. మెడబట్టి నేనే బయటకు గెంటుతాను. వెంటనే పో, నీ సామాన్లుంటే తర్వాత పంపిస్తాను."

"సరే కాచుకో కేశవ్ నేను త్రాచుపామును ఆ సంగతి గుర్తుంచుకో. మాధవిని నాకు కాకుండా చెయ్యాలనేగా నీ తాపత్రయం ? నీ చెల్లెల్ని మించిన అప్సరసలు 'కో' అంటే కోటిమంది వాలుతారు నా పాదాల మీద. కాని ఇందుకు ప్రతీకారం చేయక మానను, గుర్తుంచుకో. నా కోరికే తీరుస్తావో నా కక్షనే అనుభవిస్తావో, రేపటి వరకూ గడువిచ్చాను" బెదిరిస్తూ వెళ్ళిపోయాడు శ్యాంసుందర్.

తర్వాత మెల్లగా బెదురుతూ తండ్రి గదిలోకి వెళ్లాడు కేశవరావు.

"నాన్నగారూ" అతిమంద్రస్వరంలో సంబోధించాడు "ఈ విషయంలో మీకు నాపై ఏమీ అనుమానం లేదు గదా ?" దీనావదనంతో ప్రశ్నించాడు

వాలు కుర్చీలో పడుకున్న అనంతయ్య త్వరగా లేచి కేశవరావు దగ్గరకు

వెళ్ళాడు. "ఏమిట్రా నీ తెలివితక్కువ? ఎవరో బుద్ధిమాలినవాళ్ళేదో అంటే ఇంత పట్టింపేమిటి దానికి? ఏమీ మనస్సులో పెట్టుకోకు" అంటూ వీపు తట్టాడు.

తండ్రికి తనపై అనుమానం లేని విషయం రూఢి కాగానే కేశవరావు ముఖం విప్పారింది.

"అయితే వాడికి ఉద్వాసన చెప్పేశావా?" అనంతయ్య అడిగాడు

"ఆ"

తేలికగా నిట్టూర్చాడు అనంతయ్య. "ఇంటికి శనిగ్రహం వదలపోయింది"

"కాని ఇంకా దాని ప్రభావం వుండేవుంటుంది ఇంటిని పట్టుకుని. మనం జాగ్రత్తగా వుండాలి"

"నిజమే"

అంతలోనే చక్రపాణిగారిని తీసుకువచ్చానని గుమాస్తా తెలియపరిచాడు.

"వస్తున్నాం, మేడమీద నా గదిలో కూర్చోబెట్టండి" అని పుర్మాయించాడు కేశవరావు.

"అమ్మాయి ఎక్కడుంది?" అడిగాడు అనంతయ్య.

"ఏవో నాటకాల రిహార్సల్సు వేసుకుంటున్నారటండి. స్నేహితుల ఇంటికి వెళ్ళిపోయానని చెప్పమన్నారు."

"సరే. మీరు వెళ్లండి."

గుమాస్తా వెళ్లిపోయాడు.

"నాన్నగారూ ఒక్కమాట"

"ఏమిటి?"

"........."

"చెప్పరా. సందేహం దేనికి?"

"మనం ఈ చక్రపాణిగారి విషయంలో ఇక అటోయిటో తేల్చుకోవడం మంచిదనిపిస్తుంది. మీ కొడుకును – నేననకూడదు కానీ అమ్మ మనకు పూర్తిగా వ్యతిరేకి. శ్యాం చేస్తున్న ప్రతిపనిలోనూ ఆవిడ చెయ్యి వుంటూందని నా అనుమానం. మనం త్వరపడకపోతే లాభంవుండదు"

కొంచంసేపు మాట్లాడకుండా అటు యిటు పచార్లు సాగించాడు అనంతయ్య; తర్వాత అన్నాడు "అవును నేనూ అలాగే అనుకుంటున్నాను కాని. ఇందుకు అమ్మాయి అంగీకారం కూడా వుండాలిగా?"

నవ్వాడు కేశవరావు "దాని కెప్పుడూ ఇష్టమే నాన్నా"

"కావచ్చు అయినా అమ్మాయి ముఖతః నేను స్వయంగా వినాలి ఆ మాట అప్పుడు నిశ్చయంగా అడుగవచ్చు ఈ వేళ తిథి మంచిదికూడా కాదు లక్ష్మివారం, శుద్ధపాడ్యమి అంచేత నువ్వు ఆ విషయా లేమీ మాట్లాడవద్దు "

' మరి ? అయినా పాడ్యమి మధ్యాహ్నంతో అయిపోయింది ఇవాళ తిథిద్వయం "

"సరే మన హంగుఅంతా చూపెట్టు అతడికి మెల్లగా యుక్తిగా తిప్పుకోవాలి మనవైపు "

' సరే అయితే రండి నేను వెళ్తూంటాను "

అనంతయ్యానూ కేశవరావునూ చూడగానే సోఫాలోనుంచి మర్యాదగా లేచి నమస్కరించాడు చక్రపాణి

"నమస్కారం ఏం ఎక్కువగా దర్శనాలే లేవు ' నవ్వుతూ పలకరించాడు అనంతయ్య

"ఏదో పను ఉండడంవల్ల నవ్వాడు చక్రపాణి

అందరూ కూర్చున్నారు

"తిరుపతినుండి వచ్చాక ఒకసారి మిమ్మ కన్పించా లనుకున్నానండి, కాని కుదరనే లేదు వచ్చినరోజు సాయంత్రమే వచ్చాను మర్నాడు వచ్చాను కాని మీరు "

"ఊఁ, నేను ? ఏమిటి ?" కనుబొమలు ముడివేశాడు అనంతయ్య

"దర్శనం ఇచ్చారుకాదు, ఎప్పటికప్పుడు మళ్ళీ రమ్మన్నారు ఆ తర్వాత ఊళ్లో లేరని తెలిసింది "

వింటూనే ఆశ్చర్యంగా ముఖముఖాలు చూచుకున్నారు తండ్రికొడుకులు

"అయితే ఆ కోపంతోనే నిన్న ఇంతవరకూ వచ్చికూడా దిగలేదన్నమాట ?" పాణి ముఖం పరిశీలనగా చూస్తూ ప్రశ్నించాడు అనంతయ్య

"అయ్యో, ఎంతమాట ? మీపైన కోపమాండి ? నిన్న శివరాత్రికదూ ? మీకు పూజలూ భజనలూ ఉంటా యని, నేను వచ్చి మీ కాలాన్ని పాడుజేయలేదు ఆల యంలో కన్పించా రని మా అమ్మగారు చెప్పారు "

' అయితే మళ్ళీ రమ్మన్నట్టు మీకు ఎవరు చెప్పారు ? అసలు మీరు ఏయ వేళలలో వచ్చారు ?" కేశవరావు అడిగాడు

"సాయంసమయంలోనండి శ్యాంసుందర్ చెప్పారు "

తిరిగి అనంతయ్యా కేశవరావూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు

' ఆ ఎం దుకు నేను చదువు చెప్పడం ఇష్టం లేనట్టే మాట్లాడారు నిన్న శ్యాం నన్ను కే సుకుని తిరిగి చెప్పాడు పాణి తటపటాయిస్తూనే

"ఓహో." తల పంకించాడు కేశవరావు.

"చూడండి అనంతయ్యగారూ" పోనీ మరో మంచి మేష్టర్ని ఏర్పాటు చేయ కూడదూ బిందుకు ?"

"ఎవరు నాకు సలహా యిచ్చేది ? నా కా మాత్రం తెలియదూ ?" ఆ కంఠంలోని తీవ్రతకు చకితు డయ్యాడు చక్రపాణి.

"చూడండి చక్రపాణిగారూ" అంతలోనే అతి సౌమ్యంగా మారిపోయింది అనంతయ్య కంఠస్వరం. "అమ్మాయికి గురువుగా రని కాదు—నాకు మీపై వేరే ప్రత్యేకాభిమానం ఏర్పడింది. ఎందుకో నాకే తెలియదు."

"వ్యక్తిని అభిమానించటానికి అంతస్థులూ, వయస్సులూ ప్రధానం కాదుగా మిమ్మల్ని నే నెప్పుడూ ప్రత్యేకంగా గౌరవిస్తాను. ఎవరిమాటలనూ నమ్మకండి లెక్కజేసుకోకండి.''

"ధన్యుడిని."

''మరి నాకు చాలా పనుంది. వెళ్తాను. మీరు మాట్లాడుకోండి. అమ్మాయికి ట్యూషన్ చెప్తూండండి. మానకండి.''

"చిత్తం.''

"తిరుపతియాత్ర బాగా జరిగిందా ?"

"చిత్తం. ఆ విషయం చెప్దామనే అసలు తమ దర్శినాని కొచ్చానండి. మీ దయ వల్ల ఏ మాత్రం శ్రమలేకుండా ఎక్కడి కక్కడ రాజభోగంగా గడచిపోయింది.

"బిందూ ఏమీ విసిగించలేదుకదా అల్లరితో ? దానికేం మర్యాదలు తెలియవు అన్నాడు కేశవ్

"ఎంతమాట ? పైకి అలా వుంటుందేకాని బిందుకు తెలిసినన్ని విషయా లెవరికీ తెలుసునండీ ! చాలా మంచిది.''

"అలాగా ?'' నవ్వాడు అనంతయ్య. "నా దృష్టిలో అది వట్టిమొద్దు. పసితనం వీడవిదావిలా కన్పిస్తుంది.''

తమ విషయం తెలిసి అనంతయ్య ఆగ్రహం పెంచుకున్నాడేమో నని ఇన్నాళ్లుగా లోలోన భయపడ్తూన్న చక్రపాణి హృదయంలో భయం తగ్గి తేలికైంది. ఆ మాటే పైకి అనేశాడుకూడ.

"నా వల్ల ఏమైనా లోటుపాట్లున్నాయేమో నని భయపడ్డాను సుమండీ చెప్ప వద్దూ ! ఇప్పుడు నా హృదయభారం తగ్గిపోయింది."

నో నో, అటువంటి దేమి పెట్టుకోకండి" అంటూనే అనంతయ్య వేరె పనిమీద వెళ్ళిపోయాడు.

రండి. అలా తోటలోకి పోయి కూర్చుందాం" అంటూ దారితీశాడు కేశవరావు. చక్రపాణి మౌనంగా అనుసరించాడు. అతడి నేత్రాలు బిందుకోసం వెతుకుతూండడం కేశవ్ గమనించకపోలేదు.

అతడి చూపులను గమనించినట్టు కాకుండా యధాలాపంగా చెప్పినట్టు చెప్పాడు--

"బిందు ఏవో నాటకాలూ రిహార్సలూ అంటూ ఎక్కడా ఇంటిపట్టున వుండడం లేదు దానికి చదువేమి టసలు ? వట్టిమొద్దు."

ఆలోచనలోనున్న చక్రపాణి పరధ్యానంగా ఊ కొట్టి వూరుకున్నాడు.

తోట అంతా — ఇంచుమించు రెండు ఫర్లాంగుల మేర నడచి నడచి మరో తోట లోకి ప్రవేశించారు. అప్పటికి పరిసరాలు గమనించిన చక్రపాణి చాలా ఆశ్చర్య పోయాడు.

ఏ సినీమాలోనో చూసినంత అందమైన తోట; చాలా ప్రశాంతంగా వుంది. ఎక్కడా బయట ప్రపంచంతో సంబంధంలేకుండా, పెద్ద చక్రాకృతిలోవున్న ద్వారం, దానిపై వలయాకారంగా లోహంతో వ్రాయబడిన అక్షరాలు 'మధువనం' సాంధ్యా తపంలో సుందరంగా మెరస్తున్నాయి. అక్షరాలచుట్టూ రంగురంగుల విద్యుద్దీపాల తోరణాలు, అయితే ఇంకా వెలిగించలేదు.

చక్రపాణి విస్మయంతో పరికించుతూనే కేశవరావువెంట లోనికి అడుగుపెట్టాడు. ద్వారాని కటూఇటూ చక్రాకృతిలో నున్న ఫౌంటెన్స్. 'మధుచక్రం' అని వ్రాసి వుంది రెంటిమీదా. అందంగా నీటిధారల నెగజిమ్ముతున్నాయి. అక్కడినుండి పెద్ద తోట ఆరంభ మైంది. మధ్యమధ్య అందమైన కాలిబాటలు, కండ్లు చెదరగొట్టే పుష్పవనం. అంతటా విద్యుద్దీప స్తంభాలు, మొక్కలకు నీళ్ళందిస్తూన్న మోటారు శబ్దం మాత్రం భరించలేకుండావున్నాడు పాణి.

పాణినీ కేశవ్‌నూ చూడగానే మొక్కలకు సంరక్షణచేస్తూన్న నలుగురు నౌకర్లు వచ్చి నమస్కరించి నిల్చున్నారు.

"అన్నింటికీ నీళ్ళందాయా ?" అడిగాడు కేశవరావు.

అం దాయి బాబూ."

"అన్నీ సక్రమంగా ఉన్నాయా ?''

ఉన్నాయండి.''

'సరే అయితే ఆ మోటారు ఆపేసి లైట్లు వేసి వెళ్ళిపోండి.''

నౌఖర్లంతా వెళ్ళిపోయారు. పాణీ కేశవ్‌లు ఏకాంతంగా మిగిలారు.

"ఇదికూడా మీదేనా ?" విద్యుద్దీపకాంతిలో కళకళలాడిపోతూన్న వనాన్ని ముచ్చటగా చూస్తూ ప్రశ్నించాడు చక్రపాణి.

నవ్వాడు కేశవరావు. "ప్రస్తుతానికి మాదే" అంటూ.

"అంతే ?"

"రండి మరి చూద్దురుగాని. అప్పుడు తెలుస్తుంది. మధువనం అని అక్కడ వ్రాసివుంది చూచారా ? ఇదంతా మధుమయం '' అంటూనే నడక సాగించాడు కేశవ్.

తోటకు మధ్యగా అందమైన చిన్న బంగళావుంది. అది 'మాధవీ మందిరం !' ఆ బంగళా కుడిప్రక్కన అంతా రకరకాల పుష్పలతలు అందంగా అల్లుకుని చిన్న పొదరింటిని ఏర్పరచాయి. అది 'మధునికుంజం !' బంగళా వెనుక పెద్ద పాలరాతి విగ్రహం ఒయ్యారంగా నిలచివుంది, చేతులలో అందమైన లోహపాత్రతో. ఆ ఒయ్యారి 'మధుకరి !'

ఆ పాత్రనుండి ధారాపాతంగా ప్రవహిస్తూన్న నీరు ఒక అందమైన కాసారంగా ఏర్పరింది ఆ సరస్సు 'బిందుసాగరం !' అందులో ఒక అందమైన నావ 'మధు !' కొలనుచుట్టూ రకరకాల పూలమొక్కలు, సిమ్మెంటు బెంచీలు, కొద్దిదూరంలో పెద్ద మామిడిచెట్టు కొమ్మలనుండి వ్రేలాడుతూన్న వెండిగొలుసుల చిన్న ఊయల !

అక్కడ మరీ పెద్దపెద్ద గ్లోబ్‌లైట్లు వెలుగుతున్నాయి సప్తవర్ణాలతో. ఆ అందం వర్ణనాతీతం !

"ఆ బొమ్మ చేతి కడవనుండి నీరు ఎట్లా ప్రవహిస్తోంది ?" ఆశ్చర్యంతో అడిగాడు చక్రపాణి.

కేశవరావు వివరించాడు. "ఆ కొలనులో నీరే అందులోకి వెళ్ళి తిరిగి వచ్చే ప్రత్యేక ఏర్పాటు వుందిలెండి. అదంతా ఒక స్పెషల్ ఇంజనీర్‌చేత ప్లాను వేయించి తయారుచేయించినది."

"మీరు లక్షాధికార్లనే విన్నానుకాని మరీ ఇంతగా భూతలాన్నే స్వర్గధామం చేసేయగలంత కుబేరు లనీ, కళాత్మక హృదయు లనీ అనుకోలేదు !"

చక్రపాణి మాటలకు అదొకమాదిరిగా నవ్వుతూ ముందుకు సాగాడు కేశవరావు ఇద్దరూ వెళ్ళి ఉయ్యాలపై కూర్చున్నారు. కూర్చునీ కూర్చోగానే 'బావ బావ !' అనే చిలుక పలుకులూ గుజ్జం సకిలింపూ వినవచ్చి ఉలిక్కిపడి అటు చూశాడు చక్రపాణి.

అక్కడొక గుఱ్ఱాలసాల వుంది. ఒక భాగంలో ఒక పెద్ద శ్వేతాశ్వం వుంది. రెండవ దానిలో ఒక మామూలు గుఱ్ఱం కట్టివేసి వుంది. మూడవభాగంలో ఒక గుఱ్ఱపు బగ్గీ. ఒకచెట్టునుండి వ్రేలాడుతూన్న నాలుగు పంజరాలలో రామచిలుకలు, మైనాలు

"అవి బిందు పెంపుడు చిలుకలు. ఆ తెల్లగుఱ్ఱం స్వారీగుఱ్ఱం—పంచకళ్యాణి అది గుఱ్ఱపుసార్యూ, దాని గుఱ్ఱం. ఇప్పుడే కార్లు వచ్చాక వాటి నంతగా వాడడం లేదను కోండి. ఊరికే దర్జాకోసమే. ఏ ఒక్కటీ బిందు కన్పించకపోతే తిండి తినదు."

"జమీందార్లు!" అన్నాడు చక్రపాణి.

కేశవరావు ఆ మాట తప్పించాడు.

"ఇదీ మీదేనా అని కదూ అన్నారు?"

"..................." చక్రపాణి సమాధాన మీయలేదు. కేశవరావు మాట ప్రశ్నరూపంలో ఉన్నా అది సమాధాన మక్కరలేని ప్రశ్న. సంభాషణకు ఉపోద్ఘాతం ఆ ప్రశ్న.

"ఇదంతా మధుమయమే చూచారా? అదుగో ఆ పైపున ఇంకా యిప్పుడిప్పుడే పనులు ప్రారంభించాం. పునాదులు లేస్తున్నాయి చూచారా? అది 'మధుపురం' అక్కడొక మేడ కట్టబోతున్నాం."

"అవును. చూచాను."

"ఇదంతా నాన్నగారి రెండవప్రాణం — బిందుమాధవీకుమారికోసం."

ఏంటూనే ఆశ్చర్యంగా చూచాడు చక్రపాణి.

కేశవరావు తిరిగిచెప్పాడు. "అందుకే ఇక్కడ సర్వం ఆవిడ నామధారణే పొందింది. నాన్నగారికి మాధవంటే ప్రాణం. ఆవిడ పుట్టాకనే ఆయన వ్యాపారం కోట్లకు పడగలెత్తింది. అంచేత ఇదంతా ఆవిడ చలవే ననీ, లక్ష్మీదేవే ఈ రూపంలో తన యింట అవతరించిందనీ ఆయన నమ్మకం. అందుకే అతి గారాబంగా దానివి ఆడింది ఆటగా వదిలేస్తారు."

మౌనంగా, ఆశ్చర్యంగా వింటున్నాడు చక్రపాణి. ఇవన్నీ తనకు చెప్పడ మెందుకో, ఎందుకు చూపుతున్నాడో అర్థంకాక ఒక వంక తికమకపడ్తున్నాడు.

కేశవరావు అతడి ముఖకవళికలను గమనిస్తూనే చెప్పుకుపోతున్నాడు. "మాధవిని వివాహం చేసి ఇంట్లోనే ఉంచుకోవా లని నాన్నగారి కోరిక. మాధవి ఇల్లు దాటితే మాధవి పుట్టుకతోనే వచ్చిన లక్ష్మికూడ దాటిపోగల దని ఆయన నమ్మకం: ఆయ నేమిటిలెండి, మా అభిప్రాయంకూడ అంతే. అదీకాక బిందు అతి గారాబంగా

పెరుగుతూంది. దానికి జీవితకాలమంతా అలాగే జరగాలని — జరిపించాలని మా నిర్ణయం. అట్లాగని మా ప్రమేయం ఏమీ ఉండ దనుకోండి. వాళ్ళ స్వేచ్ఛకు మా ఆటంకం ఏమీకూడా ఉండబోదు. అందుకే ఇలా విడిగా పూర్తి సౌకర్యాలతో ఈ మధుపురం, మధువనం ఏర్పాటు చేస్తున్నాం. ఇక యోగ్యుడైన వరుడు లభించటమే తరువాయి."



వింటూన్న చక్రపాణి వదనంలో హాస, ప్రసన్నరేఖలు మాయమై ముఖం చిన్నబోవడం గమనించిన కేశవరావు వదనం మలిన మైంది. ఎవరికీ ఒకరి అంతర్యా లొకరికి బోధపడలేదు.

'ఈయన చాలా తెలివైనవాడే? ఈ ప్రసంగం ఉద్దేశ్యం గ్రహించలేడా?



గ్రహించితే సంతోషించి ఆకాశాని కెగిరి గంతెయ్యాలి కాని ఇలా చిన్నముఖంతో ఏదో అనర్థం వాటిల్లినట్టు కూర్చుంటా దేమిటి?' ఈ విధంగా వున్నాయి కేశవ్ ఆలోచనలు.

చక్రపాణి ఆలోచనకు ఒక తీరూ తెన్నూ లేదు. పరిపరివిధాల పరుగులిడుతూంది ఆతడి మనస్సు. 'ఇంత ధనవంతులం మేము తెల్సుకో' మని నాకు తెలియచెప్తున్నారా? ఈ ధనప్రలోభం ఎరగా జూపి నన్ను లొంగదీసుకోవా లని చూస్తున్నారా? ఛ, నా దురాశ కాని నేను ఈ లక్షాధికార్ల కంటికి ఆనుతానా? వారి ఇంటి అల్లుడి హోదా ఎక్కడ? నేనెక్కడ?

వారి కాలిగోటైనా నేను పోల్తానా : ...ఓహో ! తెలిసింది. వారి అంతరం నా అంతరం నాకు ఈ విధంగా తెలియజెప్తున్నారన్నమాట ! ఒళ్ళు తెలుసుకు బ్రతకమని హెచ్చరించారన్నమాట. బహుశః తిరుపతిలో మాధవీ తానూ అంత సన్నిహితంగా మెలగడం-ఆమే తానూ చేసుకున్న నిర్ణయం వీరి కెలాగో తెలిసినట్లుంది.

ఒకవేళ మాధవే చెప్పిందేమో ? అందుకే ఆమెను ఇవ్వాళ నాకు కన్పించకుండా చేశారు. ఈ కోపంతోనే నేను రెండుసార్లు వచ్చినా నాకు దర్శనం కానీయలేదు. కాని......ఇదేమిటి ? ఈ విధంగా ఆలోచిస్తున్నా నేమిటి ? అనంతయ్యగారు నాకు ఎంత సాయంచేశారు ! ఆయనే ఆదుకోకపోతే నేనివాళ ఇలా నిలబడేవాడినేనా ? మరి ? ఒక విషయం కావచ్చు. అనంతయ్యగారు నన్ను తమ సహజ జమీందారీ హోదాతో నన్ను తమపరివారంలో ఒకడిగా ఆదరిస్తున్నారు. బిందు చిన్నతనంవల్లా, స్త్రీ కావడంవలనా నాచే ఆకర్షింపబడింది. బహుశః అది వీరికి ఇష్టం ఉండి ఉండదు. అందుకే ఆలా మర్యాదగా హెచ్చరిస్తున్నారు. అనంతయ్యగారి సంగతెలాగున్నా మిగిలిన కుటుంబమందరికీ ఇష్టం లేదన్నమాటే. అందుకే నిన్న శ్యాంసుందర్ అలా ఇంటిమీదికి వచ్చి పోట్లాడ గలిగాడు. వెనుక ఎవరి అండ లేనిది అంత ధైర్యంగా పోట్లాటకు వస్తాడా మరి ?

'ఛ ఛ ఛ. ఎంత అవమానం ! ఇలా హెచ్చరింప జేసుకోవడం ఎంత అమర్యాద ? చాలు' ఇకనైనా ఈ అతిచనువులకూ, అట్టహాసాలకూ ఉద్వాసన చెప్పాలి. అందుకే సాటివారితో స్నేహం చేయమన్నారు.' అనుకుంటూ తల ప్రక్కకు త్రిప్పే సరికి కేశవరావు తననే పరీక్షగా చూస్తూ కన్పించాడు.

మెల్లగా ఊయెలపైనుండి లేచి నిల్చుని అన్నాడు చక్రపాణి. "క్షమించండి కేశవరావుగారూ. నా వల్ల మీ మనస్సులు చాలా గాయపడినా యనుకుంటాను హృదయ పూర్వకంగా క్షమించండి. మరి మీ గడప త్రొక్కను. కానీ ఒకమాట-నేనేమీ తప్పుగా మితిమీరి ప్రవర్తించలేదు. అది మాత్రం మీరు గ్రహించి నాపై కోపం తగ్గించుకుంటే చాలు."

"ఏమిటి మీరు మాట్లాడేది ?" అయోమయంగా చూస్తూ అడిగాడు.

"మీ మనస్సులో ఉన్నదే. అనంతయ్యగారికీ మీకూ అందరికీ నాపై అభిమా-నని మురిసిపోయాను. కాని ఈ అకారణ వాత్సల్యం ఏమిటా అని ఆలో-ంచలేకపోయాను. అనంతయ్యగారు నన్నొక విద్యావంతునిగా గౌరవించారు. ఆ గౌరవాన్ని నేను నిలుపుకున్నా ననే అనుకుంటున్నాను. కాని మీరు అకారణంగా న న్నపార్థం జేసుకున్న ట్లున్నారు. పోనీ మీ అయిష్టమైనా సూటిగా చెప్తే తీరిపో- -ఎ వదండీ! నన్ను కొట్టించడం దేనికీ ? నా యింటి కొచ్చి అనరాని మాట లనడం దేనికీ ? నేను

నిర్మలంగా బ్రతకాలనుకొనేవాడినే కాని ఎవరితోనూ ~ గొడవలూ తెచ్చుకోను. ఎవరికీ ఏ అపకారమూ తలపెట్టను. సరే, ఇక సెల విప్పించండి."

చక్రపాణిని పోనీయకుండా చేయి పట్టుకుని పకపకా నవ్వసాగాడు కేశవరావు.

"ఎంత అమాయకులండీ మేష్టారూ ? మీ ఎమ్మేపాండిత్య మంతా యిదేనా ?"

ఈసారి విస్తుపోయి చూడడం చక్రపాణి వంతు అయ్యింది.

అతిప్రయత్నంమీద నవ్వు నాపుకొంటూ కేశవరావు అన్నాడు. "మిమ్మల్ని అమాయకులనుకోనా లేక అతితెలివైనవాళ్ళనుకోనా?" అంటూ తిరిగి నివ్వాడు.

"సరే, ఇవ్వాళ ఈ విషయాలేమీ కదపడం నాకు ఇష్టంలేదుకానీ మీ ధోరణి చూచాక తప్పదనిపిస్తూంది. ఇవన్నీ చూపించడంలో గల అంతరార్థం మీరు ఊహించినది కాదు. మాకు తగిన వ్యక్తి కోసం నిరీక్షిస్తున్నామనే సంగతి మీకు తెలియపరచడానికీ, 'తగిన వ్యక్తి' అంటే 'అన్నివిధాలా మాకూ మా బిందుకూ తగిన వ్యక్తి' అనీ. ఇంతకంటె మీకేమీ ఇప్పుడు వివరించలేను. ఇంటికి వెళ్ళి తీరికగా ఆలోచించుకోండి."

విషయం మారిపోయి ఊహించని మరొక క్రొత్త విషయం-కలనైనా ఆశించనిది ఎదురురావడంతో చక్రపాణి మానసికస్థితి అతడి ఊహకే అందుబాటులో లేకుండా పోయింది. అవధులుమించిన ఆశ్చర్యానందాలతో మాటే ఆడలేకపోయాడు.

"నడవండి, చాలా ప్రొద్దుపోయింది" అంటూ ఉయాలనుండి లేచాడు కేశవరావు.

చక్రపాణి మంత్రముగ్ధుడిలా అనుసరించాడు.

లైట్లు తీసివేసి గేటు మూసి వచ్చేస్తూంటే చిలుకల పలుకరింపులూ, అశ్వాల సకిలింపులూ వినవచ్చాయి.

ఎవరి ఆలోచనలో వారు కొట్టుకుపోతూ మౌనంగా నడవసాగారు.

"అయితే శ్యాం నిన్న సాయంత్రం మీ యింటికి వచ్చాడంటారా?" సాలోచనగా అడిగాడు కేశవరావు.

చక్రపాణి విషయాన్ని క్లుప్తంగా చెప్పాడు.

"ఓహో!" తల పంకించాడు కేశవ్ "అతడు మాకు బంధువే కాని ఇవ్వాళటి నుంచి ~ క్కికీ మాకూ ఏమీ సంబంధంలేదు. ప్రస్తుతం మా యింట్లో వుంటమేలేదు."

ఆశ్చర్యంగా చూచాడు చక్రపాణి.

"అవు ం" మళ్ళీ ముందుమాటనే స్థిరీకరించాడు కేశవ్ ఈ విషయం మీకు తెలియడం ~ దని చెప్పాను. అతడికి మా విషయాలలో జోక్యంఅనవసరం. మీరూ అతడిని లెక్క జేయ నవసరం లేదు. అసలు మీ గడప త్రొక్కనివ్వకండి."

పాణి మౌనంగానే వింటున్నాడు.

"అయితే ఒక్క మనవికూడా; ఎప్పుడూ ఆ శ్యాంనూ నన్నూ కలిపి మాత్రం ఊహించకండేం!" అని పకపకా నవ్వేస్తూ గంభీరంగా ఉన్న వాతావరణాన్ని తేలిక పరచేశాడు కేశవరావు.

అప్పటికి తన పొరపాటూ, కర్తవ్యమూ గుర్తించిన చక్రపాణి సిగ్గుపడూ తలెత్త లేక ఎత్తలేక ఎత్తాడు. "నన్ను క్షమించండి కేశవరావుగారూ, అవివేకంగా ఆవేశపడి అనుచితంగా మాట్లాడాను."

కేశవ్ నవ్వాడు. "ఫర్వాలేదులెండి. వచ్చిన అనుమానాలు వచ్చినట్టే వెంటనే తీరిపోయాయిగా? ఇక అంతా శుభమే. అయినా ఇదీ ఒకందుకు మంచిదే అయ్యింది లెండి. శ్యాం గురించి క్రొత్త విషయాలు తెలిశాయి. నే నెప్పుడూ అనుకుంటూనే వున్నాను-అతడు పయోముఖ విషకుంభ మని- ఇవ్వాళ ఆధారాలుకూడా దొరికాయి.

"ఇటువంటి ఆవేశకర పరిస్థితే రాకుంటే ఈ విషయాల నిలాగే వెల్లడించకుండా గోప్యంగా మీలో మీరు ఎంతకాలమైనా దాచుకొందురు."

"అరెరే" విచారం వ్యక్తపరిచాడు చక్రపాణి, "మీలో మీకు గొడవలు రేపిన వాడిని ఔతానే."

"ఏం ఫర్వాలేదు. అది మీకనవసరం కాని యింటికి వెళ్ళి బాగా ఆలోచించండి. ఇప్పట్లో ఇక అధికంగా మాటలు వద్దు, వెళ్ళండి."

"సరే."

ఇద్దరూ కారుదగ్గరకు నడిచారు.

అలవాటు ప్రకారం వెనుకసీటు దగ్గరకు పోబోతూన్న పాణిని "ఇలారండి. అక్కడ ఖాళీలేదు.బియ్యంబస్తా వుంది" అన్నాడు డ్రైవరు ముందుతలుపుతీసిపట్టుకుని.

చక్రపాణి ఆశ్చర్యపోయి ప్రశ్నార్థకంగా కేశవరావువైపు చూచాడు.

కేశవరావు నవ్వాడు. "జీతానికి చదువు చెప్పే అలవాటు మీకు లేదు. మీ పద్ధతి మాకు నచ్చింది. కాని ఊరికేచెప్పించుకునే అలవాటు మాకులేదు. మా పద్ధతులు మావి. అందుకై మీరు కలవరపడరాదు పూర్వకాలపు గురుశిష్య బాంధవ్యాలిలాగేవుండేవి."

'నన్ను మరీ మొగమాట పెటేస్తున్నారు మీరు. తట్టుకోలేకుండా వున్నాను." అన్నాడు చక్రపాణి. "సంక్రాంతికీ అలాగే ఎన్నో పంపించారు అసలందులకే నాకు చాలా బాధగా వుంటూంది రావడానికి నేను చెప్పిన దేమాత్రం చదువు చెప్పండి."

"చెప్పానుగదా అవి మా పద్ధతు లని; మరి మాట్లాడకండి. వెళ్ళండి," అన్నాడు కేశవరావు చక్రపాణి భుజంపై చేయివేసి, "మరి నమస్కారం."

"నమస్కారం." కారు సాగిపోయింది. (సశేషం)

Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88,
Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI".

తప్పక

చూడండి!


RAJALAKSHMI


రాజలక్ష్మి ప్రొడక్షన్స్ వారి
గుడిగంటలు
దర్శకుడు వి.మధుసూదనరావు నిర్మాతలు సుందర్‌లాల్ నహతా - డూండీ
రాజశ్రీ విడుదల



